# భారతీయ మహిళ

## (కథా కథనం)

Acc. No: 23247

UOL/ROP

2670/ROP

డా॥ కసిరెడ్డి

ప్రచురణ:

**నవయుగ భారతి ప్రచురణలు**

భాగ్యనగర్ - ఆంధ్రప్రదేశ్

# భారతీయ మహిళ

(కథా కథనం)

- డా॥ కసిరెడ్డి

ప్రథమ ముద్రణ :

1998 జనవరి 12

ఈశ్వర-పుష్య-పౌర్ణమి

ప్రతులు : 2,000

ప్రచురణ :

**నవయుగ భారతి ప్రచురణలు**

3-4-842, బరకత్‌పుర, భాగ్యనగర్ - 500027

ప్రతులకు :

**సాహిత్యనికేతన్**

3-4-842, బరకత్‌పుర

హైదరాబాదు - 500027

**సాహిత్యనికేతన్**

ఏలూరు రోడ్డు, విజయవాడ -500002.

ముఖ చిత్రం :

**సూరి**

ముద్రణ :

**ఓం సాయి గ్రాఫిక్స్**

నారాయణగూడ, హైదరాబాదు

ఫోన్ : 7560543, 7564141

**మూల్యం : రూ. 20-00**

# ప్రకాశకీయం

కీ.శే. శ్రీమతి మేడూరి రామలక్ష్మిగారి దివ్యస్మృత్యంకితంగా ఈ గ్రంథం వెల్వరిస్తున్నాం. ఒక ఆదర్శమహిళగా జీవించి సరిగా సంవత్సరం క్రితం వారు పరమపదించారు. యుగయుగాల భారతీయ మహిళల్లో వారొకరై నిలిచారు.

రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ విభాగ్ సంఘచాలకులు, కర్నూలులో సుప్రసిద్ధ న్యాయవాదులు, వివేకానంద సంస్కృత సమాజం తదితర విద్యాసంస్థల వ్యవస్థాపకులు, శివాజీ మెమోరియల్ - తదితర స్ఫూర్తికేంద్రాల కార్యదర్శులు అయిన శ్రీ ఎం.డి.వై. రామమూర్తిగారి ధర్మపత్నీ, కీ.శే. శ్రీమతి రామలక్ష్మిగారు. వారి స్మృత్యంకితంగా నవయుగభారతి పక్షాన "భారతీయ మహిళ" అనే ఈ గ్రంథం వెల్వరించే అవకాశం కల్పించినందుకు శ్రీ రామమూర్తిగారికి ధన్యవాదాలు.

శ్రీరామమూర్తిగారు వివిధ కార్యక్రమాల మీద ఊరూరా తిరుగుతుండేవారు. ఇక 1975 అత్యవసర పరిస్థితి పుణ్యమా అంటు దాదాపు రెండేళ్ళు మీసా క్రింద కటకటాల వెనుక సమభావుకులైన వారితో చర్చిస్తూ తర్కిస్తూ కాలం గడిపారు. ఆ కాలంలో శ్రీమతి మేడూరి రామలక్ష్మిగారు కుటుంబంలో, ఆ సమయంలో వారు లేని లోటు కనిపించకుండా సంఘపరివారక్షేత్రాలకు సంబంధించిన కార్యక్రమాలను యుక్తియుక్తంగా ప్రత్యక్షంగా పరోక్షంగా నిర్వహిస్తూ వచ్చారు.

ఆ సమయంలో ఇంట్లోకి ఓ రోజు సిఐడి పోలీసు అధికారులు వచ్చి అవీఇవీ అడుగుతూ సోదా చేస్తున్నప్పుడు జిల్లా స్థాయి సంఘ ప్రచారక్ ఒకరు నేరుగా లోనికి వస్తుండడం వారు చూశారు. పోలీసులకిప్పుడు వారు చిక్కడం బాగుండదని గ్రహించిన శ్రీమతి రామలక్ష్మిగారు "ఒరేయ్! ఇంతసేపు ఎక్కడికెళ్లావురా! ఆ పశువుల కొట్టం వైపు నుండిరా! అన్నం తిందువుగాని..... పళ్లెంలో అన్నం పెట్టాను" అంటూ కేకలేశారు. ఆ కార్యకర్త అరెస్టు కాకుండా అలా తప్పించగలిగారు శ్రీమతి రామలక్ష్మిగారు. ఎమర్జెన్సీలో కర్నూలులో మీసా క్రింద అరెస్టయిన సంఘ పరివార క్షేత్రాల వారెందరో ఉన్నారు. వారందరి ఇంటింటికి వెళ్లి వారు ధైర్యం చెప్పేవారు.

వారి కర్మయోగిని జీవితానికి నిజానికి తీరిక అనేదే ఉండేది కాదు; అయినా

సమయం తీసి తమ యింటి పరిసరాల్లోని గృహాల్లో ఉండి ఏదో పని చేసుకొని జీవనం గడిపేవారి పిల్లలను చేరదీసి అక్షరాస్యులుగా చేయడం, వారిలో సంస్కారాలు నాటడం వారి జీవితంలో అంతర్భాగమయింది. నిరంతరం ఏదో ఒక గ్రంథం చదువుతుండడమే గాక, ఎప్పుడో డిగ్రీ పూర్తి చేసిన తమ చదువుకు ఈ విధంగా సార్థకత కలిగేట్టు చేసుకొన్నారు. వారికి సంగీతంలో అభిరుచి ఉండేది; ఆ కారణంగానే అందులోనూ డిగ్రీ పూర్తి చేశారు. సంప్రదాయసిద్ధంగా తమకు తెలిసిన మందును పచ్చకామెర్లతో బాధపడుతున్న వారికి ఉచితంగా ఇచ్చేవారు. పైగా పథ్యం విషయంలోనూ కావల్సిన సామగ్రిని తామే సమకూర్చి అందించేవారు. శ్రీరామమూర్తిగారు సంఘవికాస కార్యక్రమాలకు ఎక్కడెక్కడికో వెళ్లినా, సంఘ చైతన్య కేంద్రంగా వారి గృహం ప్రకాశించడానికి కారణంగా నిలిచిన వారు మాత్రం స్వర్గీయ శ్రీమతి మేడూరి రామలక్ష్మిగారే అని చెప్పకోక తప్పదు.

ఎక్కడో అనకాపల్లిలో పుట్టి, కర్నూలులో అత్తవారింటిలో కాలుపెట్టి, గృహిణిగా తన బాధ్యతలు నిర్వర్తిస్తూనే, జీవితాంతం హిందుత్వ వికాసం మీదనే దృష్టి నిలిపిన శ్రీమతి రామలక్ష్మిగారిని ఈ గ్రంథావిష్కరణ సందర్భంగా సంస్మరించుకోవడం - ఒక ఆదర్శ ప్రేరణాత్మక "స్మృతి"గానే మేము భావిస్తున్నాం.

వారి దివ్య స్మృతికి గుర్తుగా భారతీయ మహిళా జీవనాన్ని కథాకథన శైలిలో అందించాలని శ్రీరామమూర్తిగారు సంకల్పించడం, దానికి జాగృతి వారపత్రిక సంపాదకులు శ్రీవడ్లమూడి రామమోహనరావుగారు రూపురేఖలివ్వడం, డా॥ కసిరెడ్డిగారు పదిరోజుల్లో "భారతీయ మహిళ"కు అక్షరాకృతినివ్వడం, ఈ గ్రంథం ఇలా పాఠకుల చేతుల్లోకి రావడం అన్నీ చకచకా జరిగిపోయాయి. మరి ఆలోచనలు పంచుకొనే ఒకసాధనంగా ఈ గ్రంథం ఉపయోగపడుతుందని ఆశిస్తూ, ఇది రేఖా మాత్ర పరిశీలనే తప్ప సమగ్ర అధ్యయనం కాదంటున్న గ్రంథ రచయిత అభిప్రాయంతో ఏకీభవిస్తూ, భారతీయతా దృక్పథంతో అధ్యయనం చేయడానికి ఈ గ్రంథాన్ని సమగ్రంగా తీర్చిదిద్దడంలో అధ్యయన శీల దార్శనికుల ఆలోచనలను ఆహ్వానిస్తూ - గ్రంథం వెల్వరించడంలో సహకరించిన అందరికీ ధన్యవాదాలు తెలియజేస్తూ - సెలవ్.

భవదీయ
ప్రకాశకులు
నవయుగభారతి, ఆంధ్రప్రదేశ్

భాగ్యనగర్, ఈశ్వర మకర సంక్రాంతి,
1998, జనవరి 12

# స్మృత్యంకితం



**కీ.శే. శ్రీమతి మేడూరి రామలక్ష్మిగారి దివ్యస్మృతిలో....**

ఎచ్చోట పుట్టినా ఎచ్చోట మెట్టినా
ఎచ్చోట గిట్టినా మిగులునది మంచియే
భౌతికమ్మదియేదో మాయమైపోతుంది
మనిషి చేసిన మంచి అక్షరమ్మవుతుంది

చెట్లు ఫలముల నిచ్చు నదులు నీరములిచ్చు
గోవులే క్షీరాలు హర్షించి వర్షించు
సజ్జనత్వము మహికి సంపదల నర్పించు
ఉపకారమే బ్రతుకు ధ్యేయమని నినదించు

కష్టాల చీకట్లు ముసురుకొన్నా గాని
ఇష్టపడినట్టి శ్రీపథము విడువని వారు
తన వెనుక వారికెపుడాదర్శమవుతారు
మాతృశ్రీ మేడూరి రామలక్ష్మవుతారు

భారతీయాత్మ ప్రతిబింబాలు మహిళలని
ఆదర్శమును సక్రియమ్ముగా చూపించి
సరిగ సంవత్సరము క్రింద విశ్వాత్మలో
లీనమయ్యిన తల్లికీ గ్రంథ మంకితం.



# విషయసూచిక

భారత్‌మాతాకీ జై



# వేదాలలో మహిళలు

✤ భారతీయ మహిళ - మాతృశక్తి

1. బ్రహ్మవాదిని **గార్గి**

2. శ్రేయోమార్గంలో **మైత్రేయి**

3. ప్రేయోమార్గంలో **కాత్యాయని**

4. సుజ్ఞాని **సులభ**

5. వేదాల్లో వందలకొలదిగా మహిళలు

✤ మాతృశక్తి దివ్యత్వం

# వేదాలలో మహిళలు

## ❖ భారతీయ మహిళ - మాతృశక్తి

"ఆత్మవత్ సర్వభూతాని, మమాత్మా సర్వభూతాత్మా"

అని హిందూజాతి విశ్వసించింది. తన ఆత్మ సర్వప్రాణుల ఆత్మ ఒక్కటే అన్న భావన ఈ దేశంలో అనాదిగా ఉంది. మానవుల భావాలు అక్షరాకృతి ధరించి, మొదట వేదాలలోనే కనిపించాయి. అంతటా ఉన్నది తన ఆత్మే అని, అంతటా ఉన్న ఆత్మే తనలోనూ ఉన్నదని హిందూ జాతి భావించింది.

ఆత్మకు స్త్రీ అనీ, పురుషుడనీ, మృగమనీ, పక్షి అనీ, పామనీ భేదం లేదు. అందరిలోనూ అంతటా ఉన్న ఆత్మ ఒక్కటే.

ఈ సంసారంలో ఎవరి విధి వారు నిర్వర్తిస్తారు. పరస్పరం సహకరించుకొంటారు. ఇచ్చి పుచ్చుకొని జీవిస్తారు. వర్గపోరాటమే జీవితమనుకొంటే, అదే చరిత్ర అనుకొంటే కలిసి బ్రతికే వ్యవస్థ ఏర్పడేదే కాదు. ఆత్మీయత, అనురాగం, అనుబంధం సర్వప్రాణుల మధ్య ఎప్పటికీ ఉంటాయి.

జగత్తునే జగన్మాతగా భావించిన సమాజం మనది. తొలి గ్రంథమైన వేదాన్ని వేదమాతగా పిలుచుకొన్నాం. భూమిని భూమాత అన్నాం; నీటిని గంగామాత అన్నాం; గోవును గోమాత అన్నాం. మాతృరూపి సమాజం మనది.

"మాతాపృథ్వీ పుత్రోఽహం పృథివ్యాః" – ఈ నేల నాతల్లి; ఈ నేలకు నేను పుత్రుణ్ణి అని భావించేట్లుగా వేదమే మనకు బోధించింది. అందుకే మనం జీవిస్తున్న, పదిమందిమి కలిసి నడుస్తున్న ఈ సమాజాన్ని పుత్ర రూపి సమాజంగా చెప్పుకొంటాం; ఈ సృష్టినంతా మాతృరూపంగా గౌరవిస్తాం. ప్రపంచంలో తమ దేశాన్ని మాతగా భావించిన జాతులు తక్కువ. చాలా జాతులకు ఫాదర్ ల్యాండు (పితృభూములు)లున్నాయేగాని, మదర్‌ల్యాండులు (మాతృభూములు) లేవు. భూమి మీద కాలు మోపుతూనే "పాదస్పర్శం క్షమస్వమే" - అంటాడు హిందువు. అంటే నా కాళ్లు నీకు తాకుతున్నాయి క్షమించమ్మా అని అర్థం.

ఈ మాతృభావనే కుటుంబ వ్యవస్థకు మూలాధారమయ్యింది. కుటుంబం అనేది ఒక శరీరం; ఈ శరీరంలోని సర్వాంగాలు తమ తమ బాధ్యతను నిర్వర్తిస్తాయి. దాని వల్ల

శరీరమనే కుటుంబం వికసిస్తుంది. ఈ కుటుంబంలో స్త్రీ పురుషులకు సమాన బాధ్యతలుంటాయి. పైగా స్త్రీకి అపూర్వ గౌరవస్థాన మిచ్చింది ఈ దేశం.

"సర్వేజనాః సుఖినోభవంతు, సమస్త సన్మంగళాని భవంతు" అనే విశ్వజనీన సిద్ధాంతాలు ఈ దేశం వ్యాపింపజేసింది. ఈ సువిశాల భావాల కారణంగానూ, మహిళ మాతృదేవతగా, భార్యగా, అక్కగా, చెల్లెలిగా గౌరవింపబడుతున్న కారణంగానూ, జీవితంలో పురుషుడు స్త్రీనే అనుసరించి నడుస్తాడని చెప్పుకోడం జరిగింది.

"సురీయోదేవీ, యుషసగుం యోచ మానామరీయ ః
వయోషా యభ్యేతు పశ్చాత్....."

- ఇది కృష్ణ యజుర్వేదంలోని మంత్రం. సూర్యుని వర్ణనకు సంబంధించింది. లోకంలోని మనుష్యుడు స్త్రీని అనుసరించి ఎలా నడుస్తున్నాడో, అలాగే సూర్యుడు కూడా ఉషాదేవిని అనుసరించి నడుస్తున్నాడని ఈ మంత్రానికర్థం.

మనుస్మృతిలోని ప్రక్షిప్తాలను తీసివేస్తే, స్త్రీ పరంగా ఆ ఋషి చెప్పిన చాలా అంశాలు ఈ యుగధర్మాన్ని ప్రతిబింబిస్తాయి. ఒకటి రెండు శ్లోకాలను మాత్రం పరామర్శిద్దాం.

"యత్ర నార్యస్తు పూజ్యంతే - రమంతే తత్ర దేవతాః ।
యత్రైతాస్తు న పూజ్యంతే - సర్వాస్తత్రాఫలాః క్రియా ః ॥
శోచంతి జామయోయత్ర - వినశ్యత్యాశు తత్కులం ।
నశోచంతితు యత్రైతాః - వర్ధతే తద్ధి సర్వదా ॥
తస్మాదేతాః సదా పూజ్యాః - భూషణాచ్ఛాదనాశనైః ॥"

- "నారీమణులు గౌరవం పొందే స్థలంలో దేవతలు ఆనందంతో నిలుస్తారు. స్త్రీలను అగౌరవపరచే వారికి ఏ పనులలోనూ మంచి ఫలితాలు లభించవు. ఏ స్త్రీలు వంశంలో దుఃఖిస్తూ ఉంటారో ఆ వంశం నాశనమైపోతుంది. నిజానికి వారి సంతోషమే వంశోన్నతికి మూలం. ఎప్పుడూ వారికి అన్నం వస్త్రం తదితర సామగ్రి అందే విధంగా వ్యవహరించాలి.'
'

అంతేగాక భార్యాభర్తలు సంతుష్టాంతరంగులై ఉండాలనే ఈ ధర్మం కోరింది. చూడండి!

"సంతుష్టో భార్యయాభర్తా - భర్త్రా భార్యా తథైవచ ।
యస్మిన్నేవకులేనిత్యం - కల్యాణం తత్రవైధ్రువమ్ ॥

- "భార్యాభర్తలు ఎల్లప్పుడు సంతుష్టులై ఉండాలి. అప్పుడా వంశమే కల్యాణకరంగా ఉంటుంది. ఇది నిశ్చయం." పైగా స్త్రీలు తమను తామే రక్షించుకొనే విధంగా సంసిద్ధం కావాలంటాడు మనువు.

"అరక్షితా గృహేరుద్ధాః – పురుషైరాప్తకారిభిః ।
ఆత్మాన మాత్మనాయాస్తు - రక్షేయుస్తాస్సురక్షితా ః ॥"

– కావలివాండ్ర వల్ల నిర్బంధంగా రక్షింపబడే గృహిణులెప్పుడూ రక్షితలు కారు. ఏ మహిళలు తమను తాము కాపాడుకొంటారో, వారే చక్కగా కాపాడబడిన వారవుతారు.

వివాహవిషయంలోనూ సొంత నిర్ణయం, స్వతంత్ర నిర్ణయం తీసుకోవచ్చని ఆనాటి నుండీ ఉంది. ఈ క్రింది శ్లోకం చూడండి!

"త్రీణి వర్షాణ్యుదీక్షేత -కుమార్యృతుమతీ సతీ ।
ఊర్ధ్వంతు కాలాదేతస్మాత్ - విందేత సదృశ్యం పతిమ్ ॥"

– కన్య తాను ఋతుమతియైనా తండ్రీ తదితరులు గుణశ్రేష్ఠుణ్ణి వెదకి పెళ్లి చేయనట్లయితే మూడేళ్ల వరకు ఆగి, ఆ తర్వాత కూడా సద్గుణుడిక వారికి దొరకడని గ్రహించి, తన గుణాలకు సాటియైన వానిని తానే వరించి పెండ్లి చేసుకోవచ్చును.

వేదకాలంలో. స్త్రీకి సంపూర్ణ స్వాతంత్ర్యమున్నది. మహాయోద్ధలైన స్త్రీలూ ఆకాలంలో ఉన్నారనడానికి ఈ మంత్రమే పరమ ప్రమాణం.

"చరిత్రం హి వేరివాచ్ఛేది పర్ణమాజా
ఖేలస్య పరితక్మ్యాయామ్ ।
సద్యో జంఘా మాయసీం విశ్పలాయై
ధనేహితే, సర్తవే ప్రత్యధత్తమ్ ॥"

"విహగము వెండ్రుకల్ వలెను విస్పళ కాళ్లు తెగంగ నాజిలో
మహిని నగస్త్య మౌని మిము మానుగ వేడగ నర్థయామినిన్
బహుమతి తోడ నిన్పవగు పాదములం దవిలించి కాళ్లకున్
మహిత రణంబు జేయ నలమానిని బంపితి రశ్వీదేవతల్."

*(సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత, 1-116-15)*

"ఖేలుడనే యతని భార్య పేరు విస్పళ. ఆమె యుద్ధంలో వీరోచితంగా పోరాడింది. పక్షిరెక్క తెగిన విధంగా ఆమె ఒక పాదం యుద్ధంలో ఛేదింపబడింగి. ఓ అశ్వినీ దేవతలార! అర్ధరాత్రివేళ శత్రువులపహరించిన ధనాన్ని జయించి తేవడానికి, ఇనుముతో చేసిన పాదాన్ని మీరామె కాలికి అతకించి వెంటనే యుద్ధానికి పంపించారు".

యుద్ధంలో ఓకాలు విరిగిపోతే ఆమె అప్పటికప్పుడే ఇనుపకాల అమరించుకొని యుద్ధానికి వెళ్లిందన్నమాట.

సంతానం లేని వధ్రిమతీ సతికి అశ్వినీ దేవతలు మరొక వివాహం చేయించి సంతానవతి అయ్యేట్టు చేశారని ఒక మంత్రంలో ఉంది. ఇలా వేదకాలంలో మహిళ గౌరవింపబడిందనీ, అన్ని రంగాలలోనూ ఆమె స్వాభిమానంతో, స్వతంత్రంగా వ్యవహరించిందని అనేక ఉదాహరణల ఆధారంతో నిరూపించే అవకాశం ఉంది.

ఋగ్వేదంలోని అనేక మంత్రాల్ని మహిళలే దర్శించినట్టు అంతర్గత సాక్ష్యాలున్నాయి. "గార్గి, రోమశ, ఘోషా, విశ్వావర, అత్రేయి, లోపాముద్ర, వసుక్ర పత్ని, ఇంద్రాణి, అపాల, శ్రద్ధ, కామాయని, వైవస్వతి, యామి, పైలమి, సూర్య, స్వస్తి, శిఖండిని, ఊర్వశి, శచి, దేవరని, ఇంద్రమాత, సర్వరాజ్ఞి, వాక్, గోధ.... తదితరుల పేర్లు ఋగ్వేదంలో ఉన్నాయి. వీరందరూ దార్శనికులైన మేధావినులు. విద్య, వైద్యం, వ్యవసాయం, సాహిత్యం, కళలు, వివిధ వృత్తులు... రాజనీతి... తదితర అనేక రంగాలలో వారు ప్రతిభావంతులుగా వెలిగారు. మహిళా వికాసం సమగ్రంగా జరిగిన కాలమది. ఆ కాలంలోని కొంతమంది మహిళామణులను గురించి తెలుసుకొందాం.

## 1. బ్రహ్మవాదిని గార్గి

మహావేదాంతి రాజఋషి జనకుడు మిథిలను పరిపాలిస్తున్న రోజులవి. ఈయన సీత తండ్రి జనకుడు కాడు. రామాయణ కాలం కన్నా ఎంతో ముందున్నవాడు. ఈ రాజవేదాంతి ఆస్థానంలో "గార్గి" అనే బ్రహ్మవాదిని ఉండేది. యాజ్ఞవల్క్య ఋషి ఉండేవాడు.

బ్రహ్మతత్త్వ వివేచనార్థం సభ జరుగుతున్నప్పుడు వీరిరువురి మధ్య వాదోపవాదాలు జరిగాయి.

'జలము భూమి నిండా వ్యాపించి ఉంది; ఆ జలం దేనితో కలిసి ఉంది'... గార్గి ప్రశ్న.
'వాయువుతో' యాజ్ఞవల్క్యుని సమాధానం
'ఆ వాయువువెందులో ఉంది',
'అంతరిక్షలోకాల్లో'
'అంతరిక్షా లోకాలు దేనిలో ఉన్నాయి?'
'గంధర్వలోకాల్లో'
'అగంధర్వలోకాలెందులో ఉన్నాయి?'
'ఆదిత్యలోకాల్లో'
'ఆ ఆదిత్యలోకాలెందులో ఓతప్రోతాలై ఉన్నాయి?'
'చంద్రలోకాల్లో'
'ఆ చంద్రలోకాలెందులో ఉన్నాయి?'
నక్షత్రలోకాల్లో
ఆ నక్షత్ర లోకాలెందులో ఉన్నాయి?

దేవలోకాల్లో
దేవలోకాలెక్కడ ఉన్నాయి?
ఇంద్రలోకాల్లో
ఇంద్రలోకాలెక్కడ ఉన్నాయి?
ప్రజాపతి లోకాల్లో
వస్త్రాల్లో పడుగుపేకలాగా, సూత్రానికి మణుల్లాగా ఈ ప్రజాపతిలోకాలెక్కడ ఉన్నాయి!
బ్రహ్మలోకంలో ఓతప్రోతాలై ఉన్నాయి.
బ్రహ్మలోకమెక్కడ ఉన్నది!

బ్రహ్మం సర్వ ప్రపంచానికి ఆధారం కాబట్టి ఓ గార్గీ ! ఇక నీవు ప్రశ్న వేయకు . వేస్తే తల తిరిగి పడిపోతావు అన్నాడు యాజ్ఞవల్క్యుడు. మొదట బ్రహ్మమే ఉన్నది. అది చైతన్యం; అది పరమాత్మ; అది సృష్టి చేసేది! అది సృష్టి నిలిపేది! సృష్టిని లయింపజేసేది. అది అన్నిటికి మూలాధారం. ఆ చర్చ ప్రత్యేకంగా చేయాలనే ఉద్దేశ్యంతో అనాటికక్కడితో ముగించాడు యాజ్ఞవల్క్యుడు.

గార్గి వచక్నుని పుత్రిక; వాచక్నవి అని పిలువబడుతున్నది. ఆమె బ్రహ్మవాదినిగా ఖ్యాతనందింది. యాజ్ఞవల్క్యునితో సమానమైన దార్శనికశక్తి ఉన్న ప్రతిభావంతురాలు. అందుకే మరోరోజు చేసిన వాదమిలా ఉంది.

'ద్యు-పృథ్వి (దివి-భువి) మధ్య క్రిందా మీదా ఉన్న భూతభవిష్యద్వర్తమానాలన్నీ దేనితో కలిసి ఉన్నాయి?' గార్గి అడిగింది.

'ఆకాశంలో ఓతప్రోతమై ఉన్నాయి' యాజ్ఞవల్క్యుడు.

'ఆ ఆకాశం ఎవరిలో ఉంది?'

'దానిని బ్రహ్మవిదులు అక్షరమంటారు. అది అవినాశితత్త్వం. (ఇక్కడ యాజ్ఞవల్క్యుడు ఎంతో వివరణ ఇచ్చాడు). అన్నీ ఆ అక్షరుని వల్లనే జరుగుతున్నాయన్నది ఆ వివరణ పిండితార్థం. ఈ అక్షర తత్త్వంలోనే ఆకాశం ఓతప్రోతమై ఉందన్నాడు.

యాజ్ఞవల్క్యుని వివరణంతా విన్న గార్గి ఆయనను బ్రహ్మవేత్తగా ప్రకటించింది. ఆ బ్రహ్మవేత్తను జయించే బ్రహ్మ జ్ఞానులిప్పుడెవ్వరు లేరని వ్యాఖ్యానించింది. అంటే యాజ్ఞవల్క్యుని వంటి బ్రహ్మజ్ఞానులనే పరీక్షించే బ్రహ్మజ్ఞానం సంపూర్ణంగా తెలుసుకొన్న మహామేధావి గార్గి అన్న మాట. అందుకే గార్గికి బ్రహ్మజ్ఞానిగా గుర్తింపున్నది. బ్రహ్మవాదినిగా ఖ్యాతి ఉన్నది.

## 2. శ్రేయోమార్గంలో మైత్రేయి

మైత్రేయి యాజ్ఞవల్క్యుని భార్య. వారికొక ఆశ్రమమున్నది. పోషణ నిమిత్తం

ఆశ్రమభూములున్నాయి; గోవులున్నాయి; ఫలధాన్య సమృద్ధి ఉన్నది. ఆయన ఆశ్రమం విడిచి వెళ్లి కొన్నాళ్లపాటు తపస్సు చేసి, దేశపర్యటన చేసి రావాలనుకొన్నాడు. అ.దువల్ల మరో భార్య అయిన కాత్యాయనికి - మైత్రేయికి ఆస్తిని విభజన చేసి రక్షించుకోవలసిందని చెప్పాలనుకొని మొదట మైత్రేయితో ఈ విషయం ప్రస్తావించాడు.

'ఈ భూమి వల్ల నేను అమృతత్వం పొందుతానా?' అడిగింది మైత్రేయి. 'సంపదలున్న వారిలాగా జీవిస్తావు గాని, అమృతత్వాన్ని పొందలేవు' అంటాడు యాజ్ఞవల్క్యుడు. 'అమరత్వం పొందని దాని వల్ల నాకు ప్రయోజనమేముంటుంది. దేని వల్ల నేను అమరత్వం పొందుతానో ఆ రహస్యమే నాకు ఆస్తిగా ఇవ్వండి' అని అడిగింది మైత్రేయి.

ఆత్మబ్రహ్మ ఒక్కరే! ధ్యానం చేయాలి. ఆత్మను తెలుసుకోవాలి. ఇంద్రియాలను తాడించి ఆత్మను శోధించి తెలుసుకోవాలి. ఆ తర్వాత పంచభూతాత్మక ప్రపంచం కంటే ఆత్మ ఎలా భిన్నమైనదో వివరించాడు యాజ్ఞవల్క్యుడు.

పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆదిత్యుడు, దిశలు, విద్యుత్తు, మేఘము, ఆకాశం తదితర వివరాలు చెప్పి ధర్మమే సర్వప్రాణులకు మధువని మైత్రేయికి చెప్పాడు యాజ్ఞవల్క్యుడు. సత్య ప్రాధాన్యాన్ని వివరించాడు. మానుషత్వంలోని తేజోమయ - అమృతమయ పరమాత్మే అమృతం - బ్రహ్మ - సర్వస్వమన్నాడు. ఆ అమృతమయ పురుషుడే ఆత్మ అని బ్రహ్మ అని నిర్ధారించాడు.

ఇక్కడ ఒక విషయం గుర్తించవలసి ఉంది. భౌతికమైన ఆస్తి ఉన్నది. అది అన్నం పెడుతుంది; భౌతిక సుఖాలనిస్తున్నది. ఇది గ్రహించకుండా మైత్రేయి, శాశ్వతసౌఖ్యాన్నిచ్చేది ఏదో దానిని వివరించుమన్నది. అది ఆత్మ విద్య. ఆత్మ ధ్యానం వల్ల, సాధన వల్ల బ్రహ్మమార్గంలో పయనించడాన్నే ఆమె కోరుకొన్నది. భౌతిక సంపదల వల్ల పొందే సుఖం కన్నా, ఆత్మజ్ఞానమే మేలనుకొన్నది. ఆస్తులూ - సంపదలూ బంధాలను పెంచుతాయి. అందుకే మహామేధావిని అయిన మైత్రేయి బ్రహ్మమువైపే మొగ్గు చూపింది.

## 3. ప్రేయోమార్గంలో కాత్యాయని

అయితే యాజ్ఞవల్క్యుని మరొక భార్య కాత్యాయని మాత్రం ఆస్తి వైపే దృష్టి సారించింది. కఠోపనిషత్తులోని శ్రేయస్సును-ప్రేయస్సును వీరిరువురికి అన్వయించవచ్చు. యముడు నచికేతునితో ఇలా అంటాడు.

"ఓ నచికేతా! లోకంలో మనిషి నడుచుకోడానికి రెండు విధాల మార్గాలున్నాయి. ఒకటి శ్రేయోమార్గం; మరొకటి ప్రేయోమార్గం. శుభపరంపరలను కలిగించేది, మోక్షాన్ని లభింపజేసేది శ్రేయోమార్గం. లౌకిక సుఖాలను వాంఛలను తీర్చేది, ధనాదివస్తు సంచయం వైపుగా మనిషిని పరుగెత్తించేది ప్రేయోమార్గం. శ్రేయోమార్గం మొదట కష్టమనిపిస్తుంది. అయినా

చివరలో శాశ్వత సుఖాన్నందిస్తుంది. ప్రేయోమార్గం మొదట సుఖకరంగా ఉంటుంది; పరిణామ దశలో చివర దుఃఖాన్ని కలిగిస్తుంది.

ఇప్పుడు చూడండి మైత్రేయి శ్రేయోమార్గం ఎన్నుకొన్నది కాబట్టి ఆమె ఇక ఆశ్రమం విషయంలో ఆస్తిపాస్తుల విషయంలో నిస్సంగంగా వ్యవహరిస్తుంది. మరి అవి చూడాలి; ఆశ్రయించి ఉన్న పరివారినికి తిండి, బట్ట, గృహవసతి కల్పించాలి, ఇది కాత్యాయని స్వీకరించింది. మరి యాజ్ఞవల్క్యుడేమో తపస్సులోకి వెళ్లిపోతున్నాడు; అంటే విశ్వమానవ కల్యాణం వైపు వెడుతున్నాడనే కదా!

మొత్తం మీద కాత్యాయని సంసారంలోఉంది; మైత్రేయి మోక్ష పథంలో ఉంది; యాజ్ఞవల్క్యుడు తపోమార్గంలోఉన్నాడు. అందుకే కాత్యాయని ప్రేయస్సుకు ప్రతీక, మైత్రేయి శ్రేయస్సుకు ప్రతీక; యాజ్ఞవల్క్యుడు తపస్సుకు ప్రతీక అందాం.

## 4. సుజ్ఞాని సులభ

ఈ మిథిలా జనకమహారాజుతో సులభ వేదాంత గోష్ఠి చేసిన అంశం భారతంలో సూచించబడింది. సులభయోగిని. ఆమె తన యోగశక్తితో సమస్త భూమండలాన్ని చుట్టి వచ్చింది. యోగశక్తి వల్ల, సహజ సౌందర్యానికి తేజస్సుతోడై ఆమె అద్భుతంగా వెలుగుతున్నది. ఆ సౌందర్యతేజస్వితకు జనకుడే ఆశ్చర్యపోయాడు.

'మీరెవరు? ఎందుకు వచ్చారు? ఎక్కడి నుండి వచ్చారు?' అని ఆమెను జనకుడడిగాడు.

"ప్రపంచమంతా పర్యటిస్తున్నాను. మీ గురించి విన్నాను. మీరు ఆత్మతత్వం తెలిసినవారని చాలా మంది అంటున్నారు. మిమ్మల్ని చూద్దామనిపించింది. కొన్ని విషయాలు చర్చిద్దామనిపించింది. అందుకే నేను వచ్చాను" అన్నది సులభ.

"నీవు చాలా అందంగా ఉన్నావు. నీపూర్వాపరాలు ఇక్కడి వారికి తెలియవు. నీ భర్త ఎవరో - నీ గోత్రమేమిటో చెప్పలేదు. ఇక్కడ ఎందరో పండితులున్నారు. నీ చూపులతో - నీ అందంతో ఇక్కడున్న వారందరినీ ఓడించాలని వచ్చావని అర్థమైపోయిందిలే' అన్నాడు జనకుడు.

జనకుడు తనను పరీక్షించడానికే ఇలా అన్నాడని సులభ గుర్తించలేకపోయింది. అందుకే ఆమె కొంత పరుషంగానే అన్నది.

"రాజా! నేను ఎవరికీ అపకారం చేయని పవిత్రుల ఇంటిలో పుట్టాను. విద్యలో విశేసంగా కృషి చేశాను. సముచితంగా మాట్లాడుతాను. దొంగను కాను. నా స్థాయికి తగిన భర్త దొరకలేదు. కాబట్టి పెళ్లి చేసుకోలేదు. నా అభిప్రాయాలు స్థిరంగిలా ఉంటాయి. నేనెవరితోనో వాదించి వారిని కించపరచాలని రాలేదు. నా ఘనత నిరూపించుకోవాలనే కోరిక

నాకు లేనేలేదు. అయితే జ్ఞానం వల్లనే ఆత్మోన్నత్యం కలుగుతుందని నాకు తెలుసు. మీరు అలాంటి జ్ఞానులనుకొన్నాను. కానీ ఇప్పుడు ఈ ప్రసంగం వల్ల మీరు 'ఒట్టికుండ' అని తెలిసింది. అందువల్ల నేను వచ్చిన త్రోవనే వెళ్లిపోతున్నాను....." అంటూనే సులభ ఇక ఎంతమాత్రం అక్కడ నిలువకుండా వెళ్లిపోయింది.

సులభకు చాలా విషయాలు తెలుసు. ఆమెను జనకుడు పరీక్షించాల్సింది కాదు. మీకు తెలిసిన విషయం చెప్పండి అనాల్సింది. అందువల్ల ఆమె యోగశక్తి ద్వారా సాధించిన అనేక అద్భుతాంశాలు వెలికి వచ్చేవి. అవి వెలికి రాలేదు. మనకు ఇంతమాత్రం విషయమే అందింది.

అయితే సులభ ఆత్మజ్ఞాని అనీ, ఇంకా అన్వేషణలోనేఉందనీ, తనకు అన్నీ తెలుసనే అహంకారం లేకున్నా కొద్దిగా తొందరపడిందనే చెప్పాలి.

## 5. వేదాల్లో వందల కొలదిగా మహిళలు

జబాల, చూడాల వంటి వారు కూడా ఆ కాలానికి చెందినవారే. అయితే వేదాల్లోనే మొదట చెప్పుకొన్న పేర్లే కాక ఇంకా ఈ క్రింది నామాలు పండితుల అన్వేషణలో బయటపడ్డాయి. అయితే వారిలో "పృథ్వీ, ఇలసరస్వతి, భారతీ, సినీవాలి, రాఖ, సూనృత, పురంధ్రి ధిషణ, అనుమతి,. తితీని, ఇంద్రాణి, ఉషస్సు, రాత్రి, శ్రద్ధ, అనుమతి, అరామతి, దంపతి, అరణ్యాని, వరుణాని" పూర్తిగా దేవతలనే అంటున్నారు.

అయితే ఇవన్నీ ప్రతీకలనే చెప్పవచ్చు. పృథ్విని గంధవతిగా, సరస్వతి విద్యాధిదేవతగా, అరణ్యానిని అడవి ప్రాణులదేవతగా, వరుణానిని వరుణిని భార్యగా చెప్పుకోవచ్చును. ఇక ఈ క్రింది పేర్లు పూర్తిగా ఋషికలవే బ్రహ్మ వాదినులవే.

"ఇంద్రమాతరః, ఇంద్రస్నుశ, ఇంద్రాణి, అదితి, సూర్య, సావిత్రి, యమి, వైవస్వతి, శచి, పౌలోమ, అగస్త్యవాస, అపల, ఆత్రేయి, శాశ్వతి, అగీరసిఘోష, కాక్సివతి, జుహు, బ్రహ్మజయ, రోమశ, లోపాముద్ర, విశ్వవర, ఊర్వశి, శిఖండిన్యు, కాశ్యపి, దేవాసురె, శరమ, గోధా, సర్పరజని, నాద్యః, రాత్రి, దక్షిణ, వాక్, శ్రద్ధ, శ్రీ, లక్ష్య, మేథ, ఉపనిషత్ నిషాద....'

ఇలా మహిళల పేర్లెన్నో ఒక్క ఋగ్వేదంలోనే ఉన్నాయి. వీటన్నిటి మీద ప్రత్యేకాధ్యయనం చేయవలసి ఉంది.

### ✤ మాతృశక్తి దివ్యతం

అయితే ఈ సృష్టి వికాసానికి మాతృశక్తే మూలాధారం. ఆ శక్తినే ఆదిశక్తి అంటున్నాం. సృష్టికి మూలమైన ఆదిశక్తి సృష్టి రక్షణకు అనేక అవతారాలెత్త వలసి వచ్చింది. నవరాత్రి

ఉత్సవాల్లో చేసే దుర్గా పూజల తత్త్వాన్ని అధ్యయనం చేస్తే, సృష్టి వికాస రక్షణలకు మాతృశక్తి యోగదానం ఎంతో అర్థమవుతుంది.

1. ఆదిశక్తి అయిన ఆ తల్లి మహామాయగా అవతరించింది. ఈ తల్లికే మహాకాళి అని పేరు. మొదటి అవతారంలో ఈ అమ్మవారు మధుకైటభులనే రాక్షసులను సంహరించారు.

2. ఈ తల్లి రెండవ అవతారం మహిషాసురమర్దని. సింహవాహనయైన ఈ తల్లికి మహాలక్ష్మి అనే పేరు కూడా ఉన్నది. ఈ తల్లె మహిషముఖుడైన అసురుణ్ణి సంహరించింది.

3. మూడవ అవతారంలో ఈ తల్లికి మహాసరస్వతి అని పేరు., ఈ అవతారంలో శక్తిని ప్రదర్శిస్తూ శంభనిశుంభులను, రక్తబీజుణ్ణి చంపివేసింది.

4. నాల్గవ అవతారంలో తల్లినందునింట నందగా (యోగమాయగా) జన్మించి, కంసుణ్ణి హడలగొట్టి అదృశ్యమైపోయింది.

5. అయిదవ అవతారంలో రాక్షస సంహారానికి అమ్మవారు దంతాలనే ఉపయోగించినందువల్ల, అప్పటి నుండి రక్తదంతిగా ఆ తల్లికి పేరు వచ్చింది.

6. లోకంలో కరువు కాటకాలెక్కువైపోవడంతో తల్లి అంతటా శాకాలు సృష్టించి కరువు తొలగించింది. అందువల్ల ఆ తల్లి ఆరవ అవతారంలో శాకంభరిగా పిలువబడింది.

7. దుర్గుడనే రాక్షసుణ్ణి తల్లి ఏడవ అవతారంలో సంహరించింది. ఆ కారణంగానే తల్లికి దుర్గ అని పేరు వచ్చింది.

8. ఎనిమిదవ అవతారంలో తల్లి మతంగుని యింట పుట్టింది. అందువల్లనే మాతంగి అని పిలువబడింది.

9. తొమ్మిదవ అవతారంలో రాక్షస సంహారం నిమిత్తం అమ్మవారు భ్రమరాలను సృష్టించి విజయం సాధించారు. అందువల్ల తల్లికి ఈ అవతారంలో భ్రామరి అనే పేరు వచ్చింది.

జగదీశ్వరి, జగజ్జనని, లోకపావని అయిన ఆదిశక్తి లోకంలోని మాతృశక్తికి మూలాధారం. ఈ శక్తే అనాది; ఈ శక్తే పునాది. ఇది చైతన్యవంతమై సృష్టి ఆది నుండి నేటి వరకు ప్రవహిస్తూనే ఉన్నది. అందువల్ల ఆయా యుగ ధర్మాలను ప్రతిబింబించిన సాహిత్యంలో ఈ శక్తే భిన్నరూపాలుగా వర్ణితమయ్యింది. ఆ వర్ణితాంశాలను, పురాణాది అనేక ప్రక్రియలను ఆధారంగా గ్రహించి ఇక త రేఖామాత్రంగా పరిశీలన చేద్దాం.



# పురాణాల్లో మహిళలు

- పురాణాల్లో పూజనీయులు.

1. మనసావాచా కర్మణా శుచీదేవి - **శచీదేవి.**
2. వేదవేత్త **వేదవతి**
3. **వరూధిని** మన నాయనమ్మ.
4. **అరుంధతి** మన అంతర్యామి
5. ఆత్మ బంధువు **అనసూయ**
6. ప్రేమరస చైతన్యమూర్తి **ఊర్వశి**
7. సుస్థిర మానస **సుకన్య.**
8. ఎల్లలు లేని ఎల్లమ్మ - **రేణుకమ్మ**
9. సత్యసారమతి **చంద్రమతి**
10. సంపదల దేవి **లక్ష్మీదేవి**
11. పరాశక్తి **పార్వతి**
12. జ్ఞానజ్యోతి **సరస్వతి**

- పురాణ మహిళ ఆధునిక మహిళే

# పురాణాల్లో మహిళలు

## ✤ పురాణాల్లో పూజనీయులు

"అష్టాదశ పురాణాని కృత్వాసత్యవతీ సుతః" - పదునెనిమిది పురాణాలు సత్యవతీ సుతుడైన వేదవ్యాసుల వారు రచించారు. వేదాలు విభజించి అందులోని ప్రతీకలకు పాత్రలను సృష్టించి, కథాకథనం చేశారు; లేదా అప్పటికే వినిపిస్తున్న కథలకు ప్రతీకలు, వేద శాస్త్రాదుల్లో అధ్యయన శీలురకు కనిపించడం మొదలయ్యింది. ప్రతీకలకూ - కథలకు పొంతన లేని విధంగా సంబంధాలు తెగిపోయినై. అయినా "పురాపి నవంభవతి పురాణమ్" - అంటే ప్రాచీన కాలానిదైనా కొత్తగా తోచేది పురాణమనే నిర్వచనం నిలిచింది. "పురాతనం పురాణమ్" - అంటే వేదాలంత ప్రాచీనమైనవి పురాణాలని మరో నిర్వచనం.

అవి మొత్తం 18 అనుకొన్నాం కదా! మత్స్య, మార్కండేయ, భాగవత, భవిష్యోత్తర, బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, విష్ణు, వాయు, వామన, వరాహ, అగ్ని, నారద, పద్మ, కూర్మ, స్కంద. లింగ, నింబ పురాణాలు. ఇవి మహా పురాణాలు. ఇవి గాక మరో పదునెన్మిది ఉప పురాణాలున్నాయి. ఆ తర్వాత వీటి సంఖ్య కూడా పెరిగింది.

ఇవి సర్గ, ప్రతిసర్గ, వంశం, మన్వంతరం, వంశానుచరితం అని పంచలక్షణ పరిశోభితాలై ఉంటాయి. బ్రహ్మ నాలుగు ముఖాల నుండి నాలుగు వేదాలు వచ్చినాయి అని, అయిదో ముఖం నుండి పురాణాలు పుట్టాయని విశ్వాసం. వ్యాసుల వారు వ్రాసిన ఈ పురాణాలన్నిటిని ఉగ్రశ్రవసుడనే సూత మహర్షి అరణ్యాల్లో - ఆశ్రమాల్లో ఉన్న (ముఖ్యంగా నైమిశారణ్యంలో ఉన్న) మునులకు చెప్పి ప్రచారం చేశారు. ఈ పురాణ కథల్లో దైవీ గుణాలున్నవారు, మానవీయ గుణాలున్నవారు, రాక్షస గుణాలున్నవారు ఎందరో కనిపిస్తారు.

దివ్య శక్తులున్న మహిళలెందరో పురాణాల్లో ఉన్నారు. వారిజీవితాలు - ప్రవర్తనలు భారతీయ మహిళలకు ఆదర్శాలయినై; ఆచరణ యోగ్యాలయినై. అలాంటి పురాణ మహిళల్లో కొందరిని గురించి స్థూలంగా తెలుసుకొందాం.

# 1. మనసావాచాకర్మణా శుచీదేవి - శచీదేవి

దేవేంద్రుని భార్య శచీదేవి. పంచభూతాల మీద దివ్య శక్తుల మీద ఆధిపత్యం వహించే దేవేంద్రుడు, అప్పుడప్పుడుతననెదిరించే అసురీశక్తులను తట్టుకోలేకపోతాడు. ఓడిపోతుంటాడు; పారిపోతుంటాడు. ఒక్కో సారి మాయోపాయం పన్ని విజయాలు సాధిస్తుంటాడు. భర్త విజయానికి శచీదేవి సహకరిస్తుంటుంది.

మహాబలవంతుడైన రాక్షస రాజుతో భర్త ఓడిపోతుండడం చూచి, దేవ గురువైన బృహస్పతిని సలహా అడిగింది శచీదేవి. శుచిగా ఉండి "రక్ష"ను పూజించి, ఆ రక్ష రేకును భర్త చేతికి కట్టి మంగళహారతి ఇచ్చి యుద్ధానికి పంపించుమన్నాడు బృహస్పతి. శ్రావణ పౌర్ణమి రోజున అలాగే చేసింది ఆమె. ఆమె శుద్ధ సంకల్పం వల్ల, రక్ష శక్తి వల్ల ఇంద్రుడు విజయం సాధించాడు.

భవిష్యోత్తర పురాణంలోని అంశమిది. భర్త విజయానికి ఆ విధంగా సహకరించి దేవేంద్ర పదవినే నిలబెట్టగలిగిన శుచివ్రత, పతివ్రత శచీదేవి.

నహుష చక్రవర్తి నూరు యజ్ఞాలు చేసిన కారణంగా మహా బలవంతుడయ్యాడు. అందువల్ల అతనికి దేవేంద్ర పదవి దక్కింది. దేవేంద్రుని బలహీనతల వల్ల, కొన్ని చెడు పనుల వల్ల, నిర్వహణ సరిగా లేకపోవడం వల్ల, పదవి కోల్పోయి శక్తి సంపాదన నిమిత్తం దేవేంద్రుడు తపస్సుకు వెళ్ళిపోయాడు.

అప్పుడు నహుషుడు ఇంద్ర పదవిలో ఉన్నాడు. పదవీ మదం పెరిగిపోయి శచీదేవిని తన దేవేరిగా చేసుకోవాలనుకొన్నాడు. అందుకొరకు చెప్పంపాడు. ఈ ఆపద తప్పించుకోడానికి శచీదేవి బృహస్పతి సలహా అడిగింది. బృహస్పతి చెప్పిన ప్రకారంగా ఒక ముహూర్తం నిర్దేశించింది. ఆ ముహూర్తం వరకు,సప్తర్షులు మోస్తున్న పల్లకి ఎక్కి రావాలని చాలా తక్కువ సమయమిచ్చి చెప్పంపింది.

నహుషుని ఆనందానికవధులు లేకపోయాయి. వెంటనే పల్లకీ తెప్పించి సప్తర్షులను బోయీల పని చేయుమన్నాడు. తాను పల్లకీలో కూచున్నాడు. వారు మెల్లగా పల్లకి మోస్తున్నారు. సమయానికి శచీదేవి మందిరం చేరాలి. వారు మెల్లగా వెడుతున్నారు. వారి మీద అధికారం చలాయిస్తూ అందులో ఉన్న అగస్త్య మహర్షి పై నహుషుడు కొరడా ఝుళిపించాడు. కాలితో తన్నాడు. అగస్త్యుడు నహుషుణ్ణి సర్పమవై పడిపో అని శపించాడు. ఆ విధంగా నహుషుని పతనం జరిగింది. శుచీదే...గా శచీదేవి దివ్యంగా వెలిగింది.

శచీదేవి ఈ విధంగా భర్తకు సహకరించడమే గాక, తనకు వచ్చిన ఆపదలను తానే ఎదుర్కోగలిగింది. అంతేగాక తన కూతురు జయంతిని, కొడుకు జయంతుణ్ణి చక్కగా

పెంచింది. విద్యాబుద్ధులు చెప్పించింది. మచ్చలేని మనీషిగా వెలిగింది. స్త్రీలకందరికీ ఆదర్శంగా నిలిచింది.

## 2. వేదవేత్త వేదవతి

బ్రహ్మవైవర్త పురాణంలోని అంశమిది. కృశధ్వజ మాలావతుల కూతురు వేదవతి. ఆమె జనన సమయంలో ప్రసూతి గృహంలో వేదనాదాలు వినిపించాయి. అందువల్లనే వారు ఆమెకు వేదవతియని పేరు పెట్టారు. వేదవతి విష్ణువునే భర్తగా కోరింది. కృశధ్వజుడు కూడా వేదవతిని విష్ణువుకే ఇవ్వాలని సంకల్పించారు.

కాని అనుకొన్నవి అనుకొన్న విధంగా జరుగుతాయా. ఒక రాక్షసుడు వేదవతిని తనకివ్వవలసిందని కృశధ్వజుణ్ణి అడిగాడు. కృశధ్వజుడు నిరాకరించాడు. అందువల్ల వాడతణ్ణి చంపివేశాడు. భర్త వియోగ దుఃఖంతో మాలావతి కూడా మరణించింది. వేదవతి ఒంటరిదైపోయింది. ఆమె రాక్షసుని బారి నుండి తప్పించుకొనేందుకు మునుల ఆశ్రమాన్ని ఆశ్రయించింది. ఆ ఆశ్రమంలోనే ఉండి తపస్సు చేసుకొంటున్నది.

అదే సమయంలో ఆమె లోక కంటకుడైన రావణుని కంట బడింది. ఆమె తపోదీక్షలో ఉన్నదని కూడా ఎంచకుండా తనను పెళ్లి చేసుకోవలసిందని బలవంతపెట్టాడు. పైగా ఆమెను పట్టుకొని అత్యాచారానికి ప్రయత్నించాడు.

ఛీ ఛీ . . . వీడు దుర్మార్గుడని తెలిసినా నేను వీడితో మాటాడితిని కదా! ఈ నీచుడు స్పృశించిన ఈ దేహంతో ఇక నేనుండలేను" . . . అనుకొంటూ వాని బారినుండి తప్పించుకొని అగ్నిలో పడింది. ఆ సమయంలోనే తన జీవితంలో విష్ణుమూర్తి తప్ప మరెవ్వరూ తనకు భర్త కారన్నది. ఆ తర్వాత ఆమె లంకలోని ఒక పద్మంలో పుట్టింది. పద్మంలో పుట్టిన ఆ పాప వల్ల లంక నాశనమవుతుందని ఎవరో జ్యోతిష్యులు చెప్పారు. అందువల్ల ఆ పాపను మిథిలానగర సమీప స్థలిలో రాక్షసులు వదలి వచ్చారు

జనకుడు భూమిని దున్నేప్పుడు నాగేటిచాలులో కనిపించినది వేదవతే. ఆమే సీత.

చూడండి! తానను కొన్న వ్యక్తిని ఎన్ని జన్మలెత్తి అయినా వివాహం చేసుకోవాలనే పట్టుదల ఉన్న వేదవతి భారతీయ మహిళకెటువంటి సందేశమందిస్తున్నదో! అంతేగాకతాను చావడానికైనా సిద్ధమయ్యింది గానీ, మహా బలపరాక్రమవంతుడైన రావణునికి మాత్రం ఆమె లొంగిపోలేదు. ఆమె తల్లిదండ్రుల వల్ల వేద జ్ఞానాన్ని పొందింది. నిజంగా వేద వేత్తలయిన వారు అన్యాయాన్ని ఎదిరిస్తారు; త్యాగంతో ధర్మ వీరభావంతో జీవిస్తారు; పది మందిని తమ మార్గంలో నడిచేట్టు చేస్తారు. వేదవేత్త వేదవతి ఆదర్శ జీవనం భారతీయ మహిళకు మహాశక్తిని ప్రసాదిస్తున్నది. భారతీయ స్త్రీత్వానికి ఎత్తిపట్టిన వైజయంతికలా వేద పరిమళాలు

వీస్తున్నది. బ్రహ్మవైవర్తంలోని ఆమె కథే ఒళ్ళు గగుర్పొడిపింప జేస్తున్నది; ఆలోచింపజేస్తున్నది; ఆచరణ పథంలో నడువుమంటున్నది.

## 3. వరూధిని మన నాయనమ్మ

మార్కండేయ పురాణంలోని ఒక మహా మహిళ గురించి చెప్పుకొందాం. ఆమె వరూధిని. ఆంధ్రకవితా పితామహ అల్లసాని పెద్దన పుణ్యమా అని తెలుగువారి కళ్ల ముందు తేజోరేఖగా వెలుగుతున్నది. స్వారోచిషమనువుకే నాయనమ్మ అయిన అయమ్మ గురించి ఆమె తీక్ష్ణ వ్యక్తిత్వం గురించి క్లుప్తంగా తెలుసుకొందాం.

వరూధిని గంధర్వ వనిత. ఆమె హిమాలయాల్లో ఉంటుంది. సిద్ధుని పసరు కళ్లకు పూసుకొని అరుణాస్పదపురంలోని ప్రవరుడనే పరమ నిష్ఠాగరిష్ఠుడైన యువకుడూ హిమాలయాల దర్శనార్థం వచ్చాడు. అతని అందానికి వరూధిని భ్రమసింది. ప్రవరుడు తాను నిత్యాగ్నిహోత్రినన్నాడు. ఇంటికి వెళ్లిపోయి పిల్లలకు పాఠాలు చెప్పుకోవాలన్నాడు; తల్లిదండ్రులకు సేవ చేసుకోవాలన్నాడు. తన ధర్మాన్ని వదలి పెట్టి ఆమెతో సుఖించడం అతనికిష్టం లేదు. అయితే వరూధిని అతని ధర్మ పన్నాలు వినలేదు.

మేం గంధర్వులం; లక్ష్మీదేవి తోబుట్టువు మాకు. రాళ్లను కరగించే గాంధర్వం మా విద్య. కామశాస్త్ర ప్రకారంగా వ్యవహరించడం వెన్నతో పాటే అబ్బింది. అశ్వమేధ రాజసూయాది యజ్ఞాలన్నీ మా పొందు కొరకే చేస్తారు. ఇదిగో ఈ గుట్టా ఈ చెట్టూ మాకు రచ్చపట్టు. త్రిమూర్తుల సభల్లో మేము తైతక్కలాడతాం.

ఇంత ఘనకీర్తి మాది. ఇవన్నీ ఎందుకు గానీ నన్ను నీ సొంతం చేసుకో అంటూ వరూధిని ప్రవరుని పైబడింది. ప్రవరుడు "హా శ్రీహరీ" అని కేకవేసి అక్కడి నుండి పరుగెత్తి, తాను నిత్యం అర్పించే అగ్నిని ఆవాహనం చేసి, అగ్ని ఆధారంగా అరుణాస్పదపురం వెళ్లిపోయాడు.

ఆ వరూధినిని ఓ గంధర్వుడు ప్రేమించాడు. ఇదంతా వాడు దూరం నుంచి చూస్తున్నాడు. తననామె తిరస్కరిస్తున్నది. ప్రవరుణ్ణి కోరుకొంటున్నది. ఆ ప్రవరుడు వెళ్లిపోయాడు. అతనికి మంచి ఉపాయం తట్టింది. తాను ప్రవరుని వేషం వేసికొన్నాడు. ఏమీ ఎరగనట్టు కొలనులో స్నానం చేస్తున్నాడు. తన హావభావ విలాసాలెన్ని ప్రదర్శించినా లొంగని ప్రవరునికి దారి తెలియదు కాబట్టి ఆ చుట్టు పక్కలే ఉంటాడని అటుగా వచ్చింది వరూధిని. మాయా ప్రవరుడు అసలు ప్రవరుడే అనుకొన్నది. అతణ్ణి కోరుకొన్నది. అతను వేషం వేసింది ఇందుకే. అతను కళ్లు మూసుకొని కాపురం సాగించాలన్నాడు. ఆమెసరే అన్నది. వారికే స్వరోచి పుట్టాడు. ఈ స్వరోచి కొడుకే స్వారోచిష మనువు.

మనువుకే నాయనమ్మ (బామ్మ) అన్న మాట వరూధిని. భౌతిక సౌందర్యానికి భ్రమసిన

వరూధిని, అంతర్నేత్రంలో ప్రవరుని అంతస్సౌందర్యం కదలాడుతున్నది. అందుకే ఆమె మనుమడు మనుధర్మ ప్రవర్తకుడయ్యాడు.

భౌతిక సౌందర్యానికి భ్రమసితే మోసపోతారు సుమా అనే కదా వరూధిని కథా సందేశం. పౌరాణిక మహిళా మణుల నుండి ఆధునిక భారత మహిళ నేర్చుకొనేదిదే కదా! మాయా ప్రవరులున్నారు జాగ్రత్త అన్న హెచ్చరిక గుర్తుంచుకోవాల్సిందే. అసలు ప్రవరుణ్ణి కోరడం తప్పేం కాదు. కోరే స్వేచ్ఛ స్త్రీ పురుషులిద్దరికీ సమానమే. అయితే ఈ కోరిక ఏకపక్షమైనప్పుడు కూడా చింతించాల్సిన అవసరం లేదు. ఎవరో ఒకరు రాజీ పడవచ్చు. జీవితం ద్వేషాలు పెంచుకొని పరస్పర పోరాటాలకు రాలేదు. అది పరస్పర పూరకమే అన్నది గుర్తించి వ్యవహరించాలి. ఏది యేమైనా మనుసంతతికే నాన్నమ్మ మన వరూధినమ్మ.

## 4. అరుంధతి మన అంతర్యామి

హిందూ వివాహం తంతులో, వివాహం పూర్తయిన తర్వాత వధూవరులను ఆకాశం దిక్కు చూడుమంటారు. అదిగో అరుంధతీ నక్షత్రం చూడండంటారు. నక్షత్రాలు ఎప్పుడూ ఉంటాయి. సూర్యకాంతి ముందు పగటి పూట కనిపించవు, అంతే! అందువల్ల పగలైనా రాత్రయినా అరుంధతిని చూపిస్తూనే ఉంటారు. వధూవరులు చూశామని భావిస్తుంటారు. ఆకాశంలోని సప్తర్షి మండలంలో ఒక్క వసిష్ఠుని పక్కన్నే అరుంధతి ఉంటుంది. మిగతా వారి ధర్మ పత్నులు సప్తర్షి మండలం పక్కన ఉండరు. ఆ సౌభాగ్యానికి అరుంధతి నోచుకొన్న కారణంగానే ఆ తల్లిని నవ దంపతులకు చూపిస్తుంటారు.

అరుంధతి వసిష్ఠుని ధర్మపత్ని. వసిష్ఠుడు మహా వేదాంతి. బ్రహ్మచర్యం నుండి గార్హస్థ్యంలోకి కాలు మోపడానికి పూర్వం తనకు తగిన వధువు కొరకు అన్వేషణ కొనసాగిస్తారు. ఒక మాల పల్లెలో వెడుతూ ఇసుక ఇస్తాను, అన్నం వండి పెట్టగలరా అని అరుస్తాడు. నేను వండి పెడతాను అంటుంది అరుంధతి అనే కన్య.

అదివరకెవ్వరు తాము వండి పెడతామని ముందుకు రాలేదు; పైగా పరిహసించారు. ఆ అమ్మాయి అరుంధతి. అగ్ని సదృశ. ఆమె తలచుకొన్న వల్ల జరుగుతుంటాయి. అంత శుద్ధ సంకల్పం ఆమెది.

అన్నట్టుగానే ఆమెఇసుకను అన్నంగా వండింది. ఆమె తల్లిదండ్రులను అడిగి అరుంధతిని పెళ్లిచేసుకొంటాడు వసిష్ఠుడు. వారిది దైవ నిర్ణయ దాంపత్యం. "ధర్మేచ అర్థేచ. . ." అన్న ప్రతిజ్ఞను సార్థకం చేసిన అపూర్వ దాంపత్యం వారిది.

వసిష్ఠుడు ఒక పర్యాయం దేశ సంచారానికి వెడతాడు. తన కమండలాన్ని ఇచ్చి తానువచ్చే వరకు, దానిని చూస్తుండవలసిందని వెళ్లిపోతాడు. అప్పటి నుండి ఆమె వరదలు

వచ్చినా, గాలులువీచినా, భూమి కంపించినా, అగ్ని ప్రజ్వలించినా చూపుమరల్చదు. ఆ చూపులోని తీక్షణతకు కమండలంలోని ధర్మజలం ఘర్మజలమవుతుంది; ఆ విరులుచిమ్ముతుంది. లోకంలో తీవ్ర ఉష్ణత వ్యాపిస్తుంది.

ప్రకృతిలోని ఈ పరిణామానికి దేవేంద్రుడు అట్టుడికిపోతాడు; బ్రహ్మాది దేవతలు వచ్చి, చూపు మరల్చుమంటారు. ఆమె తన ఏకాగ్రతను వదలదు. కనురెప్పలార్పదు. ఇక వారు వసిష్ఠుణ్ణీ తీసుకొని వస్తారు. వసిష్ఠుని మాట మీద ఆమె చూపు మరలుస్తుంది.

అగ్ని భార్య స్వాహాదేవి ఎందరో ఋషిపత్నుల వేషాలు ధరించి భర్తతో వినోదిస్తుంది. కాని ఆమె ఎంత ప్రయత్నం చేసినా అరుంధతి రూపం ధరించలేకపోతుంది. అందుకే అరుంధతి గుణాలను అనుసరించాలి గాని, ఆ తల్లి రూపాన్ని భావించరాదంటారు.

దాంపత్య జీవితంలో ప్రవేశించిన భారతీయ మహిళలందరు అరుంధతి గుణ సంపదను తమ సొంతం చేసుకొని వ్యవహరిస్తున్నారు. వసిష్ఠ అరుంధతుల్లాగా విడిపోని జంటగా తామూ ఉండాలని అభిలాషిస్తున్నారు. యుగయుగాల భారతీయ సంస్కృతీ వికాసానికి దోహదం చేస్తున్నారు. మా తత్త్వానికి అస్పృశ్యతనేదేలేదని చాటింపు వేస్తున్నారు. ఎవరైనా పాటిస్తే అది రూపదృష్టి వల్ల ఏర్పడ్డ వికృతే అంటున్నారు; తత్త్వదృష్టి వల్ల ఏర్పడే సంస్కృతినే అలవరుచు కొమ్మంటున్నారు; ఆచరించుమంటున్నారు; అనుసరించుమంటున్నారు.

## 5. ఆత్మ బంధువు అనసూయ

ఎవరి మీద అసూయ లేని తల్లి అనసూయ. అత్రి మహాముని భార్య. మహాజ్ఞాని, సిద్ధ సంకల్పురాలు. ఆశ్రమంలో ఉంటూ భర్తకు సేవలు చేస్తూ, ఆశ్రమంలోని చిన్నారులకు జ్ఞానబోధ చేస్తూ పరమ పవిత్రంగా జీవితాన్ని కొనసాగిస్తున్న మహాసాధ్వి అనసూయ.

ఒక పర్యాయం ఆ ఆశ్రమం మీదుగా త్రిమూర్తులు తమ రథాల పై వెడుతుంటారు. వారి రథాలు ఆశ్రమం దగ్గర ఆగిపోయినై. అది అత్రి ఆశ్రమమని, అనసూయ ప్రభావం వల్ల రథాలు ఆ ఆశ్రమం మీదుగా వెళ్లలేవని తెలిసింది. త్రిమూర్తులు ఆశ్చర్యపోయారు. అనసూయను పరీక్షించాలని బ్రాహ్మణ వేష ధారులై వచ్చారు. అత్రివారినాహ్వానించి ఆతిథ్యమిచ్చాడు. ఇక భోజనానికి లెండని ఆహ్వానిం చాడు.

తమ నియమం ప్రకారం దిగంబరైయై వనిత వడ్డన చేయాలంటారు. అత్రి అనసూయ దిక్కు చూస్తాడు. ఆమె సరే భోజనానికి రండి అంటుంది. త్రిమూర్తులను పీటలపై కూచొమ్మంటుంది. వారు కూచుంటారు. వారి మీద మంత్ర జలం చల్లుతుంది. వారు ముగ్గురు పసి పాపలైపోతారు.

అప్పుడు నగ్న హితయై వడ్డన చేస్తుంది. మళ్లీ వస్త్రాలు ధరిస్తుంది. వారి పై మంత్ర

జలం చల్లుతుంది. త్రిమూర్తులు బ్రాహ్మణరూప ధారులవుతారు. భోజనం చేస్తారు. వెంటనే వారిని మళ్లీ పసిపాపలుగా మార్చేసి ఆశ్రమంలోని ఊయలల్లో వేసి జోలలు పాడుతుంది; లాలలు పోస్తుంది. ముల్లోకాలనేలే వారికి తల్లి అవుతుంది.

సృష్టి స్థితిలయాలు స్తంభించిన స్థితి ఏర్పడుతుంది. దేవతలందరు గగ్గోలు పెడతారు. లక్ష్మీ పార్వతీ సరస్వతులు వచ్చి అనసూయకు కోడళ్లయి సేవలు చేస్తారు. పతిభిక్ష పెట్టమంటారు. ఆమె అనసూయ కదా! మాత ఈజగత్తుకేమాత అని నిరూపించడానికే ఆ తల్లి తన మాతృశక్తి ప్రదర్శించింది. లోకాలు కల్లోలితం కావాలనే ఆలోచన ఏ కోశానా ఆమెకు లేదు. ఆమె త్రిమూర్తులకు పూర్వ రూపం ప్రసాదించింది. త్రిమూర్తులు అనసూయకిచ్చినవరాల వల్ల దుర్వాసుడు పుట్టాడు; దత్తాత్రేయుడు జన్మించాడు.

సూర్యుడుదయిస్తే తన భర్త చనిపోతాడని కౌశికుని భార్య సూర్యుడుదయించకుండా నిరోధించింది. సృష్టి ధర్మాన్ని అపరాదని ఆమెకు నచ్చచెప్పి, సూర్యుడుదయించేట్టు చేసింది అనసూయ. చనిపోయిన ఆమె భర్తను బ్రతికించింది.

అత్రి మహాముని తపస్సుకు వెళ్లే సందర్భంలో ఇంట్లో - ఆశ్రమంలో తిండి తిప్పలకు ఏదో ఒక వ్యవస్థ చేయకుండా, తపస్సుకు వెళ్లడం భావ్యం కాదన్నది అనసూయ. అత్రికి అర్థమైపోయింది; అప్పటికప్పుడే అలాంటి వ్యవస్థ చేసి తపస్సుకు వెళ్లిపోయాడు.

దేశంలో తీవ్ర అనావృష్టి కలిగిన సందర్భంలో అనసూయ గంగాతీరంలో తపస్సు చేసి, గంగా జలాలతో దేశాన్ని సస్యశ్యామలం చేయగలిగింది. రేయింబవళ్లు పరిశ్రమించి దివ్య కార్యాలెన్నో చేసింది, దీనజన సేవ చేసింది. తన కొడుకు దత్తాత్రేయుణ్ణి ధర్మ-దైవభక్తి ప్రచారానికే ప్రపంచానికి అర్పించింది. దుర్వాసునిలోని ఆగ్రహాన్ని నిగ్రహం వైపుగా మళ్లించే ప్రయత్నం చేసింది గాని అతనిలో రుద్రాంశ అనుచితంగా అప్పుడప్పుడు ప్రకోపిస్తూనే ఉంది. ఆ తల్లి మాట చంద్రుడు కూడా వినే వాడు; ఆమె కోరిక మేరకే ఓషధుల వికాసానికి వెన్నెల కురిపించే వాడు.

సీతారామ లక్ష్మణులు వనవాసం చేస్తూ అత్రి మహాముని ఆశ్రమానికి వెళ్లారు. అనసూయ సీతకెన్నో నీతులు చెప్పింది; సతీ ధర్మాలుబోధించింది. వాడని - చెరగని వస్త్రామాల్యాదుల నిచ్చింది; సౌభాగ్యం నిమిత్తం ఆభరణాలు ధరించుమంది.

ఆ అనసూయమ్మకు మనోబలమున్నది; దివ్య శక్తులున్నవి. ఆ శక్తులన్నీ దీనజన సేవకే; హిత కార్యాలకే; జీవకోటి సంస్కారానికే; మానవులనూ, దివ్యులనూ, అసురులనూ పరమార్థ పథంలో పయనింపజేయడానికే!

ఆమె దీన జన సేవిక; దివ్యరూపిక; ధర్మప్రచారిక; ఆత్మబంధువు; అనురాగసింధువు; అనసూయ హిందువు.

# 6. ప్రేమరస చైతన్యమూర్తి ఊర్వశి

పురాణాలలో ఊర్వశి దేవకన్య. ఇంద్రుడీమెను రంభా మేనకలతో పాటు, తన రాజ్య రక్షణ కొరకు నియోగించాడు. ఎవరు తపస్సు చేసినా వారు సాధించే శక్తుల కారణంగా తన దేవేంద్ర పదవికి ప్రమాదం ఏర్పడుతుందని ఇంద్రుడు వారిపై రంభా ఊర్వశీ మేనకా తిలోత్తమలను ప్రయోగిస్తుంటాడు.

నరనారాయణుల తపోభంగానికి దేవేంద్రుడు అప్సరసలను పంపించాడు. నారాయణుడు వారి కన్న సౌందర్యవతిని సృష్టించాడు. అలా సృష్టించబడిన అప్సరసే ఊర్వశి. ఊర్వశిని చూచి ఎందరో ఊర్వశీ . . . ఊర్వశీ . . . ప్రేయసీ . . . ప్రేయసీ అంటూ వెంటపడ్డారు.

మహావిక్రముడైన పురూరవ చక్రవర్తి ఊర్వశిని చూచి పిచ్చిగా ప్రేమించాడు; ఆమె కనిపించక పోయే సరికి పిచ్చివాడైపోయాడు.

"ప్రేమేమి పిచ్చియో కామార్తుడగు వాడు
చెట్లతో సైతమ్ము చెలిమాటె మాటాడు . . ." అన్నాడు కాళిదాసు. దేవతానుగ్రహాన్ని పొంది చివరకు ఊర్వశిని పొందగలిగాడు. వారికి ధీమంతుడు, అయువు, శతాయువు, దృఢాయువు అనే కుమారులు పుట్టారు.

సూర్య వరుణులు కోరగా కూడా ఊర్వశి అంగీకరించింది. వారిరువురి వల్ల ఊర్వశికి వసిష్ఠుడు, అగస్త్యుడు జన్మించారు. సూర్యుడు లోకానికి కాంతినిస్తున్నాడు; వరుణుడు జలాన్నిస్తున్నాడు. వారి కొడుకులు ధర్మ ప్రచారకులయ్యారు. వారి పుట్టుకకు క్షేత్రంగా వ్యవహరించింది ఊర్వశి. ఇందులో అనేక ధర్మ సూక్ష్మాలున్నాయి. అవన్నీ ప్రత్యేకంగా అధ్యయనం చేయాలి.

దుర్జయుడనే కార్తవీర్య వంశ రాజుతో కూడా ఈమె కొంత కాలమున్నది. ఒక గంధర్వునితో కూడా కలిసి ఉన్నది. తాను కొందరిని కోరుకొన్నది; తనను కోరిన కొందరిని తిరస్కరించింది.

ఇంద్రుని కోరిక మేరకు అమరావతికి వచ్చిన అర్జునుణ్ణి కోరింది; అర్జునుడు ఊర్వశీమాతా అని సంబోధిస్తే అతనితో వాదించింది. భారత వంశానికి మూల పురుషుల్లో ఒకడైన పురూరవునికి నీవు భార్యగా ఉన్నందువల్ల నాకు నీవు తల్లి వంటి దానివే అన్నాడు అర్జునుడు. కాని ఇంద్రాజ్ఞ ఒకటున్నది; అది పాటించి అర్జునునికి శాపమిచ్చింది. ఆశాపకారణంగానే అజ్ఞాతవాసంలో అర్జునుడు బృహన్నలగా (షండరూపంలో) ఉండి తాను బయటపడి దుర్యోధనాదులకు తెలియకుండా తనను తాను కాపాడుకోగలిగాడు.

వ్యాసునకు శుకుడు పుట్టడానికి కూడా ఊర్వశే కారణమైందట!

ఏమి జీవితం ఊర్వశిది! తన కొరకు తాను బ్రతికిందా పరహితార్థమే జీవించిందా!

తాను కర్పూరంలా కాలిపోతూ, క్రొవ్వొత్తిలా కరిగిపోతూ ఎందరిని కన్నదో! ఎందరికి సంతృప్తినిచ్చిందో! ఎన్ని కుటుంబాలు నిల్పిందో!

అమ్మా అని వసిష్ఠుడు పిలిచాడా! తల్లీ అని అగస్త్యుడు పిలిచాడా! మాతా అని పురూరవుని సంతానం పిలిచిందా! నీవు నా తల్లివి సుమా అని ఒక్కసారైనా శుకుడన్నాడా!

ఒక్క పురూరవుడు మాత్రమే ఊర్వశీ - నా ప్రేయసీ అని వావిచ్చి పిలిచాడు; గుండెలో పదిలంగా దాచుకొన్నాడు. దివి నుండి భువికి దిగిరా . . . దిగిరా అని పిలిచే వారే కానీ, ఏరీ ఆ ఊర్వశిని పురూరవునిలా గాఢంగా ప్రేమించేవారు. అందుకే తెలుగు కవి కృష్ణ శాస్త్రి అంటాడు.

"సౌరభములేల చిమ్ము పుష్పవ్రజంబు?
చంద్రికలనేల వెదజల్లు చందమామ?
ఏల సలిలంబు పారు? గాడ్పేల విసరు?
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను?"

- ఈ ప్రేమా, ఈ ప్రణయం విశ్వమంత విశాలమైనది. ఇది ఏ గీతల మధ్యన ఇమడదు. ఇది "ఆకులో ఆకుగా, పూవులో పూవుగా, కొమ్మలో కొమ్మగా, నునులేత రెమ్మగా" . . . . అడవుల్లో - అంబరంలో - అబ్ధిలో నిత్య చైతన్యంగా ప్రవహించేది; ప్రేమయే ఆ సజీవ మూర్తి అని నినదించేంది; ప్రేమ తత్వానికీ, ప్రేమ చైతన్యానికీ ఊర్వశే ప్రతీక అని నిరూపించేది.

ఊర్వశిని ఈ దృష్టితో ప్రేమమయమూర్తులై చూడాలి! నారాయణుని ఊరువది విశ్వంభరధారి; ఆ ఊరువుమట్టే ఊర్వశి; ఆ మట్టి గంధం చైతన్యరసాత్మకం; ఆ ప్రేమరస చైతన్యమూర్తే ఊర్వశి.

## 7. సుస్థిర మానస సుకన్య

సుకన్య! ఎంత మంచి పేరు!

ఆమె శర్యాతి రాజు పుత్రిక. తండ్రీ ఆమె కలిసి ఒక రోజు అరణ్యంలో తిరుగుతున్నారు. ఒక పుట్టలో నుండి వెలుపలికి కాంతులు వస్తున్నాయి. యౌవనంలో అడుగుపెడుతున్న చాపల్యం. పుట్టను పొడిచింది; పొడిపించింది. చుట్టూ పుట్ట పెరిగి ఉంది. అందులో ఎన్నో ఏళ్లుగా చ్యవనుడు తపస్సు చేస్తున్నాడు. అతనికి గాయాలయ్యాయి.

పుట్ట పొడిచిన సైనికుల దిక్కు ఆయన ఆగ్రహంగా చూశాడు. వారు శారీరక బాధలకు గురి అయ్యారు. వారందరూ మొత్తుకొంటున్నారు. శర్యాతికర్థమైపోయింది. స్వామీ మా

. అమ్మాయిని క్షమించండి అన్నాడు. తన సైనికుల శారీరక బాధలనుతొలగించండి అని వేడుకొన్నాడు.

చ్యవనుడు సుకన్యను తనకిచ్చి వివాహం చేయుమని కోరాడు. శర్యాతి సుకన్యనడిగాడు. ఆ మహర్షి తపశ్శక్తి సంపన్నుడు. ఆయనకు ఆగ్రహం వస్తే తన నాన్న గారి రాజ్యమే పోవచ్చును. పైగా ఆయన తపోభంగానికి శారీరకగాయాలకు తాను కారకురాలయ్యింది. తనకీ వివాహం శిక్షో; వరమో, ఏమైనా కానీ సరే అనుకొన్నది. వివాహానికి ఒప్పుకొన్నది.

వృద్ధ చ్యవనునికి, లేత వయస్సులో ఉన్నసుకన్యకు వివాహం జరిగిపోయింది. ఆ రోజు నుండి సుకన్య భర్త ఆశ్రమంలోనే ఉంటూ ఆయనకు సేవలు చేస్తున్నది. చ్యవనుడు ఆమెగుణశీలాలకు సంతోషిస్తున్నాడు.

అశ్వినీ దేవతలు చాలా అందమైన వారు. వారు ఈ దంపతులను చూశారు. నీకు ఈడూజోడైన చక్కని వానిని చూపిస్తాం; మా వెంబడి రా అన్నారు వారు. వారిలా అడుగుతున్నారని సుకన్య చ్యవనునితో చెప్పింది. "మంచిది వెళ్లు" అన్నాడు చ్యవనుడు. ఆ అశ్వినీ దేవతలే చ్యవనుని కలిశారు. తమతో పాటు అతణ్ణి తీసుకొని వెళ్ళారు. తనకు యౌవనం, సుందర రూపం ఇవ్వవలసిందని చ్యవనుడు వారినడిగాడు. వీరు ముగ్గురూ సుకన్యతో కలిసి నది దగ్గరకు వచ్చారు. సుకన్యను నది ఒడ్డున ఉండుమన్నారు. ముగ్గురునదిలో మునిగి వెలుపలికి వచ్చారు. ఆశ్చర్యం చ్యవనుడు అశ్వినీ దేవతలంత అందంగా మారిపోయాడు. ముగ్గురొకే విధంగా ఉన్నారు. నీ భర్తను గుర్తించుమన్నారు. ఆమె నా భర్తనే నాకు ప్రసాదించి తమ దివ్య గుణాలను ప్రకటించండి అని కోరుకొన్నది. ముగ్గురిలో ఒకరు పక్కకు జరిగి సుకన్యా చ్యవనులను ఆశీర్వదించి వెళ్లిపోయారు

నిజానికి చ్యవనుడే సుకన్య మనో నిగ్రహానికీ పరీక్ష పెట్టాడేమో అనిపిస్తుంది. కోరికల్ని నియంత్రించవచ్చని ఆమె నిరూపించింది. నాజమే! కాని చ్యవనుడు వారు కోరిన విధంగా వెళ్లుమనగానే ఎందుకు వెళ్లిందనేదే ఇక్కడ కొరుకుడు పడని సమస్య. అయితే భర్త ఆజ్ఞను జవదాట రాదనే ఉద్దేశ్యంతోనే ఆమె వెళ్లిందని భావించాలి. వివాహానికి ముందు శారీరక గాయం కలిగించింది. ఇప్పుడతణ్ణి మానసికంగా గాయపరచదలచలేదు. అందుకే ఆమె అశ్వినీ దేవతలను అనుసరించాలనుకొంది. పైగా వారితో మాటాడుతూనే భర్త కూడా వస్తున్నాడాయె. అందువల్ల సుకన్య ఎటువంటి అసంతృప్తికి లోనుకాలేదనే అర్థం చేసుకోవాలి.

చ్యవనునికి యౌవన సౌందర్యాలు వచ్చాయన్న సంగతి తెలియక శర్యాతి కూతురునే అనుమానించే వరకు వెడతాడు. కాని అసలు విషయం తెలిసి తన కూతురు జీవితం ధన్యమైందని భావిస్తాడు.

ఒక వేళ యౌవనం రావడం అనే మహిమను నమ్మకపోతే, చ్యవనుడు తనకు సరియైన

భార్య కొరకు పరీక్ష పెట్టి ముసలివానిగా నటించి, ఎటువంటి పరిస్థితులలోనైనా చలించని వ్యక్తిత్వం ఉన్నట్టుగా నిర్ణయించుకొని, సుకన్యకు తాను యౌవనంలోనే ఉన్న స్థితిని తెలియజేశారని అనుకోవాలి. తన వ్యక్తిత్వానికి - మనస్తత్వానికి తగిన అమ్మాయి లేదా అబ్బాయి కావాలని ఆధునిక కాలంలో అనుకోవడం లేదా! అలాగే.

జీవితాంతం కలిసి ఉండే ప్రధాన నిర్ణయం తీసుకొనేప్పుడు, ఆచి తూచి అడుగు వేయడంలో తప్పు లేదు. వృద్ధ చ్యవనునికి యువ సుకన్యకు జరిగిన వివాహాన్ని ఇన్ని విధాలా అధ్యయనం చేయవలసి ఉంది.

విదేశీ వాయువులు పతివ్రతాతత్వాన్ని దూదిపింజగా కొట్టివేయడానికి చేసిన ప్రయత్నాల్ని తట్టుకొని నిలిచింది హిందూ మహిళ. ఎయిడ్స్ లాంటి భయంకర రోగాలు వ్యాపిస్తున్న తరుణంలో ఒక భార్య ఒక భర్త - వెరసి ఒక కుటుంబం అనే సిద్ధాంతం వైపుగా పాశ్చాత్య దేశాలే మొగ్గుతున్న తరుణంలో, ఈ తత్వానికి మూలకందమైన హిందూ దేశం తన జీవన మూల్యాల్ని పోగొట్టుకోరాదనే, జాతీయవాద మహిళా చైతన్య వేదికలు ఘోషిస్తున్నాయి. అందుకే సుకన్యాచ్యవనుల శరీర వృద్ధాప్యం, కుదరని జోడు, అనే మాటల పై మనసు పెట్టక, స్థిర చిత్తతపై, మనో నిగ్రహం పై, జితేంద్రియత్వం పై మనసు నిలిపి కర్మయోగంలో పయనించాల్సి ఉంది. సుస్థిర మానసగా సుకన్యను సంభావించాల్సి ఉంది.

## 8. ఎల్లలు లేని ఎల్లమ్మ - రేణుకమ్మ

జానపదుల ఎల్లమ్మే రేణుకమ్మ. ఎల్లలు లేని కల్లలు లేని తల్లి రేణుక. ఆమె జమదగ్ని భార్య. పరశురాముని తల్లి. పరశురాముని కన్న పెద్ద వారైన మరో నలుగురు కుమారులున్నారు ఆమెకు.

ప్రతి రోజూ నదికి వెళ్లి రేణుక నీళ్లు తెస్తుండేది. సమయ భంగం కాకుండా పనులు నిర్వహిస్తుండేది. ఒకరోజు నీళ్లు తీసుకొని రావడానికి వెళ్లినప్పుడు నదిలో స్నానం చేస్తున్న చిత్ర రథుడనే గంధర్వ రాజును చూస్తూ నిలుచున్నది. ఆమె మనస్సు విచలితమై అలాగే నిలబడిపోయిందని గ్రహించిన జమదగ్ని ఆగ్రహోదగ్రుడయ్యాడు. ఒక జీవితానికి కట్టుపడిన తర్వాత మనస్సు కూడా విచలితం కావద్దన్నది జమదగ్ని భావన. ఇది మానసిక వ్యభిచారం క్రిందికే వస్తుందని మనస్తత్వ శాస్త్రవేత్తలంటున్నారు. కట్టుబాటు లేని మనస్సు వల్ల అనేక ప్రమాదాల్లో ఇరుక్కొనే పరిస్థితులేర్పడతాయి.

జమదగ్ని ఆలస్యానికి కారణమడిగినప్పుడు రేణుక సత్యం చెప్పింది. ఎల్లల నిండా ఉన్న అమ్మ సత్యం చెప్పకపోతే మరెవరు చెబుతారు? జమదగ్ని ఒక్కొక్క కొడుకునే పిలిచి వారి తల్లి శిరస్సు ఖండించుమన్నాడు. కాని మొదటి నలుగురు కొడుకులు తల్లి తల త్రెంచడానికి అంగీకరించలేదు.

పరశురాముడు అంగీకరించాడు; పితృాజ్ఞ నెరవేర్చాడు. ఆ తండ్రి సంతోషించి ఏదైనా వరం కోరుకొమ్మన్నాడు. రాముడు తన తల్లిని బ్రతికించుమన్నాడు. జమదగ్ని రేణుకను బ్రతికించి, మరో వరం కోరుకొమ్మన్నాడు. అప్పుడు రాముడు తన తండ్రి ఆగ్రహాన్ని పూర్తిగా వదలిపెట్టాలని కోరుకొన్నాడు. జమదగ్ని సంతోషంగా ఆ వరాన్ని ప్రసాదించి అప్పటి నుండి పరమశాంతమూర్తిగా మారిపోయాడు.

ఈ సంగతి కార్తవీర్యార్జునునికి తెలిసింది. అతడు జమదగ్ని దగ్గర ఉన్న కామధేనువును కబళించాలని ఎన్నాళ్ల నుండో ప్రయత్నిస్తున్నాడు. కానీ జమదగ్ని ఆగ్రహతపశ్శక్తికి జడిసి దూరంగా ఉంటున్నాడు. ఇక ఇప్పుడు వెంటనే ఆశ్రమం మీద దాడి చేసి కామధేనువును అపహరించాడు. అది అన్యాయమని అడ్డు వచ్చిన జమదగ్నిని నరికి వేశాడు.

అప్పుడు పరశురాముడక్కడ లేడు. రేణుకా దేవి తీర్థ యాత్రల్లో ఉన్న కొడుకును, రామా రామా అని పిలిచింది. ఎల్ల దిక్కుల్లో ఆ మాటలు వినిపించాయి. పరశురాముడు క్షణంలో తల్లి ముందు వ్రాలాడు. తల్లి రేణుక ఇరవై యొకటి పర్యాయాలు ఎదగొట్టుకొని విలపిస్తూ జరిగిన ఘోరం గురించి చెప్పింది. రాముడు వెంటనే కార్తవీర్యార్జునునిపై దండెత్తి భీకరంగా పోరాడి, వాడి కాళ్లూ చేతులు నరికి సంహరించాడు. ఆ తర్వాత ఇరవై యొక్క పర్యాయాలు దేశమంతటా తిరిగి లోకకంటకులైన రాజాధముల నందరినీ సంహరించాడు. జనకుడు వేదాంతి కావడం వల్ల, దశరథుడు అంతఃపురంలో దాక్కోవడం వల్ల ఆ యిరువురు రాజులే ఆ కాలంలో మిగిలిపోయారని విజ్ఞులంటుంటారు.

ఏది ఏమైనా తన మాట విని అక్షరాలా అమలు జరిపే కొడుకును కనడం రేణుక అదృష్టమనే చెప్పాలి. వంద మంది కొడుకులుండి కూడా చివరకు పిండం బెట్టే (అన్నం పెట్టే) దిక్కు కూడా లేకపోయింది గాంధారీ ధృతరాష్ట్రులకు.

కాని రేణుక కొడుకులు ఆణిముత్యాలు. అందులో సముచితోగ్ర ఖడ్గ - పరశుధారి రాముడు. అందుకే ఆ తల్లి చివరకు తన భర్తను కూడా జీవించేట్లు చేసుకోగలిగింది. ఎల్లమ్మ ఆకాశంలో సగం కాదు! ఎల్ల దిశల్లో ఉన్న తల్లే ఎల్లమ్మ; ఎల్లలు లేని తల్లే ఎల్లమ్మ అని చెప్పడం.

## 9. సత్యసారమతి చంద్రమతి

రఘువంశంలోనూ, మార్కండేయాది పురాణాల్లోనూ, వినిపించే పరమ సాధ్వి చంద్రమతి; సత్య సిద్ధాంత ఆచరణాదురంధరుడైన ఇక్ష్వాకు వంశ ప్రభువు హరిశ్చంద్రుని ధర్మపత్ని. ఇంద్ర సభలో హరిశ్చంద్రుని ప్రశంస వచ్చినప్పుడు అతని సత్య సంధతను కుల గురువు వసిష్ఠుడు గట్టిగా నొక్కి చెబుతాడు. విశ్వామిత్రుడు అతనితో అబద్ధమాడిస్తానని ప్రతిజ్ఞ పడతాడు. ఇక పరీక్షల మీద పరీక్షలు. విశ్వామిత్రుని యాగానికి డబ్బిస్తానని

హరిశ్చంద్రుడొప్పుకొంటాడు. ఇవ్వక ముందే రాజ్యం పోగొట్టుకొంటాడు. భార్యను కాశీలో అమ్ముతాడు. తానూ అమ్ముడుపోయి కాటికాపరిగా ఉంటాడు.

నడిబజార్లో తనను, విశ్వామిత్రునికి మాట ఇచ్చిన డబ్బు కొరకై అమ్మివేసినప్పుడు ఆమె భర్త ఆజ్ఞనే పరిపాలించింది. కాలకౌశికునింట సేవలు చేస్తూ అనేక కష్టాలు అనుభవించింది. ఉద్యానవనంలో పళ్లు తెంపుతున్న కొడుకు లోహితాస్యుణ్ణి పాము కరిచింది. ఆ పిల్లవాణ్ణి శ్మశానానికి తానే తీసుకొని వెళ్లింది. శవసుంకం చెల్లించనిదే శ్మశానంలో శవదహన ఖననాదులు చేయడానికి వీలు లేదు. చంద్రమతి దగ్గర సుంకం కట్టడానికి డబ్బులు లేవు. కాటికాపరి అయిన హరిశ్చంద్రుడు మంగళ సూత్రమమ్మి డబ్బు తెమ్మంటాడు. తన మంగళ సూత్రం భర్తకు తప్ప మరెవ్వరికి కనిపించదు. భర్తను గుర్తిస్తుంది. అయినా హరిశ్చంద్రుడు నియమం ప్రకారంగా డబ్బు కట్టాల్సిందే అంటాడు. పిల్లవాడి శవాన్ని అక్కడే పెట్టి ఆమె మంగళసూత్రమమ్మడానికి కాశీనగరంలోకి వెడుతుంది. ఈమె పై దొంగతనం నేరం మోపబడుతుంది. మరణ శిక్ష విధింపబడుతుంది. వధ్యశిలకు తెస్తారు. కాటికాపరి హరిశ్చంద్రుడే ఆమెను చంపవలసి వస్తుంది. అయితే అతని కత్తి చంద్రమతి మెడపై పడిన వెంటనే అదిపూలదండగా మారిపోతుంది.

అప్పుడు విశ్వామిత్రుడు బ్రహ్మాదిదేవతలందరు ప్రత్యక్షమవుతారు. రాజ్యం పోయింది; అప్పు తీర్చడానికి భార్యనమ్మాడు; మిగిలిన దానికి తనను అమ్ముకొన్నాడు; కొడుకు మరణించాడు; చివరకు భార్యను న్యాయమూర్తి తీర్పునకనుగుణంగా తల నరకాల్సి వచ్చింది. కాని - "నేను డబ్బు ఇస్తాననలేదు" అని ఒక్క అబద్ధం పలకమంటే పలకలేదు. ఆ మాట అని ఉంటే ఇన్ని కష్టాలు వచ్చేవి కావు.

భర్త ఇచ్చిన మాట ఆయన ఇష్టం; నిలబెట్టుకొన్నా లేకున్నా అతని ఇష్టం; కాని భార్య చంద్రమతి నెందుకు కష్టపెట్టాలి. ఆమెనమ్మడం తప్పు అంటారు కొందరాధునికులు. పెండ్లి చేసుకొన్ననాడే భర్త కష్ట సుఖాల్లో భాగం పంచుకొంటానని చంద్రమతి ప్రతిజ్ఞ చేసింది. ఆమె ఆ ప్రతిజ్ఞకు కట్టుపడి ఉంది.

రాజ్యం పోయిన వెంటనే అరణ్యాలకు నేను రాను, నీదారి నీది, నా దారి నాది అని చంద్రమతి వెళ్లిపోయి ఉంటే ఆమెపేరు పురాగాథా చరిత్రల్లో చెప్పుకోవాల్సిన అవసరమే ఉండేది కాదు. కష్టాల కడగళ్లు, కన్నీళ్ల వడగళ్లు, కరుణ రసాత్మక సన్నివేశాలు, శోకం తారాస్థాయినందుకొన్న దృశ్యాలు వారి కథ విన్న ప్రేక్షకుని గుండె కరిగి చెరువవుతుంది. అందుకే చంద్రమతీ హరిశ్చంద్రులు సామాజికుల మనస్సులలో చెదరని బొమ్మలుగా మిగిలిపోతారు.

ప్రాచీన కాలంలో కష్టాలకు గురైనా చెదరని ధీరచిత్తలలో సీత, ద్రౌపదులు కూడా చంద్రమతిని అనుసరించిన వారి క్రిందనే చెప్పాలి. సీత అత్మ సౌందర్యం జయించిం

ద్రౌపది ధర్మశివత్వం విజయం సాధించింది; చంద్రమతి సుధీర సత్యం జయకేతనమెత్తింది. అందుకే ఆమెను సత్యసారమతిచంద్రమతి అని పిలుచుకొందాం.

★★★

మన పురాణాల్లో వందల కొలది మహిళా మణుల చరిత్రలున్నాయి. ఆ చరిత్రలన్నీ అధ్యయనం చేయదగ్గవే. అందుకే ఇక ఈ ప్రకరణంలో చివరగా లక్ష్మీ, పార్వతీ, సరస్వతుల గురించి చెప్పుకొందాం. త్రిమూర్తుల భార్యలను కూడా భారతీయ మహిళల క్రింద చెప్పుకోవాలా అని ఎవరైనా అడగవచ్చు. వారిని దేవతా స్థానాలలో నిలిపి అర్చించి, జపించి, తపించి, ఉపాసిస్తున్నదెవరు? మనమే కదా! భారతీయ మహిళల పై ఈ దేవతల ప్రభావమున్నది కదా? మన అనుష్ఠానం లేకుండా, మనస్మరణ మనన నిధి ధ్యానాదులు లేకుండా ఆ దేవతల అస్తిత్వమేది! ఇది కూడా అహంకార జన్య ప్రశ్నే! అందుకే ఉన్నది ఎప్పుడూ ఉన్నది; లేనిది ఎప్పుడూ లేదన్న గీతా వాక్యమే ఇక్కడ ప్రమాణం.

సంపద ఉన్నది - లక్ష్మి ఉన్నది.
శక్తి ఉన్నది - పార్వతి ఉన్నది.
జ్ఞానమున్నది - సరస్వతి ఉన్నది.

ఈ మూడూ, భారతీయ మహిళల్లో ఉన్నాయి. అవి దేవతల ప్రతీకలై అర్చారూపాలుగా వెలుగుతున్నాయి. లక్ష్మీ పురాణమనీ, పార్వతీ పురాణమనీ, సరస్వతీ పురాణమనీ ఈ ముగ్గురమ్మల గురించి మూడు వేల పుటల కథలు చెప్పుకోవచ్చు. ఇక్కడ మూడు పుటలు చాలు. పిండితార్థం చూద్దాం; ఆ మూడు తత్త్వాల్ని కేవలం పరామర్శిద్దాం.

★★★

## 10. సంపదల దేవి లక్ష్మీదేవి

"లక్ష్మీం క్షీర సముద్ర రాజ తనయాం . ..". లక్ష్మి సముద్రుని బిడ్డ. సముద్ర మథన సందర్భంలో అమృతంతో పాటు వెలుపలికి వచ్చింది. ఆమె చేతిలోని పూమాల చూచి, సౌందర్యాన్ని చూచి అందరూ తలలు వంచి నమస్కరించారు. తల వంచకుండా ఉన్నది ఒక్క విష్ణుమూర్తే. ఆమె చేతిలోని మాల ఆ శ్రీ మహావిష్ణువు మెడలోనే పడింది. ఆ విధంగా లక్ష్మీనారాయణుల వివాహం జరిగింది.

విశ్వం, విష్ణువు, లక్ష్మీ వేర్వేరు కారు. ఇది అంతా దివ్య దేవతామయం.

సృష్టికి మూలం ఆదిశక్తి; ఆ ఆదిశక్తి ఒక అంశ సంపద. ఆ సంపదకు సంకేత రూపమే లక్ష్మి.

సృష్టి కన్న ముందు సృష్టికర్త ఉన్నాడు. ఆయన విష్ణువే. అతని అంశలో నుండే లక్ష్మి పుట్టింది. అతని ఎద పై నిలిచి ఆమె వైకుంఠంలో ఉంటున్నది. ఒకసారి జారి సముద్రంలో

పడింది. ఆ సముద్రుడు, మథనం కారణంగా శ్రీ మహా విష్ణువుకు లక్ష్మిని సమర్పించాడు.

ఎవరు స్థితికారులో (నిలిపే వారో) వారి దగ్గరే సంపద ఉంటుంది. శ్రీ మహావిష్ణువు స్థితికారుడు. అందువల్ల లక్ష్మీ ఆయన దగ్గరే ఉన్నది. మానవ లోకంలో ఎవరు నిలకడగా ఉంటారో, వారి దగ్గరనే లక్ష్మి ఉంటుందని గ్రహించాలి.

లక్ష్మి ఒకప్పుడు విష్ణుమూర్తిపై ఆగ్రహం చెందింది. అప్పుడాయన తలనే ఎగిరిపోయింది. ఆ తర్వాత హయంతలను అతికించారు. అప్పటి నుండి ఆయనకు హయగ్రీవుడన్న పేరూ వచ్చింది.

లక్ష్మి సీతగా జన్మించింది; రుక్మిణిగా జన్మించింది. శ్రీ మహావిష్ణువు అవతారాల్లో ఆయన ధర్మ పత్నిగా లక్ష్మి మానవ రూపంలో అవతరించింది. శ్రీ మహా విష్ణువు దుష్టశిక్షణ శిష్ఠ రక్షణ నిర్వహణలో అర్ధాంగిగా సహకరించింది.

లక్ష్మి విష్ణుమూర్తులు హయ రూపధారులై విశ్వమంతా తిరిగారు. అప్పటి వారి పుత్రుడే హైహయుడు.

శ్రీ మహా విష్ణువు ఎద మీది శ్రీ వత్సం శ్రీ లక్ష్మే. అందువల్ల లక్ష్మికి శ్రీమన్నారాయణ మూర్తికి భేదం లేదు. అర్థం చేసుకోవడం కొరకు భేద దృష్టి; అర్థం అయిన తర్వాత అఖండ దృష్టి.

ఎక్కడ సంపద ఉన్నదో అక్కడ లక్ష్మి ఉన్నది. గాలీ, నీరూ, నిప్పు, మట్టి అన్నీ సంపదలే. అవే మూలాలు; ఆ మూలాలకు మూలం లక్ష్మే. కాబట్టి లక్ష్మి ఎప్పటికీ ఉన్నది; ఉంటున్నది ముందుందూ ఉంటుంది. అయితే ఆ దేవత ఉండడానికి వీలుగా భౌతికంగా - ఆంతరికంగ మనం వాతావరణం కల్పించవలసి ఉన్నది

శ్రీ మహా విష్ణువు నుండి సగంగా వెలికి వచ్చి, మళ్లీ అతని ఎదలోనే నిలిచి ఉన్న లక్ష్మి సుస్థిరసంపదకు ప్రతీక. అందుకే ఆ తల్లి సర్వజీవ కోటికి ఆదర్శమై-పవిత్రమై-అర్చాస్థానంలో వెలుగొందుతున్నది. ఆ వెలుగు ఆరిపోకుండా చూస్తున్నదిమాత్రం భారతీయ మహిళే అన్నది గుర్తించాలి.

ఆ తల్లి కమల; కమలే కాదు కమల దళాసన. ఆధునిక భారతంలో వందేమాతరంలోని "కమలా కమలదళ విహారిణీ" ఆ తల్లే. అందుకే "నమామి కమలాం అమలాం అతులాం" అంటున్నది భారతీయ మహిళ, మహిళలే కాదు మేమూ అంటున్నాం, అంటున్నది భారతీయ జనత.

## 11. పరాశక్తి పార్వతి

". . . జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరమ్॥" అన్నాడు కాళిదాసు. పరమేశ్వరుడు అర్ధనారీశ్వరుడే. ఆయన రుద్రుడు లయకారుడు. ఆలయానికి శక్తి కావాలి. ఆ శక్తికి ప్రతీకే పార్వతి.

ఆదిశక్తిలోని ఒక అంశే పరమేశ్వరుని అర్ధాంగమయింది. వారిరువురు వాగర్థాల వలె అభిన్నులు. సృష్టిలో స్త్రీ పురుషులు వేర్వేరుకారు; ఒకే తత్వానికున్న రెండు రూపాలు అన్న ప్రతీకార్థమిస్తున్నది అర్ధనారీశ్వర రూపం. నాణెమొక్కటే, ఒకరు బొమ్మా ఒకరు బొరుసు.

అయినా భేదం చేసి అర్థం చేసుకోవాలి. జ్ఞానంతో అంతా ఒకటే అని నిర్ధారించుకోవాలి.

ఆ తల్లి తొలుత దక్ష ప్రజాపతి కూతురుసతిగా పుట్టింది. యోగాగ్నిలో భస్మమై పోయింది. శివుడు విరాగి అయి తపస్సులోకి వెళ్లిపోయాడు.

ఆయమ్మ అప్పుడు మేనకా హిమవంతులకు పార్వతిగా జన్మించి, మన్మథుని సహకారంతో, మహర్షుల ఆశీర్వాదాలతో, చివరకు శివుణ్ణి మెప్పించే తపస్సు చేసి పరమేశ్వరుణ్ణి వరించింది. ఆ పార్వతీ పరమేశ్వరులకు గణపతి - కుమారస్వామి ఇద్దరు కొడుకులు.

స్కాంద, శివ, బ్రహ్మాండాది పురాణాలలో, హరవిలాస, కాశీఖండ, శ్రీకాళహస్తి మాహాత్మ్య, శివరాత్రి మాహాత్మ్య, వీరభద్ర విజయాది గ్రంథాలలో పార్వతీ పరమేశ్వరుల పూర్ణ కథలు, ఆంశిక ఘటనలు కోకొల్లలుగ ఉన్నాయి.

సంపద లక్ష్మి, సంపద భారతమాత, ఆ సంపదనూ మాతనూ రక్షించడానికి శక్తి కావాలి. ఆ శక్తినిచ్చేది పార్వతీ దేవే. అందుకే వందేమాతర గీతం "త్వం హి దుర్గాదశ ప్రహరణ ధారిణీ" అని సంభావించింది. ఈ నాటికీ ఏనాటికీ పార్వతీ పరమేశ్వరులీ జగత్తుకు మాతాపితలే. అందుకే భారతీయ మహిళా జగత్తుతోపాటు పూర్ణ భారతీయ జనత ఇలా సంభావిస్తున్నది.

"మాతాచ పార్వతీ దేవి -పితాదేవో మహేశ్వరః ।
బాంధవాః శివభక్తశ్చ - స్వదేశో భువనత్రయమ్ ॥"

శక్తి ప్రవాహిణియైన పార్వతి దుర్గాంశ ద్వారా భారతీయ మహిళలోకి ప్రవేశించింది. అందువల్ల ఆమె ఇప్పుడు దుర్గావాహిని రూపయై భారతీయ మహిళకు శక్తిని ప్రసాదిస్తున్నది; పరాశక్తిగా విరాజిల్లుతున్నది.

## 12. జ్ఞాన జ్యోతి సరస్వతి

'సరస్వతీ నమస్తుభ్యం . . . " అనీ, "తల్లీ నిన్ను దలంచి పుస్తకము చేతన్ బూనితిన్" అని చదువుల తల్లి అయిన పలుకులమ్మ సరస్వతిని ప్రార్థిస్తాం. ఆమె జ్ఞానదేవి; వాగ్దేవి. విష్ణువు నాభికమలంలో ఉన్న బ్రహ్మకు భార్య. ఆ బ్రహ్మ ఈ సృష్టి చేస్తున్నాడు. ఆయన నోట నిలిచి జగత్తుకు వాక్శక్తిని ప్రసాదిస్తున్న ఆ తల్లిని ఇలా ద్వాదశ నామాలతో కొలుచుకొంటాం, మనసారా తలుచుకొంటాం.

"ప్రథమం భారతీనామ - ద్వితీయంచ సరస్వతీ ।
తృతీయం శారదాదేవీ - చతుర్థాం హంసవాహినీ ॥

పంచమం జగతీఖ్యాతా - షష్ఠం వాగీశ్వరా తథా।
సప్తమం కుముదీప్రోక్తా - అష్టమం బ్రహ్మచారిణీ ॥
నవమం బుద్ధమాతాచ - దశమం వరదాయినీ ।
ఏకాదశం చంద్రకాంతిః - ద్వాదశం భువనేశ్వరీ ॥
ద్వాదశైతాని నామాని - త్రిసంధ్యం యఃపఠేన్నరః ।
జిహ్వాగ్రే వసతే నిత్యం - బ్రహ్మ రూపా సరస్వతీ ॥"

- బ్రహ్మ రూపంలోనే సరస్వతి కనిపిస్తున్నది. అందుకే వారి సంతానాన్ని బ్రహ్మ మానస పుత్రులనే పిలుస్తారు. బ్రహ్మ సరస్వతి ఒక్కరే. అర్థావగాహన నిమిత్తం భేదంతో చూస్తున్నాం. జ్ఞానం వల్ల అభేదం పాటిస్తున్నాం. బ్రహ్మలో సగమైన సరస్వతి బ్రహ్మనే సృష్టి వికాసం నిమిత్తం, సృష్టి రచనలో తోడుగా ఉండేందుకై వివాహం చేసుకొన్నది. బ్రాహ్మియై జ్ఞానాన్ని ప్రసాదిస్తున్నది. వాక్కయి పరా పశ్యంతి వైఖరులతో వైవిధ్యాన్ని చూపిస్తున్నది. జ్ఞానమే విశ్వం అన్నంతగా మనిషి మనిషిని ప్రబోధిస్తున్నది. భారతీయ మహిళా మానసంలో జ్ఞానకాంతియై ప్రకాశిస్తూ అర్చింపబడుతున్నది; ఉపాసింపబడుతున్నది; జ్ఞానజ్యోతి సరస్వతిగా జనం జనంలో కణం కణంలో నిలుస్తున్నది.

## ✤ పురాణ మహిళ ఆధునిక మహిళే

ఇంద్రసేన, దేవసేన, పులోమ, ఇల,అంగీరస, కావేరి, ఘృతాచి, జలంధర, తిలోత్తమ, మనోరమ, యమున, రాధ, లోపాముద్ర, శతరూప . . . ఇలా మరో వంద మంది పురాణ మహిళలను గురించి చెప్పుకోవచ్చు. పురాణ సందేశాల్ని పుక్కిట బట్టవచ్చు. సార్వకాలీన సత్యాల్ని అనుసరించవచ్చు.

అయితే పురాణ మహిళాధ్యయనం వల్ల తెలుస్తున్నదేమిటి? వారు సత్యసంధులు; స్వేచ్ఛాభిప్రాయాలు ప్రకటిస్తారు; రాజీ పడి జీవిస్తారు. ప్రేమను పంచి పెడతారు; అన్యాయాన్ని ఎదిరిస్తారు. పురుషునితో పాటు సమానంగా వ్యవహరిస్తారు, జడుడైన పురుషునికి చైతన్య శక్తి ప్రసాదిస్తారు. రసమై పారుతారు; రసాలాలై మాధుర్యాన్నందిస్తారు. జనహితం కొరకు దేశహితం కొరకు త్యాగం చేస్తారు; ఆత్మ బంధువులై ఆదుకొంటారు. సంపదలందిస్తారు; శక్తి పూత్కారం చేస్తారు; జ్ఞానజ్యోతిని వెలిగిస్తారు.

ఆధునిక భారతీయ మహిళా ప్రస్థానంలో పాథేయాలుగా పురాణ మహిళలందరూ నిలిచారు. ఒక్కొక్కరి స్పర్శ ఒక్కొక్కరిలో ఉంది; అందరి స్పర్శ ఒక్కరిలోనూ ఉంది. దారులు వేరైనా గమ్యం ఒక్కటే. ఇది అఖండ మహిళా సాంస్కృతిక చైతన్యధార. ఈ ధార పురాణాల్లో ఒకటైన భాగవతంలో మరీ ప్రధానంగా ప్రవహించింది. భారతం పై ప్రసరించింది; రామాయణంలోనూ రవళించింది. ఆ అంశాలనూ తర్వాతి ప్రకరణాల్లో చూద్దాం.

✤ ✤ ✤

# భాగవతంలో మహిళలు

- భారతీయ మహిళల్లో భాగవతం

1. ఆదిత్యుల విజయపథం - **అదితి** మాత నేతృత్వం
2. వ్యతిరేక దిశలో **దితి** ప్రయాణం
3. దివ్య మార్గం చూపించిన **దేవహూతి**
4. సహన శీల ఆశావాది **దేవకి**
5. వాత్సల్యద **యశోద**
6. చంద్రు[illegible]కోనూలు పోగంటున్న **కుబ్జ**
7. **జగన్మోహిని** యుక్తీ శక్తి.
8. అరుచి **సురుచి** - వినీతి సునీతి
9. తమస్సు చీల్చిన ఉషస్సు **ఉష**
10. జనగణనాయిక **రాధ**
11. మహిళా చైతన్య ప్రతీక **సత్యభామ**
12. కృష్ణ చైతన్య స్రోతస్విని **రుక్మిణి**

- భాగవత అభేద దృక్పథం

# భాగవతంలో మహిళలు

## ❖ భారతీయ మహిళల్లో భాగవతం

అష్టాదశ పురాణాల్లో భాగవతమొకటి. భాగవత మహిళల్ని పురాణాల్లోని మహిళల్లో అంతర్భాగంగా పరిశీలించవచ్చు. కాని, భారతీయ జనతలో అన్ని పురాణాల కన్నా ఎక్కువగా చొచ్చుకు పోయింది భాగవతమే.

ఇందులోని దశావతారాలు, నవవిధ భక్తులు, ప్రధానంగా శ్రీకృష్ణావతార కథలు జనం గుండెల్లో దీపాలు పెట్టినై. కర్మజ్ఞాన భక్తి వెలుగులను వెదజల్లినై: ముక్తిమార్గంలో సహకరించేవి. కర్మజ్ఞాన యోగాలైనా పరమగమ్యం చేర్చేది మాత్రం భక్తే అని సిద్ధాంతం చేసింది భాగవతం.

సుప్రభాతాలు, మేల్కొలుపులు, ప్రార్థనలు, భజనలు,స్తోత్రాలు, మంగళహారతులు, ఏలలు, శోభనాలు, సువ్వాలలు, అర్ధ చంద్రికలు, భ్రమరగీతలు, ఆనందపదాలు, గొబ్బి పదాలు,తుమ్మెద పదాలు . . . ఇలా అనేక సాహిత్య ప్రక్రియలకు దోహదం చేసింది; పరిపుష్టి సమకూర్చిపెట్టింది భాగవతమే.

తొలి దశలో జంగం కథలు జనంలోవ్యాపించినా, ఆ తర్వాత హరికథలుగా, పురాణ ప్రవచనాలుగా జనంలోకి భాగవత కథలే అధికంగా చొచ్చుకుపోయినై. ఆ కారణంగా ప్రహ్లాద కథ వామన చరిత్ర, గజేంద్ర మోక్షణం, రుక్మిణీ కల్యాణం, నరకాసురవధ, ఉషా పరిణయం, పరశురామచరిత్ర, కలియుగ పరిణామాలు ఇలా ఎన్నో అంశాలు ప్రజలకు తెలిసినై. కుంతీ భీష్ముల ప్రార్థనలు, నారాయణ కవచం, రుక్మిణీ కల్యాణం వంటి ఘట్టాలు ముఖ్యంగా ఆంధ్రులకు నిత్య పారాయణాలైనై.

పురాణాల్లో భాగవతానికున్న ఈ ప్రాశస్త్యాన్నీ - ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని భాగవతంలో మహిళల్ని ప్రత్యేకంగా అనుశీలించవలసి వస్తున్నది. భాగవతం శ్రవణానికి, కీర్తనానికి, స్మరణానికి, పాద సేవకు, అర్చనానికి, వందనానికి, దాస్యానికి, సఖ్యానికి, ఆత్మనివేదనానికి ప్రాధాన్యమిచ్చి వీటిని అంతస్సూత్రంగా గ్రహించి భక్తికథలను మన ముందుంచింది. ఆ కారణంగానే భారతీయ మహిళ, ముఖ్యంగా తెలుగు మహిళ

భాగవతానికి వశమై పోయిందంటే అతిశయోక్తి గాదు.

అదితి, దితి, దేవహూతి, దేవకి, యశోద, జాంబవతి, సురుచి, రాధ, కుబ్జ, రుక్మిణి, సత్యభామ, జగన్మోహిని, ఉష,నాగ్నజితి, లక్షణ, భద్ర, కుంతి, ద్రౌపది, లీలావతి, శుభాంగి, . . . ఇలా ఎందరో మహిళలు భారతీయ మహిళల జీవితాలతో పెనవేసుకొని పోయారు. వీరిలో కొందరు భారతాది గ్రంథాల్లోనూ అన్య, పురాణాల్లోనూ వచ్చారు. ఇక్కడ కొందరిని మాత్రమే పరామర్శించే అవకాశం ఉంది. మొదటగా అదితి.

## 1. ఆదిత్యుల విజయపథం - అదితి మాత నేతృత్వం

ఆదెవ్వ, ఆదెమ్మ అనే పేర్లు ఆంధ్రదేశంలో కోకొల్లలు. ఈ ఆదెవ్వ అంటే ఆదిశక్తి కావచ్చు; అదితి కూడా కావచ్చు. మరి ఆ అదితి ఆదిత్యుల తల్లి; అంటే దేవతల తల్లి.

కశ్యపునికి అదితి, దితి, వినత, కద్రువ తదితరులెందరో భార్యలున్నారు. అందరిలో అదితి పెద్ద. అదితి చేసే పూజల్ని, దితి పుత్రులైన దైత్యులు ఆటంక పరుస్తుంటారు. అంతే గాకుండా అమరావతిని పాలిస్తున్న ఇంద్రుణ్ణి దితి పుత్రుడు బలి ఆక్రమించాడు. ఆమె దేవతల దుస్థితి గూర్చి, వారి సంతానం అడవులు పట్టి వెళ్లిపోవడాన్ని గూర్చి ఎంతో చింతించింది. అందుకే తన పుత్రుడు ఇంద్రుని సహాయంతో, దితి గర్భంలో మహావీరుడు పుట్టకుండా చేయగలిగాడు. వారు మరుత్తులై ఆ తర్వాత దేవతలనే అనుసరించారు. అయితే బలి వల్ల ఏర్పడ్డ ప్రమాదాన్ని ఎదుర్కోడానికి, భర్త అనుమతితో అదితి పయోభక్షణమనే మంత్రాన్ని జపించింది. దాని వల్ల విష్ణు మూర్తి ప్రత్యక్షమయ్యాడు. తాను ఆమె కొడుకుగా జన్మిస్తానన్నాడు.

అన్న మాట ప్రకారంగా వామనుడై జన్మించాడు. ఆ వామనుడే త్రివిక్రముడై బలిని అణచి వేసి, ఇంద్రునికి అమరావతినిప్పించాడు. ఈ విధంగా ఓడిపోయిన దేవేంద్రాదుల విజయానికి, వారి తల్లి అదితి ఉపేంద్రుణ్ణి (వామనుణ్ణి) ముందు నడిపించి విజయం కలిగేట్టు చేసింది.

మార్తాండుడు, ద్వాదశాదిత్యులు కూడా అదితి పుత్రులే. కద్రువ-దితి తదితరులు అదితి వైభవాన్ని సహించే వారు కారు. వారిచ్చిన శాపాల కారణంగానే అదితి ఆ తర్వాత దేవకిగా జన్మించినట్లు దేవీభాగవతం ద్వారా, బ్రహ్మ వైవర్త పురాణం ద్వారా తెలుస్తున్నది.

అదితి సవతులు ఆమెను చీకాకుపరచడం, అడుగడుగునా ఎదురుదెబ్బలు తగలడం, అయినా ధీరచిత్తంతో ఎదుర్కోవడం, తన కొడుకుల విజయానికి ఉపేంద్రుణ్ణి సృష్టించడం, దేవేంద్రాదుల విజయానికి మాతృశక్తిగా సహకరించడం. ఇలా ఆమె తన బాధ్యతలెన్నో

నెరవేర్చగలిగింది. కశ్యపుడు అందరితో వ్యవహరించిన తీరును బట్టి దక్షిణ నాయకుడా అన్నట్టు కనిపిస్తాడు. పక్షులు (వినతకు) పాములు (కద్రువకు) రాక్షసులు (దితికి) దేవతలు (అదితికి) ఒకే కశ్యపుని సంతానం కావడం, వీరి మధ్యలోనే పరస్పర పోరాటాలు సాగడం వెలుగు చీకట్లలా, సుఖ దుఃఖాల్లా కనిపిస్తాయి. మొత్తం మీద అదితి వైపే విజయాలు కలగడం, ఆ తల్లి కార్యదక్షతగానే పరిగణించాలి.

## 2. వ్యతిరేక దిశలో దితి ప్రయాణం

తన పుత్రులను రక్షించుకోవడంలో అదితి వహించిన పాత్రనే దితి వహించింది. దితి అదితులిద్దరు ధరణీదక్షుల పుత్రికలే. ఇరువురి భర్త కశ్యపుడే. ఒకరు పగటిని కాంక్షిస్తారు; నియమబద్ధంగా ఉంటారు; అందువల్ల వారికి (అదితికి) దేవతలు జన్మించారు. మరొకరు (దితి) అసురసంధ్య కాంక్షిస్తారు; నియమరహితంగా వ్యవహరిస్తారు; ఆ కారణంగా ఆమెకు రాక్షసులు జన్మించారు.

దితి భర్తకు సేవ చేసి మహా బలవంతుడైన కొడుకును కనాలనుకొన్నది; కశ్యపుడ లాంటి కొడుకే కలుగుతాడన్నాడు. కాని ఆమె అశుచిగానూ, నియమరహితంగానూ వ్యవహరించింది. ఇంద్రుడీ బలహీనతను ఆసరాగా తీసుకొని ఇంకా పిండ రూపంలోనే ఉన్న ఆ మహాబలవంతుణ్ణి ముక్కలుగా చేయగలిగాడు. ఒక్కొక్క ముక్క ఒక మరుత్తయింది. ఆ మరుత్తులందరిని ఇంద్రునికనుకూలంగా మెలగమని తల్లే కోరింది. ఇంద్రుడు చేసేపనులకు తోడుగా అప్పటి నుండి మరుత్తులు వ్యవహరించారు.

దితి పుత్రులైన దైతేయులు, సపతి సంతానమైన ఆదిత్యుల్ని మాత్రమే కాకుండా, తమ పెద్దమ్మ అయిన అదితిని కూడా కష్టపెట్టేవారు. పైగా బలి రాక్షస రాజైన తర్వాత అదితి పుత్రుల అమరావతిని లాక్కొన్నాడు. బలిచక్రవర్తి ఉదాత్తుడూ దానశీలుడూ అయినా, దేవతల అధికారం తన చేతి క్రిందికి తెచ్చుకొన్నాడు. వారిని అడవుల పాలు చేశాడు. ఇందులో తల్లి దితి సహకారమున్నది.

ద్వేష భావాలు రెచ్చగొడుతూ, అధికార దాహం నూరిపోస్తూ తల్లులు పిల్లల్ని పెంచడం వల్లనే జాతి విద్వేషాలు, ఒకరి భూములు మరొకరు ఆక్రమించడం, ఒకరి పవిత్ర స్థలాలను మరొకరు అపవిత్రం చేస్తుండడం చరిత్రలో నిరంతరం జరుగుతున్నదే. ఈ విషయంలో దేశకాలాలు మారినై కాని మానవ మనస్తత్వాలు మాత్రం అదే విధంగా ఉన్నాయి. పిల్లల్ని మంచిగా పెంచిన అదితి కూడా తన పుత్రుల్లో పోరాటపటిమ, దౌర్జన్యాన్ని ఎదుర్కొనే సత్తా నిర్మాణం కావాలని ఆశించడంలోని అంతరార్థమిదే. చేసుకొన్న వారికి చేసుకొన్నంత, నోచుకొన్న వారికి నోచుకొన్నంత అన్నట్లుగా ఈ సామెతలు దితి-అదితుల విషయంలో సత్యమనిపిస్తాయి.

నాటి మనస్తత్వాలు నారీమణుల్లో నేటికీ ఉన్నాయి అన్నదే పిండితార్థం. అదితి దైతేయులను ఎదుర్కొనే విధంగా ఏమి చేయకపోతే, ఆమెకూ ఆమె పుత్రుల అస్తిత్వానికే ప్రమాదం ఏర్పడుతుంది. అదితి కష్టాలు అదితి పడుతున్నా, దితిగాని ఆమె పుత్రులు గాని తాము చేసినవి తప్పులని ఏనాడూ భావించకపోవడమే విచిత్రం. పైగా శక్తి సముపార్జనతో ఎదుర్కోవడానికి సంసిద్ధులు కావడమే దితికీ ఆమె పుత్రులకూ వ్యతిరేకత పెరిగిపోయింది.

## 3. దివ్య మార్గం చూపించిన దేవహూతి

కర్దమ ప్రజాపతి భార్య దేవహూతి. పురాణాల ప్రకారంగా చెప్పుకొనే తొలి మానవి అయిన శతరూప, తొలి మానవుడైన స్వాయంభువమనువు దేవహూతి తల్లిదండ్రులు. సాంఖ్య వేదాంతాచార్యులయిన కపిల మహర్షి కర్దమ దేవహూతుల పుత్రుడు.

కర్దమ దేవహూతులకు కపిలునికన్న పూర్వమే కళ, అనసూయ, శ్రద్ధ, హవిర్భువు, గతి, క్రియ, ఖ్యాతి, అరుంధతి, శాంతి అనే తొమ్మిది మంది పుత్రికలు పుట్టారు. ఆ తర్వాత కర్దముడు సన్యసించి వెళ్లాలని నిశ్చయించుకొన్నాడు. ఈ పుత్రికల వివాహాలు జరగాలని,తనకూ ఒక కొడుకు కావాలని ఆ తర్వాతనే సన్న్యసించాలని దేవహూతి అన్నది. కర్దముడు సరే అన్నాడు.

దేవహూతి శ్రీ మహావిష్ణువునే తనకు కొడుకుగా జన్మించవలసిందని కోరింది. ఆమె కోరిక మేరకే విష్ణువు కపిలాచార్యునిగా జన్మించాడు. మహా విద్వాంసుడైన కపిలుడు తల్లికి సాంఖ్యయోగ విశేషాలనన్నిటిని చెప్పాడు.

ప్రకృతి గుణాలు, ఆత్మదర్శనం, నిశ్శ్రేయసకారణం, స్వయం ప్రకాశం, మోహం, గుణత్రయం, చతుర్వింశతి తత్త్వాలు, బీజం, సూక్ష్మరూపం, ఊర్మిషట్కం, వాసుదేవవ్యూహం, స్మృతి, మిథ్యాజ్ఞానం, క్రియా జ్ఞాన ఇచ్ఛాశక్తులు, శబ్దతన్మాత్రలు, సూక్ష్మస్థూలాకాశాలు, విరాట్పురుషుడు, క్షేత్ర క్షేత్రజ్ఞులు, ప్రకృతి పురుష వివేకం, వాసనలు, మిథ్య, శాస్త్రాచరణం, స్వధర్మాచరణం, ప్రాణాధారం, ప్రత్యాహారం .... ఇలా ఎన్నో విషయాలు తెలిపి, భక్తి యోగ సాంఖ్యయోగ విశేషాలెన్నిటినో వివరించాడు దేవహూతికి కపిలుడు.

ఏదైనా మోహంలో ఇరుక్కోవడం వల్లనే అజ్ఞానం పెరుగుతున్నదని, మనిషి బంధితుడవుతున్నాడని, అందుకే ఇదంతా విష్ణు మాయగానే భావించాలని దేవహూతితో భర్త కర్దముడు మొదటే అన్నాడు. ఇప్పుడేమో కపిలుడు శుద్ధాంతరంగంలో ఆ విష్ణుమూర్తినే ధ్యానించాలంటున్నాడు.

"విమలంబై పరిశుద్ధమై తగు మనో విజ్ఞాన తత్త్వ ప్రబో
ధమతిన్నిల్పి తదీయమూర్తి విభవ ధ్యానంబు కావించి చి
త్తము సర్వాంగ విమర్శన క్రియలకున్ దార్కొల్పి ప్రత్యంగమున్
సుమహాధ్యానము సేయగా వలయు బో శుద్ధాంతరంగంబునన్.

(భాగ, III - 918 పద్యం)

ఆత్మ నిజ స్వరూపం, పిండోత్పత్తి క్రమం, గర్భస్థజీవుడు భగవంతుని స్తుతించడం తదితర విశేషాలను కపిలుడు వివరించి వెళ్లిపోయాడు. ఆ ఆత్మ మార్గదర్శనంతో అపూర్వ సాధన చేసి దేవహూతి మహాయోగ శక్తితో ఆకాశానికెగిరింది; శ్రీ హరిలో కలిసిపోయింది; దివ్య సాయుజ్యాన్ని చెందింది.

తల్లికొడుకుల ఈ భక్తి, సాంఖ్య, ఆత్మజ్ఞాన యోగ సంవాదం అపూర్వమైంది. జ్ఞానదర్శన కారకమైంది; బంధవిచ్ఛేద హేతువయ్యింది. మహిళలకు భక్తి మార్గాన్ని ఆచరణ పూర్వకంగా దేవహూతి అందించగలిగింది. దేవహూతి జీవితాన్నే ఉదాహరణగా తీసుకొంటే, ఆత్మజ్ఞాన సందర్శనార్థం ఎవరు తపించినా, దేవహూతిలాగా శ్రద్ధా పట్టుదలలతో ఎవరు వ్యవహరించినా అనుకొన్నది సాధించగలుగుతారని చెప్పవచ్చును.

## 4. సహనశీల ఆశావాది దేవకి

దేవకి వసుదేవుని భార్య; శ్రీకృష్ణుని తల్లి యుధాజిత్తు కుమారుడైన శిని వెళ్లి స్వయంవరంలో దేవకిని తీసుకొని వచ్చాడు. దారిలో అడ్డగించిన వారిని ఓడించి దేవకిని తెచ్చి వసుదేవునితో వివాహం జరిపించాడు. ఉగ్రసేనుని కొడుకు కంసుడు, దేవకికి అన్న కావాలి. ఉగ్రసేనుని సోదరుడు దేవకుడు దేవకి తండ్రి. చెల్లెలంటే కంసునికెంతో ఇష్టం. ఆ కారణంగా దేవకీ వసుదేవుల వివాహానంతరం వారిని రథం పై కూచోబెట్టుకొని తానే స్వయంగా తీసుకొని వెడుతుంటాడు. అప్పుడు అతనికి దేవకి అష్టమ గర్భ సంజాతుడు నిన్ను సంహరిస్తాడన్న మాట వినిపిస్తుంది. అది అశరీరవాణి. కంసుడు వెంటనే నమ్ముతాడు. అప్పటికప్పుడే దేవకిని చంపాలని కత్తి ఎత్తుతాడు. అప్పుడు వసుదేవుడు అతణ్ణి నివారించి, ఆమెకు కలిగే సంతానాన్ని అప్పగిస్తాం... చంపుకొమ్మంటాడు, కంసుడు శాంతించి, కొంతసేపు ఆలోచించి, దేవకీ వసుదేవులను చెరసాలలో పెడతాడు.

ఆ తర్వాత వరుసగా ఆమెకు కలిగిన ఆరుగురు కుమారులను - పసిగుడ్డులను సంహరిస్తాడు. ఏడవ గర్భము విచ్ఛిత్తియై రోహిణి ధరిస్తుంది. ఈ రోహిణి వసుదేవుని మరొక భార్య. దేవకి ఏడవ గర్భమే రోహిణిలోకి మారడం, బలరాముడు జన్మించడం జరుగుతుంది.

ఇక అష్టమగర్భంలో శ్రీకృష్ణుడు జన్మిస్తాడు. రాత్రివేళ అందరూ నిద్రిస్తుంటారు. వసుదేవుడా శిశువును తీసుకొని రేపల్లెకు వెడతాడు. రేపల్లెలో నందుని భార్య యశోదకు ఓ అమ్మాయి (యోగమాయ) పుట్టి ఉంటుంది. ఆ అమ్మాయిని తాను తీసుకొని, అబ్బాయిని యశోద పక్కలో పరుండబెట్టి, ఎవరికీ తెలియకుండా మళ్లీ చెరసాలకు వచ్చి దేవకి పక్కలో యోగమాయనుపడుకోబెడతాడు.

ఆయోగమాయనే కంసుడు బండకేసి బాదగా నిన్నుసంహరించేవాడు మరోచోట పెరుగుతున్నాడని అంటూ ఆకాశంలోకి ఎగిరిపోతుంది.

ఆ తర్వాత కంస సంహారం వరకు భర్తతో పాటే దేవకి చెరసాలలో ఉంటుంది. కంస వధ జరిగిన తర్వాత బలరామకృష్ణులు తల్లిదండ్రులకు బంధ విముక్తి కలిగిస్తారు. నాయనా! నా ఆరుగురు కొడుకులను చూడాలని ఉంది అంటుంది దేవకి. చెరసాల నుండి విడుదలైన వెంబడే కృష్ణబలరాములను ఆమె కోరిన కోరిక అది. పాతాళంలో బలితోపాటే ఉన్న ఆ ఆరుగురిని తేగా వారిని హృదయానికి హత్తుకొని మాతృవాత్సల్యంతో పొంగిపోతుంది దేవకి. వారు బండకు బాదబడినప్పుడే వయసులో ఉన్నారో ఇప్పుడలాగే ఉన్నారు. వారు పూర్వజన్మలో మరీచిపుత్రులు. శాపం కారణంగా ఎదుగుబొదుగు లేకుండా పాతాళంలో ఉంటారు. శరీరాలు బండమీద శిథిలమైనా, ఆత్మలు ఇటువంటి మరో శరీరాన్ని ధరించి పాతాళంలో ఉన్నాయన్నమాట. దేవకి స్పర్శానంతరం, కృష్ణ దర్శనానంతరం వారికి శాపవిముక్తి కలిగింది. వారూ ఆకాశం వైపు ఎగిరిపోయారు.

ఎంత తక్కువ లెక్కలువేసి చూచినా దేవకి భర్తతో పాటు కనీసం ముప్పయి సం॥లైనా చెరసాలలో ఉన్నట్లు చెప్పుకోవచ్చు. ప్రాణభీతి మహాచెడ్డది. అది కృష్ణుడు పుట్టక ముందు నుండే కంసుణ్ణి పట్టుకొన్నది. అందుకే చెల్లెలిని బావను ఎంతో హింసించాడు. ఆ హింసలన్నీ తట్టుకొన్నది దేవకి. కారణం తనను హింసించిన వాడు తనకొడుకు చేతిలోనే చావబోతున్నాడన్న తృప్తి. కొడుకులు బండకు బాదబడిన ప్రతిసారి ఆమె ఎంత మానసిక హింసకు గురయ్యిందో చెప్పలేం. ఎవరికీ ఇటువంటి శోకం రావద్దనుకొంటాం. అయితే జీవితమనే పుష్పానికి ఆశ అనే తొడిమలాగా కృష్ణుడున్నాడు గదా! అందుకే ఆమె అన్నీ భరించింది. అందుకే ఆమెను సహనశీలగా ఆశావాదిగా గుర్తుంచుకోవాలనిపిస్తుంది.

## 5. వాత్సల్యాద యశోద

దేవకి తర్వాత వెంటనే గుర్తుకు వచ్చే తల్లి ఇక యశోదే. చెరసాలలో పుట్టి యశోద ప్రక్కకు చేరాడు. యశోదను మాయ ఆవహించిందేమో! కన్నది పుత్రుడో పుత్రికో తెలియని స్థితిలో ఉంది. ఆమె కళ్లు విప్పి చూచింది కన్నయ్యనే.

ఈ వార్త గుప్పుమంది. బిలబిలమంటూ గోపికలు ఇలా అనుకొంటూ వచ్చేశారు.

"ఏమి నోము ఫలమొ యింత ప్రొద్దక వార్త
వింటి మబలలార! వీనులలర
మన యశోద చిన్ని మగవాని గనెనట
చూచి వత్తమమ్మ ! సుదతులార! *(భాగ 10- పూర్వ-183)*

ఆ శిశువు తోడిదే లోకమయ్యింది ఆ తల్లికి. పూతనను శకటాసురుణ్ణి, తృణావర్తుణ్ణి, సంహరించినప్పుడు ఆ తల్లి యశోదమ్మ ఎంత భయపడిందో, ఎంత ఆనందానికి, ఎంత ఆశ్చర్యానికి లోనయిందో చెప్పలేం!

కృష్ణుని బాలక్రీడలకా తల్లి పులకించిపోయేది. వారింట వీరింట కృష్ణుడు చేసిన అల్లరి గోపికలు వచ్చి చెప్పారు. మా యింట్లో పాలూ పెరుగు ఉండనీయడం లేదన్నప్పటి ఈ పద్యం చూడండి!

"ఓ యమ్మ! నీ కుమారుడు
మా యిండ్లను పాలుపెరుగు మననీడమ్మా!
పోయెద మెక్కడికైనను
మాయన్నల సురభులాన మంజులవాణీ!" *(భాగ-10-331)*

ఎందుకమ్మా ఇలా చాడీలు చెబుతారు. "కన్నులు తెరవని మా ఈ చిన్ని కుమారకుని రవ్వసేయందగునే"' - అంటుంది యశోద. "మంచి వాడితడెగ్గులుమానరమ్మ" అని ఎదురుగొట్టింది. మన్నుతిన్నాడని బలభద్రాదులు చెబితే, ఇన్ని ఉండంగా మన్నెందుకు తిన్నావయ్యా అంటే నోరు చూపించాడు. ఆ నోటిలో విశ్వం కనిపించింది.

"కలయో వైష్ణవమాయయో, యితర సంకల్పార్థమో, సత్యమో,
తలపన్నేరక యున్నదాననొ యశోదాదేవి గానో పర
స్థలమో బాలకు డెంత యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుటకేమి హేతువొ మహాశ్చర్యంబు చింతింపగన్....."

– ఈ బాలుని నోటిలో ప్రపంచమున్నది. వీడు బాలుడు కాడు. విష్ణువే అనుకొన్నది. ఆ స్థితి తల్లికి మంచిది కాదు. ఆమె భక్తిలో పడిపోతే కృష్ణునికి తల్లి ప్రేమ కరవైపోతుంది. అందుకే వెంటనే తల్లి భావం కలిగించాడు.

ఇక కృష్ణుణ్ణి చూచుకొంటూ, అతడేది చేసినా వచ్చే ప్రయోజనంతో ఆనందిస్తూ కాలం గడిపింది యశోద. పెరుగుకుండలు పగిలినై; మద్దులు కూలినై. వత్సాసురబకాసురుల వధ

జరిగింది. చల్దులు తింటున్నాడు. అఘాసురుడు అంతమయ్యాడు. మాయమైన గోవుల స్థలంలో కొత్త గోవుల సృష్టించాడు. ధేనుకాసురుడు మరణించాడు. కాళియమర్దనం జరిగింది. కార్చిచ్చు ఆరిపోయింది. గోపికల వస్త్రాపహరణం జరిగింది. గోవర్ధనోద్ధరణం ద్వారా అందరూ రక్షింపబడ్డారు. రాక్షసుడు నందునెత్తుకపోతే రక్షించి తెచ్చాడు. గోపికలతో కలిసి యమునా తీరాల్లో తిరిగాడు. రాసక్రీడల్లో రాటు దేలాడు. సుదర్శనుని శాపవిమోచన మయ్యింది. శంఖచూడుడు సంహరింపబడ్డాడు. వృషభాసురుడు వధింపబడ్డాడు. కేశివ్యోమాసురులు మరణించారు. అక్రూరుని వెంబడి బలరామకృష్ణులు వెళ్లారు. సుదాముణ్ణి కలిశారు. మేలుచేశారు. కువలయాపీడ్యాన్ని చంపారు. చాణురముష్టికులను వధించారు. కంసుణ్ణి చంపారు. దేవకీ వసుదేవులను విడిపించారు.

ఇలా ఇవన్నీ ఆ యశోదమ్మకు తెలుస్తూనే ఉన్నాయి. తన కొడుకు ఎంత ఎదిగిపోయాడు. విశ్వవ్యాపి అయిపోయాడు. ఇలా ఎదుగుతున్న కొడుకును చూచి ఏ తల్లి హృదయముప్పొంగదు! కన్నయ్యను కన్న ఫలానికి కన్నులు చెమ్మగిల్లగా ఆ తల్లి మాతృ వాత్సల్య రస స్రవంతిక అయ్యింది. ఆ తల్లి జీవితం ధన్యమయ్యింది.

## 6. చంద్రునికో నూలుపోగంటున్న కుబ్జ

మహాభాగవతంలో కుబ్జ ఒక మెఱుపు. ఆమె మథురలో పూలల్లుతుంది. లేపనాలు పూస్తుంది. కంసుని అంతఃపురానికి ఇవి తీసుకొని వెడుతుంది. రామకృష్ణులు మథురానగరం వీథుల్లో నడుస్తున్నారు.

కుబ్జ ఎదురుగా వచ్చింది. ఆమె త్రివక్ర. ఆమె చేతిలోని లేపనం తీసుకొన్నాడు కృష్ణుడు. శరీరానికి పూసుకొన్నాడు. కంసుని రాజ్యంలో అతనిచేత పిలువనంపబడి స్వేచ్ఛగా తిరగడం చూడముచ్చటగా ఉంది. కుబ్జకు లేపనం పూసుకొన్న కృష్ణుని దివ్యసుందరమూర్తే కనిపిస్తున్నది. ఆమె మంచి యౌవనంలో ఉన్నది. కుబ్జ అయినందువల్ల ముడుచుకుపోయి ఉన్నది. ఆమె శారీరక స్థితి చూచాడు కృష్ణుడు. మెల్లగా "గదుమ" క్రింద చేయి చేర్చి, కాలు మీద కాలు మోపి, క్రింద అణచి పట్టి ఆమె శరీరాన్ని పైకిలాగాడు. మూడువంకరలు పోయి దేహం రత్నస్వర్ణ శలాకలాగ మారిపోయింది.

ఏం కావాలో కోరుకో అన్నాడు. ఆమె అప్పటికే పరవశ అయిపోయి ఉంది. ఆమె శృంగారాన్నే కోరుకొంది. కృష్ణుడంగీకరించాడు. ఆమెకళ్ల నిండా కృష్ణుడే, ఆమె మనస్సు నిండా కృష్ణుడే, ఏండ్లూపూండ్లుగా ఉన్న కుబ్జత్వం పోయిన వెంబడే ఆమె కోరుకొన్న కోరిక అది.

ఆమె నిజానికి ముక్తి కోరుకోవాల్సింది. కాని కృష్ణుని సాంగత్యం కోరుకొన్నది. భావన నిండా కృష్ణుడే ఉంటే ఆమె నోట మరొకమాట రాలేదు.

ఇంకా కంస సంహారం జరుగలేదు. కుబ్జతో సాంగత్యం. కృష్ణుడు వెంటనే మరుసటి రోజు కంసవధ చేశాడు. దేవకీ వసుదేవులను విడిపించాడు.

కుబ్జ ఏమయ్యింది? మనకు తెలియదు. కృష్ణసాంగత్యం ఆమెకు లభించింది. కృష్ణుడు విశ్వహిత కార్యాల్లో మునిగిపోయాడు. కుబ్జ కృష్ణతత్త్వ ప్రచారంలో మునిగిపోయింది అనుకోవాలి.

దేశహిత, విశ్వహిత కార్యాలు చేస్తున్న వారికి అతి సాధారణ జీవితం గడిపే కుబ్జలాంటి అనామకులూ కూడా తమకు తోచిన సహాయం చేసి సంతృప్తి పొందుతారు. "సంతుష్టు డీ మూడు జగముల పూజ్యుండు" అనే వాక్యానికి ఉదాహరణ ప్రాయులుగా వారు మిగిలిపోతారు. ఉడతాభక్తి అంటామే అది ఇదే. భాగవతంలో కుబ్జ ఇచ్చే సందేశమూ ఇదే! ఇది చంద్రునికో నూలుపోగు అందాం.

## 7. జగన్మోహిని యుక్తీశక్తి

భాగవతంలో స్త్రీ గాని స్త్రీ జగన్మోహిని. కుబ్జలాగే ఈ పాత్ర కూడా అపూర్వసందేశాన్నందిస్తుంది. మంథర పర్వతాన్ని కవ్వంగా ఉంచి, వాసుకిని కవ్వం త్రాడుగా చేసుకొని దేవదానవులు క్షీరసాగర మథనం చేస్తారు. అందులో ఎన్నో పుట్టినై. అన్నిటితో పాటు అమృతం పుట్టింది. ఆ అమృతం కుంభాన్ని ఎవరంతకు వారు ఎగురవేసుకుపోయే పరిస్థితి ఏర్పడింది.

రాక్షసులు అమృతం త్రాగితే వారు అమరులైపోతారు. దేశ:లో మరీ ఘోరకృత్యాలు చేస్తారు. వారు త్రాగకుండా దేవతలే త్రాగేట్టు చేయాలి.

పరమాత్మకు స్త్రీ పురుష భేదం లేదు. ఆయన ఏ రూపమైనా ధరించవచ్చు. జగన్మోహినీ రూపం ధరించాడు. ఆ మెఱుపులకు ఆ తళుకులకు అందరూ అవాక్కులయ్యారు. చేష్టలుడిగి చిత్రకన్నుతో చూస్తున్నారు.

అప్పుడు జగన్మోహిని అమృతకుంభాన్ని తన చేత దక్కించుకొంది. దేవతలను రాక్షసులను వేర్వేరుగా కూచోబెట్టింది. దేవతలకు అమృతం త్రాగిస్తున్నది. రాక్షసులను నవ్వులతో. ముద్దుమురిపాలతో, చలాకి మాటలతో మురిపిస్తున్నది. భాగవతకర్త భక్తపోతన రచన చూడండి!

"వేగిరపడకుడీ వినుడు దానవులార!
తడవు సేయక వత్తు దైత్యులార !
అటు చక్క గూర్చుండు డనికన్నులల్లార్చి
చనుగవ పయ్యెద జాఱదిగిచి
వదినె మఱందుల వావులు కల్పించి
మర్మంబు లెడలించి మఱుగు చేసి
మెల్లని నగవుల మేనులు మఱపించి
కడుజాణ మాటల గాకువఱిచి
అసురవరుల నెల్ల నణకించి, సురలను
తడవు చేయవలదు త్రావుడనుచు
వచ్చుకొలది నమృత వారి విభాగించె
తరుణి దివిజులెల్ల తనిసిపొగడ." *(భాగ, 8-318)*

– ఇలా దేవతలకే అమృతం పంచడం వల్ల దానవులకు అమృతం లభించని పరిస్థితి ఏర్పడేట్టుందే అనుకొన్నాడు రాహువు. అందుకే దేవతల వరుసలోకి వెళ్లి కూచున్నాడు. అమృతం అతని నోటపడింది. పొరపాటు జరిగిపోయిందని గుర్తించిన సూర్యచంద్రులిరువురు జగన్మోహినికి సైగచేశారు. వెంటనే మోహిని చేతుల్లోకి చక్రం రానే వచ్చింది. రాహువు తల తెగింది. తల వరకది చిరంజీవి అయ్యింది. మొండెం నేల రాలిపోయింది.

వెంటనే బ్రహ్మ ఆ తలకు శాశ్వతత్వం కల్పించాడు. అది ఆకాశంలో ఉంటుంది. పర్వదినాల్లో సూర్యచంద్రుల్ని పట్టుకొంటుంది.

జగన్మోహిని వచ్చిన పని తీరిపోయింది. రాహువు తలలోకి చేరిన ఒక్క చుక్క తప్ప, ఇంకే రాక్షసునికి అమృతం అందకుండా చేసింది. అప్పుడే గరుడుడు వచ్చాడు. జగన్మోహిని అందరూ చూస్తుండగానే గరుడునిపై వెళ్లిపోయింది.

లోకంలో దివ్యశక్తులకు శాశ్వతత్వం కల్పించాలి. ఆసురీశక్తులను ప్రోత్సహించకూడదు. జగన్మోహిని ఆ పనే చేసింది. ఇంత దివ్యకర్మ నిమిత్తం వేషం ధరించవచ్చు. మోసం చేయవచ్చు. కేవలశక్తి ప్రదర్శనమే కాదు; యుక్తినీ ప్రదర్శించాలి. లేకపోతే లోకంలో సజ్జనులు మిగలరు. దోపిడీదారులది, విదేశీ చౌరబాటుదారులది దేశమైపోతుంది. దుర్జనులు అర్థపరచిత్తంతో, అధికారమత్తతతో, భోగలాలసులై నిరంకుశ పెత్తందారీతనం చలాయిస్తారు.

అందుకే భారతీయ మహిళ జగన్మోహిని అందించే సందేశం స్వీకరించాలి. వజ్రాన్ని వజ్రంతోనే ఛేదించే నీతిని పాటించాలి. ముల్లును ముల్లుతోనే తీయాలి.

మరొక్క విషయమున్నది; ఆ జగన్మోహిని రూపాన్ని శివుడాశించిన కారణంగా కాలభైరవుడు జన్మించాడనే మరొక అంశం భాగవతంలో మరో చోట ఉంది. ఇలాంటి ప్రమాదాల్లో చిక్కుకోవాల్సి వస్తుంది; జాగ్రత్త అనే హెచ్చరిక ఇది.

## 8. అరుచి సురుచి - వినీతి సునీతి

భాగవతం చతుర్థస్కంధంలో ధ్రువోపాఖ్యానమున్నది. అందులో సురుచిది మెరుపులాంటి పాత్ర. శతరూప పుత్రుడు ఉత్తానపాదుడు. అతనికి సునీతి సురుచి అని ఇద్దరు భార్యలు. సునీతి కొడుకు ధ్రువుడు; సురుచి కొడుకు ఉత్తముడు.

ఉత్తముడు తండ్రి తొడపై కూర్చుని ఆడుకొంటున్నాడు. అప్పుడు ధ్రువుడూ అక్కడికి వచ్చాడు. ఉత్తమునిలాగా తండ్రి తొడమీద తానూ కూర్చోవాలని ఉబలాటపడ్డాడు. అక్కడే ఉన్న సురుచి ఇలా అన్నది.

"ఓరి సవతి కొడుకా! నీవు నా కడుపులో పుట్టలేదు; కాబట్టి నీకు మీ నాన్న తొడమీద కూచునే హక్కు లేదు. నీ కంతగా ఇష్టం ఉంటే ఆ శ్రీహరి పాదాలు పట్టుకొని మొత్తుకో! అప్పుడు ఆయన నీకు నా కడుపులో పుట్టే వరమిస్తాడు పో...."

ఇలా హేళనగా, తీసిపారవేసిన విధంగా సురుచి మాట్లాడింది. ధ్రువుడు ఏడుస్తూ వెళ్లి తల్లి సునీతికే సంగతి చెప్పాడు. "భర్త ఆదరణకు కూడా నోచుకోలేని నా కడుపున పుట్టిన నీవు దురదృష్టవంతుడవే. తండ్రి అంకంపై కూచోడానికి హక్కు రావాలంటే హరి పాదాలు పట్టుకోవాలని ఆమె చెప్పింది నిజమే. మీ పూర్వీకులు హరిని సేవించి ముక్తినే పొందారు. నీవు ఆ నారాయణమూర్తినే నమ్ముకో-" అన్నది ధ్రువుని తల్లి సునీతి.

ఈ రెండు పాత్రలు మొన్నటివి - నిన్నటివి - నేటివి. సవతుల కయ్యాలు ఎప్పుడూ ఉన్నవే. ఉండేవే. అయితే ఈ ఇద్దరిలో సునీతి వినీతి ; సురుచి అరుచి.

అయితే సురుచిలాగా వ్యవహరించకూడదనే ఈ కథ సందేశమందిస్తున్నది. ధ్రువునికి అలాంటి వ్యవహారం కారణంగానే ధ్రువపదం లభించిందనే వాదన సరియైంది కూడా కాదు. ఆ బాల హృదయం పడ్డ బాధకు పఠితలందరికి సురుచి మీదనే కోపం వస్తుంది. పాపం సునీతి గంగిగోవు అని చప్పరించి వేస్తారు.

పురాణం రామునిలాగా నడచుకోవాలి; రావణుని లాగా నడచుకోరాదు - అనే సందేశమందిస్తుంది కదా! ఇక్కడ కూడా సునీతిలా నడచుకోవాలి; సురుచిలా నడుచుకోరాదనే మిత్ర సమ్మితాన్నే సందేశంగా గ్రహించాలి.

# 9. తమస్సు చీల్చిన ఉషస్సు ఉష

ఉష అనిరుద్ధుని భార్య; బాణాసురుని కూతురు. ఆమె ఉమామహేశ్వరులను నిత్యం పూజిస్తుంది. బాణాసురుడు కూడా గొప్ప శివభక్తుడు. శివుడే ఆ అసురుని కోటను కాపాడుతుంటాడు.

తనకు కలలో కనిపించినవాడే [illegible]వుతాడని పరమేశ్వరి చెప్పిన మాట పట్టుకొంది ఉష. ఒకరాత్రి కలలో చాలా అందమైన యువకుడు కనిపించాడు. ఈ సంగతి ఆమె తన చెలికత్తె చిత్రరేఖతో చెప్పింది. ఉష అంటే చిత్రరేఖకు పరమప్రాణం. ఆమెచెప్పిన పోలికలున్న రాజకుమారుల చిత్రపటాలు గీసి, గీయించి చిత్రరేఖ తెచ్చింది. అందులో అనిరుద్ధ కుమారుని చిత్రాన్ని గుర్తించి అతడే తనకలలో కనబడిన వారని ఉషాకుమారి చెప్పింది. అతడే అనిరుద్ధుడు; ప్రద్యుమ్నుని కొడుకు; ప్రద్యుమ్నుడేమో శ్రీకృష్ణుని కొడుకు.

ఉష చిత్రరేఖలు ఒక ఉపాయం ఆలోచించారు. ఆ యుక్తి కారణంగా చిత్రరేఖ ద్వారకకు వెళ్లి, గాఢనిద్రలో ఉన్న అనిరుద్ధునిపై మత్తుమందుచల్లి మంచంతో పాటుగా మాయం చేసి తీసుకొని వచ్చింది.

అనిరుద్ధుడు, ఉష ఎదుట ఉండడంతో ఆశ్చర్యానికి లోనయ్యాడు. పోతుటీగదూరని అంతఃపురంలోకి శివుడు కాపలా ఉన్న కోటలోకి తెచ్చిన చిత్రరేఖ మహాప్రాజ్ఞురాలనిపించింది. వారు చేసిన సాహసం అనిరుద్ధునికి ఉత్సాహాన్ని ఆనందాన్ని కలిగించింది. ఉషతో పగలూ రాత్రుళ్లూ తేడా తెలియకుండా ఎన్నో నెలలు గడిపాడు. వివాహం లేని వారిద్దరి బంధం జన్మజన్మల అనుబంధమూ అనిపించింది.

ఉష గర్భవతి అయ్యింది. కొందరు దాసీలిది పసిగట్టి రాజుగారికి వార్త చేరవేశారు. బాణుడు మహాగ్రహంతో వచ్చి ఎదిరించిన అనిరుద్ధుణ్ణి నాగపాశాలతో బంధించి చెరసాలలో వేయించాడు. ఉషను గృహ నిర్బంధంలో ఉంచాడు.

నారదుడీ వార్తను కృష్ణునికి చేరవేశాడు. శ్రీకృష్ణుడు గరుడవాహనారూఢుడై వచ్చాడు. సైన్యం కూడా ఆ వెనువెంటనే వచ్చింది. మొదట శివకేశవుల మధ్య పోరాటం జరిగింది. శివుడు వెనుకంజ వేయవలసి వచ్చింది. బాణుడూ శ్రీకృష్ణునితో యుద్ధం చేసి ఓడిపోయాడు. శివుడూ తదితర దేవతలు మధ్యవర్తిత్వం వహించారు. ఉషానిరుద్ధుల వివాహం రెండు జాతుల కలయిక అని నిర్ధారించారు. అందరూ సంతోషంగా వివాహ కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

ఉషానిరుద్ధుల వివాహం గిరిజన మైదాన ప్రాంతాల వారి వివాహంగా ఆంధ్రదేశంలోని

లంబాడీలు భావిస్తారు. ఎవరైనా ఉషాపరిణయం యక్షగానం ఆడితే కట్నాలూ కానుకలూ చదివిస్తారు. ఈ వివాహం జరిగిన నాటి నుండి నేటిదాక ఈ భావనే ఉంది.ఇది ఈ పరిణయం అందించిన సందేశం.

కాని ఉష చేసిన సాహసం, చెలికత్తె చిత్రరేఖ అపూర్వ సాహసం 'నభూతః'.... అన్నంత బాగా ఉంది. కృష్ణుని మనుమడు తమ శత్రు పక్షంలోని వాడన్న సంగతి కూడా తెలిసి, తనకు కలలో కనిపించినవాడే ఇలలో వరుడు కావాలని నిర్ణయించి, రెండు తెగలను, లేదా రెండుజాతులను ఏకతా పథం మీద నిలిపే ప్రయత్నం చేసిన ఉషసాహసం అభ్యుదయగాములందరు అభినందించాల్సిందే.

ఇంత సాహసశీలలున్న దేశం మనది. అది పురాణకాలమా? అధునాతన కాలమా అన్నది కాదు ప్రశ్న. ఏ కాలంలో అయినా ఈ విశాల దృక్పథమే జాతినీ దేశాన్ని విశ్వ ఏకత వైపు నడిపిస్తుంది. స్వాభిమానం, స్వాతంత్ర్యం, సాహసం, ఉరకలు వేసే ఉత్సాహం నిండిన యువశక్తికి ప్రతీక ఉష. అలాంటి వారి జీవితం ప్రతి తరానికి నూత్న చైతన్యం అందిస్తుంది. కాలాన్ని కొలిచి ఇన్ని తరాలని నిర్ణయిస్తే, తరతరానికి ఈ మార్గాన్ని అనుసరించిన యువజంటల చైతన్య ఉషస్సులు ఛాందసుల అజ్ఞాన తమస్సులను పటాపంచలు చేసిన కథలు సేకరిస్తే బాణాసురుని శోణపురం నుండి కన్యాకుమారి వరకు కోట్ల కథలు కుప్పలు పోయవచ్చు. తమస్సు చీల్చిన ఉషస్సుగా ఉషా సుందరిని పిలుచుకోవచ్చు.

## 10. జనగణనాయిక రాధ

రాసక్రీడ జరుగుతున్నది. ఆ రాసంలో నుండి ఓ దివ్య సుందరి పుట్టింది. ఆమె ఎవరో అప్పటికెవ్వరికి తెలియదు. ఆమె కృష్ణుని ముందు నుండి ధావనం చేసింది. ధావనం అంటే పరుగెత్తడం. కృష్ణుని ముందు రా... నుండి ధావనం చేసిన కారణంగా ఆమెను రాధ అనిపిలిచారు.

గోలోకంలోని రాధ ఈ సృష్టికే మూలం. ఆమె విష్ణువు (సర్వవ్యాపి) తొడపై కూర్చోవాలని వాంఛించింది. నేను శ్రీకృష్ణునిగా పుట్టినప్పుడు రావలసిందని విష్ణువు చెప్పాడు. ఇంద్రునిది విష్ణువు అంశే. శచీదేవిది లక్ష్మి అంశే. ఆ శచీదేవే ఇప్పుడు రాధగా పుట్టిందని నిర్ధారించారు.

ఆ రాధే రాసం నుండి వచ్చింది. కృష్ణుడు రాధను స్మరించడం రుక్మిణికిష్టం లేదు. అందువల్ల రాధకృష్ణుణ్ణి వదలి వెళ్లిపోయింది. కృష్ణుడు రాధ కొరకు తపించాడు. రాధకృష్ణుని కొరకు తపించింది.

ఈ తపనలు ఇవన్నీ లౌకిక జగత్తుకు సంబంధించినవి. కాని రాధ పరమభక్తురాలు.

ఆమె కృష్ణుని ఉద్యమానికి ఊతంగా నిలబడింది. ఆ ఉద్యమం చెడును నిర్మూలించడం; మంచిని ప్రస్థాపించడం.

కంసుని దుర్మార్గాలే ఆ చెడు పనుల క్రిందికి వస్తాయి. ఇవి కొండల్లా పేరుకుపోయాయి. ఆ పనులను ఆపివేయాలి. కంసుణ్ణి ఎదిరించాలి. అప్పుడీ పని ఎవరి వల్లా అయ్యేట్టు లేదు.

అందుకే కృష్ణుడు రాసక్రీడ స్వీకరించాడు. ఇది కృష్ణుడనే విశ్వాత్మ చుట్టు, గోపికలనే జీవాత్మలు చేసిన క్రీడగా తాత్త్వికార్థాలెన్నో మేళవించి మధురభక్తి అంటే ఇదే అంటూ ఎందరో ఎన్నో విధాలుగా విశ్లేషించారు.

కాని స్వామి సమర్పణానంద రాసమంటే రాజకీయమే అంటారు. ఇది రాజకీయ సంబంధమైన క్రీడ అంటారు. కంసునికి వ్యతిరేకంగా ఒకేగణవేషంతో పదిమంది ఎక్కడ కలిస్తే అక్కడ ఆడే ఆట పాడే పాట. పైకి చూడడానికి కనిపించే కోలాట క్రీడ. కాని కంసుని వ్యతిరేక భావ నిర్మాణానికే ఇది దోహదం చేసింది. జనాన్ని తమ భావాల కనుగుణంగా సంసిద్ధం చేస్తే, సమయం వచ్చినప్పుడు అందరూ ఏకమవుతారు. కంసునికి అండగా ఇంకా ఎవరైనా నిలబడ్డా వారిని వీరు నిరోధించగలుగుతారు. ఇంత పెద్ద వ్యూహం; అపూర్వ రచనాతంత్రం.

రాసమంటే రసానికి సంబంధించింది. ఆధ్యాత్మికార్థం ప్రకారంగా రసమంటే పరమాత్మే అని అర్థం. రాసక్రీడ అంటే పరమాత్మను చేరే జీవాత్మ క్రీడ అని అర్థం.

ఈ రాసక్రీడా వ్యూహతంత్రానికి నాయిక రాధ. నాయకుడు కృష్ణుడు. గోలోకం నుండి భూలోకానికి వచ్చి కృష్ణునికి సహకరిస్తున్నది.

ఇక రాధ కృష్ణుని మేనత్త అనే అంశం, ఆమెను భర్త మందలించాడనడం, ఆమె కృష్ణుడు శృంగార నాయికా నాయకులనడం, వారు స్వేచ్ఛగా వ్యవహరించారనడం - ఇవన్నీ కృష్ణతత్త్వాన్ని, నాటి రాజకీయ పరిస్థితుల్ని అవగాహన చేసుకోలేక పై చూపులతో అంటున్న మాటలు. నిజానికి రాధ బాఘవత రాధ కాదు; భాగవతంలోరాధ లేనేలేదు. ఆమె గోలోకరాధ. గోలోకం నుంచి రాసంలోకి వచ్చింది.

కృష్ణుని దుష్టశిక్షణ శిష్ట రక్షణ మహోద్యమంలో రాధది అపురూపమైన పాత్ర. ఆమె రాధా స్వయంసేవక సంఘాన్ని నిర్మించింది అంటారు స్వామి సమర్పణానంద కంసుణ్ణి ఎదిరించే మహోద్యమంలో జనచైతన్య నిర్మాణ నాయకురాలుగా వ్యవహరించిన రాధ జీవితం పరమ సార్థకం.

రాధను ఈ విధంగా అర్థం చేసుకొనే ప్రయత్నం జరగలేదు. ప్రస్తుత రాజకీయాల్లో

నాయక పక్షి గూటి నుండి పిట్టల్ని నడిబజారుకు లాక్కొని వచ్చి, తాను వెనుక నుండే తప్పుకొంటుంది. కాని రాధాకృష్ణులు అన్ని సందర్భాల్లో ముందే ఉన్నారు. అధికార పీఠం ఎప్పుడంటే అప్పుడే దక్కేదిగా ఉన్నా ఏనాడదీ కోరలేదు. జీవితాంతం జనగణ కల్యాణమే; మరొక్క ధ్యాసలేదు.

రుక్మిణీ కృష్ణుల వివాహానంతరం, విభిన్న సమయాల్లో భిన్న భిన్న పరిస్థితుల్లో శ్రీకృష్ణునికి సత్యభామతో, కాళిందితో జాంబవతితో మిత్రవిందతో, నాగ్నజితితో, భద్రతో, లక్షణతో వివాహాలు జరిగినై. ఈ అన్ని వివాహాల వెనుక జనహితమున్నది; దేశహితమున్నది. నరకుని చెరసాలలోని పదహారు వేలమంది నారీమణుల జీవితాల్ని ఒక్కసారి అధ్యయనం చేస్తే, కృష్ణుడు భారతీయ నారీత్వరక్షకుడుగా ఎలా నిలిచాడో అర్థమవుతుంది. ఇక ఇవన్నీ అధ్యయన శీలురకు వదలివేసి సత్యభామ జీవితాన్ని పరామర్శిద్దాం.

## 11. మహిళా చైతన్య ప్రతీక సత్యభామ

శ్రీకృష్ణుని భార్య సత్యభామ; సత్రాజిత్తు పుత్రిక. సత్రాజిత్తు దగ్గర సూర్యుడిచ్చిన శ్యమంతకమణి ఉన్నది. ఈ మణి రోజూ ఎనిమది బారువుల బంగారమిస్తుంది. ఇది కృష్ణుని దగ్గర ఉన్నట్లయితే ప్రజాహిత కార్యక్రమాలకుపయోగపడుతుందని, జనహితవాదులు కొందరు సత్రాజిత్తుతో అన్నారు. అందుకు ఆయన అంగీకరించలేదు.

ఈలోగా సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనజిత్తు మణిని ధరించి అడవికి వెళ్లాడు. అతణ్ణి ఓ సింహం చంపి మణి తీసుకొని వెడుతున్నది. ఆ సింహాన్ని జాంబవంతుడు చంపి మణిని కూతురుకిచ్చాడు. ప్రసేనజిత్తును కృష్ణుడే చంపాడనే అపవాదు ఆయన మీద పడింది. ఆ నీలాపనింద దూరం చేసుకోడానికి కృష్ణుడు జాంబవంతునితో యుద్ధం చేసి, మణిని జాంబవతి అనే కన్యామణిని గ్రహించవలసి వచ్చింది. సత్రాజిత్తు కృష్ణునితో అనవసరంగా విరోధం తెచ్చికొంటినే అనుకొని శ్యమంతకమణినిచ్చాడు; సత్యభామామణినిచ్చి వివాహం జరిపించాడు.

సత్యాకృష్ణుల వివాహానికి ఇంత నేపథ్యమున్నది. నారదుడు పారిజాత పుష్పం తెచ్చివ్వగా అది కృష్ణుడు రుక్మిణికిచ్చాడు. సత్యభామా అలుకవోయి కోపగృహంలోఉండి, భర్తను సాధించి, పారిజాత వృక్షాన్నే తెప్పించి అదితన పెరటి చెట్టుగా నాటించుకొన్నది.

కృష్ణుడు తన దాసానదాసుడని అహంకరించి, నారదుడుపదేశించిన విధంగా పుణ్యక వ్రతం చేసి కృష్ణుణ్ణి నారదునికే దానం చేసింది. తన దగ్గర ఉన్న నగలూ సర్వాభరణాలు వేసి, తులాభారం చేసి కృష్ణుణ్ణి స్వీకరించే ప్రయత్నం చేసి, సాధ్యంగాక చింతిస్తుంటే, రుక్మిణి వచ్చి

తులసి ఆకువేసి, భక్తి కలుగుకూడు పట్టెడైనను చాలు" అని నిరూపించింది. ఈ సన్నివేశంలో సత్యభామ తానేమిటో, తన వ్యక్తిత్వమేమిటో గుర్తించిందనే చెప్పాలి. విశ్వనాయకుని మీద, ఒక్క సత్యనాయిక పెత్తనం చెల్లదని తేటతెల్లమైపోయింది.

అరణ్యంలో పాండవులున్నప్పుడు సత్యాకృష్ణులొకసారి కలిసి వెళ్లారు. అప్పుడు ద్రౌపదిని సత్యభామ ఇలా అడిగింది: "నీ భర్త లెవరూ నీ మాట జవదాటరు. అందరూ నీవంటే ఎంతో ఇష్టపడతారు. వారందరికి నీవేమైనా మందులు పెట్టి వశపరచుకొన్నావా? మంత్రతంత్రాలు ప్రయోగించావా?"

వదిన మరదళ్లు వారు: ఏదో నవ్వులాటకిలా అడిగింది అని తేలికగా తీసిపారవేసే విషయం కాదిది. ద్రౌపది ఈ మాటలకు పూర్తిగా కదలిపోయింది. అందుకే తీవ్రంగా స్పందించింది.

"సత్యం పలకాలి. తన ప్రవర్తన భర్తకు అహితం కలిగించేదిగా ఉండరాదు. తన నడవడి వల్ల భర్తకు శ్రేయస్సు కలగాలి. ఆయనకు మంచి పేరు రావాలి. ఇంత మాత్రం వ్యవహరిస్తే చాలు, భర్త భార్యకు వశమైపోతాడు. మందులు మాకులూ చాలా ప్రమాదకరమైనవి. అవి అజ్ఞానం వల్ల చేసేవి. ఎలాంటి సందర్భంలోనూ భర్త మీద మందులూ మాకులూ ప్రయోగించరాదు. అలాంటి పనులు బెడిసికొడతాయి. వాటివల్ల వచ్చే తీవ్ర పరిణామాలు కుటుంబ విచ్ఛిత్తికి దోహదం చేస్తాయి. స్త్రీ ప్రవర్తనే స్త్రీకి రక్షణనిస్తుంది; భర్తకూ రక్షణ నిస్తుంది."

ఒక పిచ్చి ప్రశ్నకు ఎంత గొప్ప సమాధానం. జీవితాన్ని కాచివడపోసిన పిండీకృత సారాంశం. ఇవే వెనకటివారు పతివ్రతా ధర్మాలన్నారు. ఆధునికులు ప్రేమ సూత్రాలంటున్నారు; కుటుంబ కల్యాణ హితోక్తులంటున్నారు. ద్రౌపది ద్వారా ఈ సమాధానాలు రాబట్టి ప్రపంచ మహిళా జనానికే సత్యభామ ఎంతో మేలు చేసిందనాలి. మర్లు మందులతో భర్తలను తమ చెప్పు చేతల్లో పెట్టుకోవాలనుకొనే మహిళలకు మంచి మాటల మూటల వరాలు అందించిందనే చెప్పాలి. ఇంత మంచి పనిచేసినందుకు జై సత్యభామ అనాలనిపించడం లేదూ!

నరకాసురునిపై కృష్ణునితో పాటు వెళ్లి యుద్ధం చేసిన సత్యభామ నిజంగానే జై కొట్టించుకొన్నది. యుద్ధానికి బయలుదేరుతున్న కృష్ణుని వెంబడి తాను వస్తానన్నది. యుద్ధ దృశ్యాలు చూడడానికి కాదు. అలనాడు మాయా యుద్ధ ప్రవీణురాలైన కైక, మాయాసురుణ్ణి ఓడించడంలో దశరథునికెలా సహకరించిందో అలా సహకరించడానికే యుద్ధానికి వెళ్లిందిగానీ, దృశ్యాలు చూచి భేష్ అనడానికి కాదు; చప్పట్లు గొట్టి కిలకిలా నవ్వడానికి కాదు. బ్రహ్మాండంగా యుద్ధం చేయడానికి. నిజంగానే అలా యుద్ధం చేసింది. నరకాసురుని సైన్యం కకావికలైపారిపోయింది.

ఆవిల్లంది బలంబునొంది తదగణ్యానంత తేజోవిశే
షావిర్భూత మహాప్రతాపమున వీరాలోక దుర్లోకయై
తావేగన్ సగుణంబు చేసెధనువున్ తన్వంగి, దైత్యాంగనా
గ్రీవా సంఘము నిర్గుణంబుగ రణ క్రీడా మహోత్కంఠతోన్.

*(భాగ, దశమ, ఉత్తర - 175)*

నారి మ్రోగించింది; నారీమణుల రక్షణార్థం నరకునితో యుద్ధం చేసింది. నరక వధలో శ్రీకృష్ణునికి సంపూర్ణంగా సహకరించింది. "వీర శృంగార భయ రౌద్ర విస్మయములు, కలిసిభామినియైన రూపాన్ని" ఆంధ్ర మహాభాగవతం బ్రహ్మాండంగా జనమానసంలో బొమ్మ గట్టించింది. సత్యభామ అంటే గుర్తుకు వచ్చేది ఈ రూపమే. అందుకే ఆమెను భారతీయ మహిళా చైతన్య ప్రతీకగా భావించవచ్చు. నారీ విజయకేతనంగా నిరూపించవచ్చు.

## 12. కృష్ణ చైతన్య స్రోతస్విని రుక్మిణి

రుక్మిణి శ్రీకృష్ణుని భార్య. కుండిన నగరాధీశుడు భీష్మకుని కూతురు. రుక్మి, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మమాలి అనే అయిదుగురు ఈమె అన్నలు.

శ్రీకృష్ణుని రూపగుణాలను విని అతనినే భర్తగా భావించింది. అయితే అన్న రుక్మి కృష్ణుణ్ణి వ్యతిరేకిస్తున్నాడు. పేరుకు స్వయంవరం ప్రకటించినా, శిశుపాలునికి రుక్మిణి నివ్వాలనే అతను నిశ్చయించాడు.

రుక్మిణి అగ్నిద్యోతనుడనే బ్రాహ్మణుణ్ణి పిలిచి శ్రీకృష్ణుని దగ్గరికి రాయబారం పంపింది. ముహూర్తంలోగా వచ్చి తనను తీసుకొని వెళ్ళి పొమ్మన్నది. పెండ్లికి ముందు నగరానికి వెలుపల ఉన్న పార్వతీ దేవికి మొక్కదానికి నేను వస్తాను. ఇది మా యింటి ఆచారం అక్కడి నుండి అలాగే నన్ను తీసుకొని వెళ్లవలసినదని రాయబారం పంపింది; ఎలా తీసుకొని వెళ్లాలో కూడా స్పష్టంగా నిర్దేశించింది.

"శ్రీయుతమూర్తి! యోపురుష సింహమ! సింహము పాలి సొమ్ము గో
మాయువు గోరుచందమున మత్తుడు చైద్యుడు నీపదాంబుజ
ధ్యాయిని యైననన్ను వడిదా గొనిపోయెద నంచునున్నవా
డాయధ మాధముండెఱుగ డద్భుతమైన భవత్ ప్రతాపముల్."

*(భాగ, దశమ, ఉత్తర - 1703)*

ఇలా సందేశం పంపిన రుక్మిణి నగరం వెలువడి వచ్చింది; అప్పటికీ కృష్ణుడు వచ్చిన

సంగతి ఆమెకు, తెలియదు. ఆమె పార్వతికి ప్రణమిల్లి ఈశ్వరీ నా కోరిక తీర్చవమ్మా! హరిని పతి చేయుమమ్మా అని ఇలా ప్రార్థించింది.

"నమ్మితి నామనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ము పురాణదంపతుల మేలు భజింతుగదమ్మ! మేటిపె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరిన్ పతి సేయుమమ్మ ! నిన్
నమ్మిన వారికెన్నటికి నాశము లేదు గదమ్మ! యీశ్వరీ !"

*(భాగ, దశమ, ఉత్తర-1741)*

గర్భగుడిలోంచి రుక్మిణి వెలుపలికి వచ్చింది. మేఘమండలం నుండి చంద్రుడు వెల్వడి వచ్చినట్లు కృష్ణుడు వచ్చాడు. ఆమె చేయి పట్టి తన రథంవైపు నడిచాడు. అంతే రుక్మిణితో రథం పరుగెత్తింది. కొంత దూరం వెళ్లిన తర్వాత గుఱ్ఱం మీద ముందుకు అడ్డంగా వచ్చి రుక్మిణి అన్న రుక్మి కృష్ణునితో తలపడి ఓడిపోయి పట్టుపడ్డాడు. అప్పుడతణ్ణి చంపడానికి కృష్ణుడు ఖడ్గమెత్తగా రుక్మిణి వారించింది.

అమ్మాయి పెళ్లి కృష్ణునితో జరగాలనే నా తలిదండ్రులు కోరుకొన్నారు. వారనుకొన్నట్లు జరుగుతున్నది. దీనికి వారెంతో ఆనందిస్తారు. ఈ కల్యాణానందంలో ఉండేవారికి పుత్రమరణం శోకదాయి అవుతుంది... అన్నది. ఎత్తిన కత్తిని క్రిందికి దించి అలాగే వెంట్రుకలు కత్తిరించి "బ్రతికిపోయినావు ఇక పోయిరా బావా!" అని సాగనంపాడు కృష్ణుడు.

ఇంకా వివాహం కాలేదు; రుక్మిణి మొదటి మాట ఈ విధంగా అమలయ్యింది. రుక్మిణి జీవితంలో ఆమె మాట ఎవ్వరూ కాదనలేదు. అంత సాత్త్విక జీవితం ఆమెది. సత్యభామ నిర్వహించిన పుణ్యకవ్రతంలో ఒక్క తులసి పత్రం (విశుద్ధ భక్తి అనే దళం) శ్రీకృష్ణునికన్నా బరువైందని నిరూపించగలిగింది. ప్రద్యుమ్నాది సత్సంతానంతో, పెద్ద కుటుంబంలో తలలో నాలుకయై, శ్రీలక్ష్మిలా వ్యవహరించి, కృష్ణ చైతన్యానికి శక్తి స్రోతస్వినియై నిండు జీవితాన్ని పండించుకొన్న మహాసాధ్వి రుక్మిణి.

## ✤ భాగవత అభేద దృక్పథం

నిజానికి నరకుని చెర నుండి విడుదలైన పదహారు వేల మంది నారీమణులతో పాటు, గోపికలతో పాటు, కుటుంబాలలోని - దేశంలోని మహిళలతో పాటు ఉన్న మగవాళ్లందరూ మహిళలే..... అందరూ జీవాత్మలే. వేదోపనిషదాది గ్రంథాలలో పురుషపదం పరమాత్మ వాచకమే. పురుషపదం మగగురి కలిగిన వాడనే అర్థంలో ఆర్ష వాఙ్మయంలో ఎక్కడ వాడలేదు. ఇప్పుడు అర్థ సంకోచం చెంది పురుషపదం 'మగ' అనే చట్రంలో ఇరికిపోయింది. అందుకే పురుషుడూ - పురుషోత్తము డొక్కడే. ఆయనే విశ్వాత్మ-పరమాత్మ. ఈ జీవాత్మలన్నీ ఆయన చుట్టూ తిరుగుతున్నాయి. ఆయన నిత్యచైతన్యుడు; ఇది సృష్టి చైతన్యం. భాగవతం

నిండా వాయుశబ్ద జలతరంగితయై ఈ చైతన్యమే ప్రవహిస్తున్నది. మహిళలూ మగవాళ్లు అనే భేద భావంలేని మహాప్రపంచ వ్యవస్థ భారతీయులది. సంసార బాధ్యతల నిర్వహణ కేటాయింపులనేవి పని సక్రమంగా జరగడానికే గాని ఒకరు ఎక్కువ - ఒకరు తక్కువ, అనే భావం లేదు. అందరు ఒక్కటే అనేది భారతీయ దృక్పథం. ఒకరు ఉన్న వారు - ఒకరు లేనివారు అనే వర్గ దృష్టి హిందుత్వానికి లేనే లేదు.

అందువల్ల భాగవత తత్త్వం ప్రకారం అందరం మహిళలమే అనుకొంటే, ఎంత బావుంటుంది. స్త్రీ పురుషులను పిల్లి ఎలుకలతో, పక్షిపాములతో పోల్చేవారు గ్రహించాలి. అయినా భారతీయ మహిళా దృక్పథంతో భాగవత మహిళల్ని గురించి కొంత తెలుసుకొన్నాం. ఈ కొంతతో అనంతంవైపుగా పయనిద్దాం. అనుక్షణం మహిళా సంక్షేమాన్ని ఆకాంక్షిద్దాం. ఇక రామాయణం వైపుగా ప్రగమిద్దాం.



# రామాయణంలో మహిళలు

- మహాకావ్యం నిండా మహిళల కథలే.

1. మహితమైన దారిలో **మండోదరి**
2. రాజనీతి దురంధర **మంథర**
3. జై జై జై **కైకామాతా!** దేవహితకార్యనిర్మాతా!
4. స్త్రీ జనాభ్యుదయతారా - **తార**
5. అసురత్రాత - **కైకసి** కైసేత
6. సత్యసౌందర్యమూర్తి - **సరమ**
7. జనరంజన **అంజన**
8. కౌశలపూర్ణ **కౌసల్య**
9. ఫలిత పర్ణ **శబరి**
10. విషాగ్ని వృక్షం **శూర్పణఖ**
11. యోగిని **ఊర్మిళ**
12. పరమపునీత లోకమాత **సీత**

- రామాయణం రమణుల కథే

# రామాయణంలో మహిళలు

## ❖ మహాకావ్యం నిండా మహిళల కథలే !

హిందూ జాతిని తీర్చిదిద్ది ప్రపంచానికే మహత్తర సందేశాన్ని అందించిన రామాయణంలో ఉన్నది సీతాచరిత్రమే. "కావ్యం రామాయణం కృత్స్నం - సీతాయాశ్చరితం మహత్" - అని వాల్మీకే అన్నాడు. కాబట్టి రామాయణాన్ని సీతాచరిత్రం అనవచ్చు. రామాయణంలో మహిళలనగానే గుర్తుకు వచ్చే మొదటి మహిళ కూడ సీతాదేవే. కథంతా ఆ తల్లి చుట్టే తిరిగింది. రామాయణ కథాకాలం, ప్రాదుర్భావ కాలం కూడా ఒకటే. అందువల్ల ఆనాటి మహిళ ఆయుగధర్మానికి ప్రతిబింబంగా కనిపిస్తుంది.

ఈ యుగంలో ఏకపత్నీత్వమున్నది; బహుభార్యాత్వమున్నది. దశరథాదులు బహుభార్యత్వానికి ప్రతీకలుగా కనిపిస్తే, శ్రీరామాదులు ఏకపత్నీత్వానికి గుర్తులుగా నిలుస్తారు. మహిళలపై దౌర్జన్యాలు జరిపిన రావణాదులున్నారు ఈ యుగంలో. మహిళల్ని రక్షించిన శ్రీరామాదులూ ఉన్నారు. తప్పు చేసిన శూర్పణఖాదుల్ని శిక్షించక తప్పలేదు.

మహిళల్లో కొందరు తామున్నది అధర్మపక్షంలో అయినా ధర్మపక్షానికే విజయం సిద్ధిస్తుందని ఆశించారు. అలాంటి వారిలో మండోదరిని, త్రిజటను చెప్పుకోవచ్చు. వ్యక్తిగత స్వార్థాన్ని పెంచే ప్రయత్నంలో మంథర సఫలీకృతురాలైనా, అది అరణ్యంలోని ఆశ్రమాల్ని విద్యావేత్తల్ని రక్షించే విధంగా హితకారకమైంది. కైక అంతరంగం కూడా ఇదేనని పరిశీలన వల్ల తెలుస్తుంది.

ఇలా అనేక అంశాల్ని కథాగమనంలో పొదివికొన్న కారణంగా, అపూర్వ రచనా రామణీయకత వల్ల, రామాయణం శాశ్వతకాలాల పాటు నిలిచేట్లుగా ఉంటుందని రామాయణాంతర్గత సాక్ష్యమే వివరిస్తుంది.

> "యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చమహీతలే ।
> తావద్ రామాయణ కథా - లోకేషు ప్రచరిష్యతి ॥"

ఎంతవరకు గిరికంధరాలు, నదీనదాలు, భూమండలం ఉంట్యుందో అంతవరకు లోకంలో రామాయణ కథ సజీవంగా ఉంటుంది.

మండోదరి వంటి హితైషిణి మాటలు రావణుడు విని ఉంటే! సీత మాయలేడిపై భ్రమపడకుంటే శూర్పణఖ రామలక్ష్మణులపై మోహం పెంచుకోకుండా ఉంటే! కైక తన రెండు వరాలు దశరథుణ్ణి అడగకుండా ఉంటే! ఇలా ఎన్నో ప్రశ్నలు ప్రశ్నలుగానే మిగిలిపోతాయి. ఈ ప్రశ్నలకు సమాధానాల్ని ఆ మహిళల జీవితాల్ని పరామర్శించి తెలుసుకొందాం !

## 1. మహితమైన దారిలో మండోదరి.

మండోదరి రావణాసురుని భార్య. మాయాసురుడనే వాని కూతురు. సౌందర్యవతుల్లో సౌందర్యవతి. రావణుడు సీతను తీసుకొని రావడం ఆమెకు నచ్చలేదు. భర్త నడవడిక కారణంగా రాక్షస వంశానికే ముప్పు వచ్చేట్లున్నదనుకొన్నది.

"పరసతిని తేవడం తప్పు. ఇంత యుద్ధం జరిగింది; మన ఇంద్రజిత్తు మరణించాడు. ఇప్పటికైనా సీతను రామునికిచ్చివెయ్. తప్పు ఒప్పుకో! నీవు బతుకుతావు! నీవారలమైన మేమందరం బతుకుతాం.

రాముణ్ణి నీవు మానవ మాత్రుడనుకొంటున్నావు. యుద్ధరంగంలో ఆయన ముందు దేవదానవులెవ్వరూ నిలవరు. ఆయన ముల్లోకాలకు రక్షకుడే కాదు; ఒక్క బాణం దెబ్బతో మూడులోకాలను భస్మం చేస్తాడు; రక్షిస్తాడు. ఆయన ధాటికి గురైన ఖర దూషణాదుల్ని గుర్తుంచుకోవాల్సింది; మారీచ సుబాహులైన జ్ఞాపకం రావల్సింది. మించిపోయింది లేదు; ఇప్పటికైనా సంధి సంప్రదింపులకు దిగుమంటుంది.

అయినా వినడు! ఆమె మాటలుపెద్దగా పట్టించుకోకుండా వెళ్లిపోతాడు.

భర్త చేసిన పొరపాటును భార్య సరిదిద్దడానికి ప్రయత్నిస్తుంది. ఇది ఈ యుగధర్మం. భర్త వినినీ వినకపోనీ, తన అభిప్రాయాల్ని ప్రకటించడానికి ఈ యుగంలో ఏ మహిళ వెనుకంజవేయలేదు. దేవతలతోనే ఊడిగం చేయించుకొంటున్న భర్త, ఎన్నో విజయాలు సాధించిన వాడైనా అతని అధార్మిక ప్రవర్తనను మండోదరి నిరసిస్తూనే ఉంది.

రాముణ్ణి జయించడానికి హోమం చేస్తున్న రావణాసురుని ఏకాగ్రత భంగం చేయడానికి అంగదుడీమె జుట్టు పట్టుకొని రావణుని ఎదురుగా తెస్తాడు. రావణుడు నిజంగానే హోమాన్ని వదలిపెట్టి భార్యను రక్షించుకొంటాడు. దుర్మార్గులైన పురుషుల కారణంగా సన్మార్గులైన వారి భార్యలు కూడా అవమానాల పాలవుతారనడానికి ఇంతకన్నా ఉదాహరణ ఇంకేం కావాలి.

రాముని చేతిలోరావణుడు మరణించాడు. మండోదరి హృదయ విదారకంగా విలపిస్తుంది. ఒక్క బలహీనత కారణంగా తాను, తన రాజ్యం, కొడుకులూ, బంధువర్గం సర్వం నాశనం చేసుకొన్నావు కదా అని రోదిస్తుంది. సీత కారణంగా నీ కళ్లపై పొరలు క్రమ్ముకపోవడం దురదృష్టం అంటుంది; విధి లిఖితం అంటుంది. చావుమూడిన వాడికి

హితోక్తులు రుచించవు కదా అంటూ అనేక సార్వకాలీన సత్యాలను వెల్లడి చేస్తోంది.

రాక్షస స్త్రీలలో భర్త ధాష్టీకాన్ని, అధార్మికతను ఎదిరించి, హిత ప్రియవచనాలు పలికిన వారిలో జలంధరుని భార్య తులసి (బృంద) తర్వాత మండోదరినే చెప్పుకోవాలి. ఆమె ఇంటింటా పూజనీయురాలయ్యింది. ఈమె మహాపతివ్రతగా నిలిచిపోయింది.

## 2. రాజనీతి దురంధర మంథర

రామాయణ కథనే మలుపు త్రిప్పిన మహిళగా మంథరకు గుర్తింపుంది. రాముని పట్టాభిషేకం వరకు ఈమెకు ఊరూపేరూ లేదు. ఈమె కైక వెంబడి ఉన్న పరిచారిక. చిన్నప్పటి నుండి ఆమె అలనా పాలనా చూచింది; వివాహమైనప్పుడు అలాగే వెంబడి వచ్చింది. గొప్పస్వామి భక్తి పరాయణురాలు. కైక మంచి చెడ్డలు తప్ప మరో లోకంతో ఆమెకు సంబంధం లేదు. శ్రీరామునికి పట్టాభిషేకమన్న వార్త విన్నది; పరుగెత్తుకొని వచ్చి కైకతో ఇలా అన్నది.

"కైకమ్మా! నిదురబోతున్నావా! మబ్బులు ముసురుకు వస్తున్నాయి. చీకటి నలుదిక్కుల మూసివేస్తున్నది. నీ సవతి కొడుకు రాజు కాబోతున్నాడు సుమా!" అని హెచ్చరిక చేసింది.

కైక సంతోషించి తన ఒంటిమీది నగ కానుక ఇచ్చింది. మంథరకు కంపరమెత్తింది. నగను పక్కనే పడవేసింది. నీవు మూర్ఖురాలవు! సర్వనాశనం జరుగుతుంటే ఆనందిస్తావేమిటి అన్నది.

రాముడు రాజైతే తన మార్గం నిష్కంటకం చేసికొంటాడు. జ్ఞాతి నిప్పువంటివాడు. తన తర్వాత రాజ్యానికి వారసుడైన భరతుణ్ణి రాముడు వదలుతాడా! చంపి వేస్తాడో! రాజ్యం నుండి వెడలగొడతాడో! చెప్పలేం!

కైకా! నీ దుఃఖమే నా దుఃఖం - నీ వృద్ధే నా వృద్ధి. నీ భర్తే నిన్ను పాములాగా కాటు వేస్తున్నాడు. నీవు రేపు రాజమాత అయిన కౌసల్య వద్ద చేతులు కట్టుకొని నిలబడవలసి ఉంది. నీ సవతికి సేవచేయడానికి సిద్ధంగా ఉండు. మేము సేవ చేస్తాం. ఇక నీవు కూడా చెయ్.

రాముడు రాజవుతాడు; ఆ తర్వాత అతని పుత్రులు రాజులవుతారు; ఆ తర్వాత పౌత్రులవుతారు. భరతుడూ వారి సంతానం వారికి తరతరాలుగా సేవకులుగానే మిగిలిపోతారు. సవతి కొడుకు రాజుకానిమ్మని ఊరుకొంటే తరతరాల దాస్యం నెత్తిన వేసికొన్నట్టవుతుంది.

నీ అజ్ఞానం వల్ల భరతుని కన్నీ అమంగళాలే కలుగుతాయి. నీవు అవమానాల పాలవుతావు.......

ఇలా చెవినిల్లు గట్టుకొని పోరి దశరథుడెప్పుడో ఇచ్చిన వరాలను ఇప్పుడు కోరుకొమ్మన్నది. భరతుడు రాజ్యాభిషిక్తుడు కావాలి. రాముడు అయోధ్య వదలి పెట్టి పదునాలుగేండ్లు అడవికి వెళ్లాలి. నీవడుగు దశరథుణ్ణి, నీ భర్త నీ మాట కాదనలేరు. ఇలా చెప్పి చెప్పి కైకను కోపగృహంలో ప్రవేశపెట్టింది. కైక అమృత మానసంలో విషాన్ని నింపింది.

ఆటలాడుకొంటున్న చిన్న వయస్సులో రాముడు ద్యానవనంలో మంథరను శిక్షించాడని ఒక కథనమున్నది. అది కారణంగా రాముడు రాజు కాకూడదనుకొన్నది. ఒక మామూలు పరిచారిక; తన కుటిల బుద్ధితో రాముని పట్ట భంగానికి కారకురాలయ్యింది.

ఆమె పరేంగితజ్ఞ. లౌకిక ధర్మాలూ, రాజధర్మాలూ అన్నీ తెలిసినది. దోషాలే చూడడం అలవాటు చేసుకొన్నది. అందువల్ల పాపచింతనం ఉన్నది; దైవం కూడా ఆమె వక్రబుద్ధికి తోడుగా శరీర వక్రత కల్పించాడు. తనలాగానే ఇతరులూ స్వార్థపరులనుకొన్నది. అందుకే సింహాసనాలపై కూర్చొనే వారినే మార్చగలిగింది.

ఒక మామూలు పరిచారిక ఎంత చేసింది, ఎంతగా రెచ్చగొట్టింది. తనస్థిర సంకల్పానికి అనుగుణంగా నడిచేట్లు కైకను కీలుబొమ్మగా చేసింది. పట్టభంగమనే వజ్రసంకల్పం ఎంత మాత్రం సడలింపు కాకుండా కైకకు అండదండగా నిలిచింది.

మంథర చేసింది చాలా చెడ్డపనే. ఆమె నిండు స్వార్థమే సమర్థుడైన రాముడు రాజుకాకపోవడానికి దారితీసింది. అయితే ఆమె స్వార్థం, అందరూ అయోధ్యలనే ఏలితే అడవుల నెవ్వరేలాలి అని మనబోంట్లం ఆలోచించుకొనేట్లు చేసింది. ఆమె అనుకొన్నది సాధించింది.

ఆమె ఊహలూ, అపోహలూ అవి ఏవైనా గాని అమలు చేయగలిగిన కుటిల రాజనీతి ఆమెకున్నది. రాజ్యాలకు రాజ్యాలను తారుమారు చేసేవారు, రాజులనే తయారు చేసేవారు (King Makers)మంత్రుల లాంటివారే అన్న మన నమ్మకాన్ని వమ్ముచేసి, ఆడది తలచుకొంటే అయోధ్యను అడవి చేయగలదనీ, అడవిని అయోధ్యగా మార్చగలదని నిరూపించింది. అందుకే పరిచారిక అయిన మంథరను రాజనీతి దురంధర అనడం.

## 3. జై జై జై కైకా మాతా! దేశహిత కార్యనిర్మాతా!

దశరథుని మూడవ రాణి కైక. తండ్రి కేకయరాజు. ఈమెకు ధవళాంగుడనేఒక ముని రాక్షస మాయలకు ప్రతీకారం చేసే పద్ధతులు నేర్పిస్తాడు. ఆ కారణంగానే శంబరాసురునితో దశరథుడు యుద్ధం చేసేప్పుడు, సహకరించి రాక్షస మాయలను ఛిన్నాభిన్నం చేస్తుంది. దశరథుడెప్పుడూ యుద్ధాల్లో ఇంద్రునికి సహకరిస్తూనే ఉన్నాడు. ఇప్పుడు మాయాసురుని యుద్ధం. తన భార్య కైక సహకారం వల్లనే ఈ యుద్ధంలో తాను గెలువగలిగానన్న ప్రత్యయమేర్పడింది దశరథునికి. అందుకే ఆమె కోరిన రెండు కోరికలు తీరుస్తానన్నాడు.

ఈ వరాలు వస్తాయని గానీ, వాటి వల్ల తనకేదో ప్రయోజనం సిద్ధిస్తుందని గానీ ఆమె సహాయం చేసిందా! మంథర గుర్తు చేసే వరకు ఆమెకీ వరాల సంగతే గుర్తులేదు.

యజ్ఞంలో లభ్యమైన పాయసాన్ని దశరథుడు రెండు భాగాలు చేసి కౌసల్యకూ - కైకకే ఇచ్చాడు. అయితే వారిరువురు సగం సగం సుమిత్రకిచ్చారు. తానిచ్చిన సగం వల్ల శత్రుఘ్నుడు కలిగాడు. అందువల్లనే భరతశత్రుఘ్నులదొకజంటగా, రామలక్ష్మణులదొకజంటగా రామాయణంలో కనిపిస్తుంది.

కైక వీరవనిత. మాయోపాయంతో శత్రువును ఓడించే నైపుణ్య మున్నది. కాని రాముణ్ణి తన కొడుకుతో సమానంగా ప్రేమించింది. చివరకు మంథర దుర్బోధకు తలఒగ్గింది. మాంచి రసపట్టు ఘట్టంలో దశరథుణ్ణి వరాలడిగింది. దశరథుడు మూర్ఛపోగా, రాముడు సంగతి తెలుసుకోడానికి తానే విప్పి చెప్పింది. రాముడు పితృవాక్య పరిపాలనకు పూనుకొనేట్టు చేసింది. సీతారామలక్ష్మణులకు తానే స్వయంగా నార చీరలందించింది.

కాని మేనమామ ఇంటి నుండి వచ్చిన భరతుడు తల్లి చేసిన పనిని సహించలేదు. ఒక్కమాట మీద కోసలదేశ సింహాసనాన్నే కొట్టగలిగాననుకొన్న కైక ఆశలడియాసలయినై. ఆమె తాను రాజమాత నవుతాననుకొన్నది. కాని కథ అడ్డం తిరిగింది. ఆమెకు చింతా వంతా తప్పలేదు. సింహాసనంపై భరతుడు కూచోలేదు. శ్రీరాముని పాదుకలే సింహాసనాన్ని అలంకరించాయి.

రావణ వధానంతరం శ్రీరాముడు సీతతో అయోధ్యకు వచ్చాడు. తన తల్లి వలెనే కైకను చూచుకొన్నాడు. ఎప్పుడో భరతునితో నీవు అయోధ్యకు, నేను అడవికి రాజును అని శ్రీరాముడనడానికి కారకురాలు కైక.

"త్వం రాజా భరత! భవస్వయం నరాణాం
వన్యానా మహమపి - రాజరాణ్ణృగాణాం ।
గచ్ఛత్వం పురవర మద్య సంప్రహృష్టః
సంహృష్ట స్త్వహమపి దండకాన్ ప్రవేక్ష్యే ॥"

"భరతా! నీవు అయోధ్యకు రాజువు. నేను అరణ్యానికి రాజును. నీవు నాగరికులైన నరులను పాలించు. నేను అరణ్యంలో విహరించే జంతువులను పాలిస్తాను. నీవు సంతోషంతో రాజధానికి వెళ్లు. నేను ఆనందంగా దండకారణ్యంలో ప్రవేశిస్తాను."

జనమున్న అయోధ్య; మృగాలున్న అరణ్యం. ఎవరి పరిపాలన కష్టమో చూడండి!

ఇలాంటి కష్టకార్యాన్ని కట్టబెట్టి పండిన ఊళ్లకు ప్రభువు కావడం కాదు; ఎండిన ఊళ్లను ఏలాలి అని నిర్దేశించింది కైక. వరాలనేవి ఒక నెపమే తప్ప కైక అంతరంగమిదే అని చాలా మంది విమర్శకు లంటున్నారు.

ఎటువంటి మాయాసురత్వాన్నయినా ఎదుర్కొనే ప్రజ్ఞ ఉన్నకైక కేవలం తన కొడుకు అధికారం నిమిత్తమే పట్ట భంగానికి పాల్పడించనడం సమంజసం కాదు. "అలికి పూసిన చోట గువ్వ గుడ్డు పెట్టడానికి సిద్ధమే!" కాని ముళ్లకంపలున్నచోట ఉద్యానవనం నిర్మించాలి; రాళ్ల గుట్టలున్న చోట రమ్యహర్మ్యం కట్టాలి.

అడవిలోని ఆశ్రమాలు మాటిమాటికి రాక్షసుల దాడికి గురవుతున్నాయి. వేలాదిమంది మునులు రాక్షసుల బారినపడి మరణించారు. యజ్ఞాలు అపవిత్రమవుతున్నాయి. చదువు సంధ్యలకు ఆటంకమేర్పడుతుంది. సహస్రాబ్దాలుగా సాగివస్తోన్న సంప్రదాయానికి విఘాతమేర్పడుతున్నది. ఆ విఘాతాన్ని నిరోధించి, అరణ్యాలను అభయారణ్యాలుగా తీర్చిదిద్దాలి. అక్కడ అరణ్యకాల గానాలు వినిపించాలి; వేదఘోషభూమ్యాకాశాల్లో ప్రతిధ్వనించాలి. ఇందుకు సమర్థుడు మారీచుణ్ణి దూరం తరిమినవాడు, తాటక సుబాహులను సంహరించిన వాడు అయిన శ్రీరాముడే తప్పమరెవ్వరూ లేరు.

ఇవీ కైక ఆలోచనలు. వ్యక్తిగతంగా తాను సీతా రాములకు కష్టమే కలిగించవచ్చు గాక! కాని జనహితం ముందు, దేశహితం ముందు వ్యక్తికి కలిగే కష్టమెంత పాటిది?

ఆహా! కైకా మాతా! దేశహిత కార్యరతా! జై జై జై కైకా మాతా అని నినదించాలనిపిస్తుంది కదండి!

## 4. స్త్రీ జనాభ్యుదయ తార - తార

లోకాలనే హడలెత్తించిన రావణాసురుణ్ణి సప్త సముద్రాలలో ముంచి తేల్చిన, మహాబలవంతుడైన వానరరాజు భార్యతార. వాలి తారల కొడుకే అంగదుడు.

రామాయణ యుగంలో తార జీవితం కొందరికి దయనీయంగానే కనిపిస్తుంది. కాని ఆమె ఎవరి ఆధిపత్యానికో తలవంచి వ్యవహరించినట్లు కనిపించదు.

వాలికి రెండు సార్లు, సుగ్రీవునికి రెండుసార్లు ఆమె భార్యగా మారడం అతిసహజంగా జరిగినట్లపిస్తుంది. కొడుకు అంగదుడు మాత్రం సుగ్రీవునికి భార్యగా ఆమె వ్యవహరించడాన్ని వ్యతిరేకిస్తాడు.

యుగధర్మం-కాలధర్మం ఎటువంటిదైనా స్త్రీగా ఆమె తన వ్యక్తిత్వాన్ని నిలుపుకొని వ్యవహరించిందా లేదా అన్నదే ఇక్కడ ముఖ్యం. ఎటుగాలి వీస్తే అటు కొట్టుకొని పోయిన మహిళా మూర్తిగానే తార రూపం బొమ్మగడుతుందా! పరిశీలించాలి మరి!

కిష్కింధానగరానికి వాలి రాజు; అతని భార్య తార; కొడుకు అంగదుడు. దుందుభివంటి రాక్షసులను సంహరించి, తనను మోసంతో బంధించాలనుకొన్న రావణాసురునికే బుద్ధి

చెప్పి, అజేయ వనచర రాజ్యాన్ని పరిపాలిస్తున్న మహాబలశాలి ధీమంతుడు - ధీరుడు వాలి. అతని భార్య తార కూడా అంతటి ధీరురాలు.

తన రాజ్యంలో అరాచకాలకు పాల్పడుతున్న మాయావితో పోరాటానికి దిగిన వాలి అతణ్ణి తరుముతూ కొండ గుహలో ప్రవేశిస్తాడు. అతనితో యుద్ధం చేస్తూ గుహలోకి వెళ్లే సమయంలో భార్య తార, తమ్ముడు సుగ్రీవుడు వాలిని అనుసరిస్తూనే ఉంటారు. తాను వెలుపలికి రాలేని స్థితి ఏర్పడితే, మరణించినట్లుగా భావించి గుహను మూసివేయాలని ఆదేశించి వాలి లోనికి వెళ్లిపోయాడు. తారా సుగ్రీవులు, నిర్దేశించిన సమయం దాటేంత వరకు నిరీక్షించి, వెళ్లిపోతారు. కిష్కింధకు సుగ్రీవుడు రాజవుతాడు. తార అతని భార్య అవుతుంది.

మాయావిని చంపిన వాలి కొన్నాళ్ళకు తిరిగి వస్తాడు. తన తమ్ముడు సుగ్రీవుడు కావాలనే బిలం మూసివేసి, తన భార్యనూ రాజ్యాన్ని అపహరించాడని భావిస్తాడు. అందుకే కిష్కింధా నగరంలో మళ్లీ అడుగుపెట్టకుండా తరిమివేస్తాడు. తార మళ్లీ వాలికి భార్య అవుతుంది.

సుగ్రీవుడు ఋష్యమూకం మీద నివాసం ఏర్పాటు చేసుకొన్నాడు. సీతాన్వేషణలో వచ్చిన శ్రీరామునితో స్నేహం చేశాడు. ఒప్పందం ప్రకారంగా రాముడు వాలిని సంహరించడం, సుగ్రీవుడు కిష్కింధకు రాజు కావడం, తార మళ్లీ సుగ్రీవుని భార్య కావడం అన్నీ చకచకా జరిగిపోయినై; లేదా సుగ్రీవుడనుకొన్నట్టు జరిగిపోయినై.

ఎవరు రాజైతే వారికి భార్య కావటానికి తార ఆటబొమ్మనా అనిపిస్తుంది! కాని ఓడిపోయిన సుగ్రీవుడు మళ్లీ యుద్ధానికి వచ్చినప్పుడు ఆమె వాలితో అన్న మాటలు, వాలి వధానంతరం ఆమె శ్రీరామచంద్రుణ్ణి అన్నమాటలు ఆమె ఫలిత ప్రాజ్ఞతకు నిదర్శనాలుగా కనిపిస్తాయి.

"శ్రీరామచంద్రా! నీవు మానవాభ్యుదయం కోసం స్వరాజ్యం వదలి పెట్టావు జగదభ్యుదయం కోసం బయలుదేరావు. ఈ సంగతులన్నీ నాకు తెలుసు. కాని నా భర్త నెందుకు చంపావు. ఇప్పుడు నన్నూ ఆ బాణంతోనే చంపెయ్! చచ్చిపోయి అయినా అలా నా భర్తను కలుసుకొంటాను. భార్యాభర్తలను ఒక చోటికి చేర్చి ఆ పుణ్యం మూటగట్టుకో !

నీవు బుద్ధిమంతుడవు. ఇంకా ఎందుకు ఆలోచించడం. నన్ను చంపివేస్తే స్త్రీహత్యాదోషం అంటుకొంటుందని బాధపడుతున్నావా! అటువంటిదేం జరగదు లెండి! ఈ దీనురాలైన తార ఆ వాలి ఆత్మ స్వరూపం. శాస్త్రాలూ - వేదాలు భార్య పురుషుని ఆత్మే అని చెబుతున్నాయి. నేను నా పురుషుని ఆత్మ అయినప్పుడు నన్ను చంపివేస్తే ఇక స్త్రీ హత్యాదోష మెక్కడ ఉంటుంది. ఈ లోకంలో భార్యను భర్తకు దానం చేయడం కన్నా గొప్పదనం మరొకటి లేదని

జ్ఞానవంతులంటుంటారు. ఏదైనా హత్యా దోషం ఉందనుకొన్నా ఈ దానం వల్ల అదీ తొలగిపోతుంది.

నీవు నా భర్తకు నన్ను దూరం చేశావు. నేనిప్పుడు అనాథను; అర్తురాలను. నన్ను చంపెయ్! ఆయన్ని చేరుకొంటాను. అనాథను ఆ విధంగా సనాథనవుతాను.'

ఇవీ తార మాటలు. ఆమె ఆత్మతత్త్వం తెలుసుకొన్న ఆత్మజ్ఞాని అని తెలుస్తూనే ఉన్నది. తత్త్వం తెలిసిందే కాని దేహం మీది మమకారం పోలేదు. అది ఉద్వేగ సమయం. ఉత్తర క్రియలకు ఇక శవాన్ని తీసుకొని వెళ్లాలి. రాముడిది విధి నిర్ణయమని అప్పటికి తారను ఓదార్చుడు.

శవం ఊరేగింపులోనూ తార విపరీతంగా ఏడ్చింది. యముడు రాముని రూపంతో ఈ వనానికి వచ్చి మమ్మందరినీ విధవలను చేసి లాగికొని పోతున్నాడని విలపించింది. ఆమె శవాన్ని ఒక పట్టానా వదలిపెట్టలేదు. వానరాంగనలు తారను బలవంతాన తొలగించిన తర్వాతనే శవదహనం జరిగింది. సుగ్రీవుడు కిష్కింధాధిపతి అయ్యాడు. తార మరోసారి సుగ్రీవునికి భార్య అయింది.

తార రోదన - వేదన సందర్భంలోనే ఆమె పుత్రుడు అంగదుణ్ణి యువరాజుగా శ్రీరాముడు ప్రకటించాడు. మున్ముందా యువరాజ పదవి తన పుత్రునికదే విధంగా ఉండాలన్నా, సుగ్రీవుని తదనంతరం అతను రాజు కావాలన్నా, తాను అంతఃపురంలో ఆధిపత్యం చలాయించే స్థాయిలో ఉండాలి. అందుకే ఆమె పట్టమహిషి అయిందన్నమాట. సుగ్రీవుని భార్య రుమది రెండవ స్థానమేనన్న మాట.

సామాజిక చట్రాలను మరీ బిగించి చూచేవారికి ఇవన్నీ నీతి బాహ్య కార్యాలుగా కనిపిస్తాయి. కానీ పోయిన వాళ్ల వెంబడి పోయేదెవ్వరు! చచ్చి సాధించేదేమున్నది?

భర్త శవం చితి మీదికి చేరడానికి ముందు ఆ శవం మీద పడి భోరున ఏడుస్తూ, మీరు చావలేదు, లెండి, రండి, ఎవరూ లేని చోట ఈ వనంలో ఒంటరిగా సుఖభోగాలనుభవిస్తూ మనం జీవిద్దాం అంటుంది తార.

తార ఎంత ఆత్మతత్త్వం తెలిసిందనిపించినా, ఆమె భౌతిక వాంఛలను దాటి బయటికి రాలేదని తెలుస్తూనే ఉన్నది. అది వరకే ఓసారి ఆమె సుగ్రీవుని భార్య. ఇప్పుడు కొడుకు కొరకు, కొడుకుకు రాబోయే రాజ్యం కొరకు, తన వాంఛా పరితృప్తి కొరకు, రాణివాసం కొరకు సుగ్రీవుని భార్య అయింది. ఆజీవనం ఈ బంధం - అనుబంధం కొనసాగింది.

జీవితంలో సుఖం కావాలి; అర్థం కావాలి; అధికారం కావాలి. ఇందులో దాపరికమేమీ లేదు. అంతా కళ్లకు కట్టినట్లే ఉన్నది. వాలి మరణం తాత్కాలికంగా సంతాప కారకమయ్యిందే

తప్ప, జీవితాన్ని అంతం చేసుకోవాలనే కోరిక తారకులేదు. అలా అంతం కావాలని రామాయణ కాలం నాటి ఏ ధర్మశాస్త్రమూ చెప్పలేదు. పైగా స్త్రీ పునర్వివాహాన్ని అవి సమర్థించాయి. ఆ తర్వాత వచ్చిన పరాశరస్మృతే ఇందుకు ప్రమాణం

"నష్టే, మృతే, పరివ్రజితే - క్లీబేచ పతితే పతౌ ।
పంచస్వాపత్సు నారీణాం - పతిరన్యోవిధీయతే ॥"

- నష్టమైపోయినా అంటే తెలియకుండా ఎక్కడికో పోయినా, మృతి చెందినా, సన్యసించినా, నపుంసకుడైనా, పతితుడైనా - ఈ అయిదు సందర్భాలలో ఆ స్త్రీ పురాకపతిని విధి యుక్తంగా స్వీకరించవచ్చునన్నాడు.

ఈ పరాశర స్మృతి రామాయణ కాలం తర్వాతిదే కావచ్చుగాక! కాని ఈ శాస్త్ర నియమం ఈనాటికీ అందరూ అంగీకరించడం ఆనాటి పరమాభ్యుదయమే అనాలి కదా! ఈ పరమాభ్యుదయ కార్యానికి ఉదాహరణగా నిలిచిన మహిళా మనోజ్ఞమూర్తిగా, స్త్రీజనాభ్యుదయ తారగా తారను గుర్తించవచ్చు. రామాయణ యుగధర్మాన్నే పరాశరస్మృతి ప్రతిబింబించిందని చెప్పవచ్చు.

## 5. అసురత్రాత కైకసి కైసేత

విశ్రవసుని భార్య, రావణాసురుని తల్లి కైకసి. లోకంలో కుపుత్రులంటారు గాని కుమాతలుండరని సూక్తి. కాని కొడుకులను పరపీడన నిమిత్తమే తీర్చిదిద్దిన తల్లిగా కైకసి కనిపిస్తుంది.

కైకసి సుమాలి పుత్రిక. తండ్రితో అప్పుడప్పుడు రథం మీద తిరుగుతుండేది. పులస్త్య బ్రహ్మ కొడుకైన విశ్రవసుణ్ణి ఈమె కామించింది. ఆ విశ్రవసుడూ బ్రహ్మే. అతని వల్ల సంతానాన్ని పొంది రాక్షస జాతిని ఉద్ధరించవలసిందని తండ్రే ఈమెను విశ్రవసుని ఆశ్రమంలో వదలి వెళ్లిపోయాడు. బ్రాహ్మం-క్షాత్రం రెండూ కలసిన మహావీరుడు తనకు కొడుకు కావాలని కైకసి ఆశించింది.

విశ్రవసుని ఆశ్రమంలో సేవకు కుదిరి, ఒకానొక అసురసంధ్యా సమయంలో తన కోరిక వెలిబుచ్చింది. తాను పుత్రార్థినియై వచ్చానన్నది. నీకు కలిగే సంతానం రాక్షసులవుతారన్నాడు విశ్రవసుడు. ఆమెకూ కావల్సినదదే. ఆ కైకసికే విశ్రవసుని వల్ల రావణ-కుంభకర్ణ-విభీషణులు - శూర్పణఖ జన్మించారు. విశ్రవసునికి అది వరకే భార్య ఉన్నది. ఆమె పేరు కిలబిల. వీరి కొడుకే కుబేరుడు; అలకాధిపతి.

నిద్రపోయే కుంభకర్ణుణ్ణి, నీతిమంతుడైన విభీషణుణ్ణి కైకసి అంతగా పట్టించుకోలేదు. రావణుణ్ణి తపస్సుకు ప్రోత్సహించింది; వరాలు పొందమంది;రాక్షస జాతిని రక్షించుమంది.

మున్యాశ్రమాలపై దాడులు చేయించింది. హోమగుండాల్ని అపవిత్రం చేయించింది. రావణుని అహంకారానికి, ఆధిపత్య పోరాటానికి తల్లే కారకురాలు కావడం విశేషం.

తమ జాతి ప్రపంచంలో ఆధిపత్యం చలాయించాలని కైకసి తపన. ఇందుకొరకు రాక్షసుల్లో కొందరు గురువులు బయలుదేరి సలహాలిస్తుండేవారు. ఇకవారి అదుపాజ్ఞలను దాటి రావణుడు నిరంకుశంగా వ్యవహరించే విధంగా కూడా కొడుకును తయారు చేసింది తల్లి.

తన సవతి కొడుకు కుబేరుని దగ్గర పుష్పకవిమానం ఉన్నది. అది దివ్య విమానం. అందులో ఎందరు కూచున్నా మరొకరికి స్థానముంటుంది. అలాంటి విమనాన్ని లాక్కోవలసిందని కొడుకును ప్రేరేపించింది కైకసి. తల్లి ఆజ్ఞను అక్షరాలా అమలు జరిపిన రావణుడు కుబేరుని ధనాగారాన్ని దోచుకొన్నాడు; అంతటితో ఆగక కుబేరుని కొడుకు నలకూబరుని భార్య రంభపై అత్యాచారం చేశాడు. అప్పుడు ఆ రంభ ఇచ్చిన శాపమే రావణున్ని పట్టి కుడిపిందంటారు.

కైకసి లాంటి తల్లులు లోకంలో ఉంటే లోకమేమైపోతుంది. జాతి-సంస్కృతి-దేశ-ధర్మరక్షణల నిమిత్తం కొడుకులను తయారు చేయాలిగాని, భూముల్ని ఆక్రమించడానికి, దేవాలయాల్ని - ఆశ్రమాల్ని విధ్వంసం చేయడానికి, ఆస్తులను దోచుకోడానికి, అందరిపై అధికారం చలాయించడానికి కొడుకులకు శిక్షణనివ్వవచ్చునా! ప్రోత్సహించవచ్చునా!

ఆ తల్లి వ్యూహంలో విభీషణుడు చిక్కుకోలేదు. రావణ, కుంభకర్ణ, శూర్పణఖలు రాక్షసనీతి ఇదే అన్నట్టుగా వ్యవహరించారు.

దేవతలు, ఋషులు, మానవుల్లో కొందరు, రాక్షస జాతికి అపకారం చేశారని, అందువల్ల వారిని అణచివేయాలనీ, వారి ఆస్తులను లాక్కోవాలనీ, వారిపై అత్యాచారాలు చేయాలనే ప్రతి క్రియాత్మక సిద్ధాంతాన్ని కొడుకులకు నూరిపోసిందే గాని, రాక్షసజాతి సంరక్షణ నిమిత్తం భావనిష్ఠాత్మక తత్త్వాన్ని అందివ్వలేకపోయింది.

నీవు నడుస్తున్న దారితప్పన్న విశ్రవసువునే వదలి వేసింది కైకసి. "తెగినవాడికి తెడ్డే లింగం" అన్న సామెతగా ఉన్నది వ్యవహారం.

అయితే ఆమె ఆ యుగలక్షణానికి, స్త్రీ స్వేచ్ఛా చింతనానికి ప్రతీకగానే కనిపిస్తుంది. తాను నమ్మిన దారే సరైనదని, అదే పదిమంది దారి అని మొండిగా వాదించే వారిని ఎవరు చక్కదిద్దుతారు. ధర్మదేవత తనపని తాను చేసుకొంటూ పోతుంది.

ఒకతల్లి రావణుణ్ణి తయారుచేస్తే, మరో తల్లి రాముణ్ణి తయారు చేస్తుందంటాం! అంతే! కాని ఆ కుటుంబంలోనే మండోదరి ఉన్నది; సరమ ఉన్నది.

# 6. సత్య సౌందర్యమూర్తి సరమ

సరమ విభీషణుని భార్య. ఈమె తండ్రి శైలూషుడనే గంధర్వుడు. విభీషణునిలాగానే సరమ సాధుశీల, ఉత్తమురాలు.

రావణుడు తన మార్గం మార్చుకోడు. విభీషణుని హితవచనాలు చెవిని పెట్టడు. చివరకు విభీషణున్నే లంకనుండి పంపించి వేస్తాడు. ఆ సమయంలో సరమ మాత్రం లంకలోని తమ యింటిలోనే ఉంటుంది. అప్పుడప్పుడు వెళ్లి సీతకు ధైర్యం చెప్పి వస్తుంది.

రామరావణ యుద్ధం జరుగుతున్నది. అప్పుడైనా సీత మనస్సును విచలితం చేయాలని రావణుడు మాయోపాయం పన్నాడు. సీత ముందుకు కృత్రిమ రాముని తలతెచ్చి, నిద్రిస్తున్న రాముణ్ణి తన సైన్యాధిపతి ప్రహస్తుడు చంపివేశాడని తల చూపించాడు. సీత కంటికి మంటికి ఏకధారగా ఏడ్చింది. రావణా! నన్ను చంపెయ్ అని విచలితురాలైపోయింది. అయితే రావణుడింకా ఏమేమనేవాడో గాని అప్పుడే అశోకవనంలోకి వచ్చిన ఒక భటుడు రావణుని కొరకై ప్రహస్తాదులు నిరీక్షిస్తున్నారని చెప్పాడు. రావణుడు మాయాశిరస్సుతో పాటు వెళ్లిపోయాడు.

అప్పుడక్కడే చాటుగా ఉన్న విభీషణుని భార్య సరమ వెంటనే సీత దగ్గరికి వచ్చింది. రాముణ్ణి సంహరించే శక్తి రావణునికి లేదన్నది. ఈ శిరస్సు మాయా కల్పితమని వివరించి ఊరడించింది. ధీరచిత్తతను వదలరాదన్నది. ఇలా పొగడింది.

"రాముని సర్వశాస్త్రవవిరాముని సుందర నీల నీరద
శ్యాముని చంప నన్యులకు శక్యమె, భూతవిరోధి సంతతా
క్షేమకరుండయుక్తమతి కృత్యుడు మాయికుడైన రావణుండ
డీమెయి మాయపన్నె వినుమింతియె గాక నిజంబె మానినీ !"

*(గోపీనాథ రామాయణము, యుద్ధ - 536)*

శత్రు సంహారకుడైన రాముణ్ణి ఎవరు చంపుతారమ్మా. ఈ రావణాసురుడే సర్వప్రాణులకు శత్రువు; అకార్యాలు చేసే కపటి! అతని మాయ ఇది అని సరమ అన్నది.

విభీషణుడే గాక ఆయన భార్య సరమ కూడా సీతా పక్షపాతే. రావణుని ఇంటిలోనే అతణ్ణి వ్యతిరేకించే వారుండడం, వ్యతిరేకించి జీవించి ఉండడం మామూలు మాట కాదు. సరమలాగే త్రిజట కూడా సీతను ఇదే విధంగా ఊరడిస్తుంది. ఈమె విభీషణుని కూతురనే రామాయణమంటున్నది. రామాయణంలో త్రిజటా స్వప్నం చాలా ప్రసిద్ధమయిందే. రావణుడు నాశనమవుతాడు. రాముడు విజయం సాధిస్తాడు. మిమ్మల్ని అయోధ్యకు సగౌరవంగా తీసుకొని వెడతాడని త్రిజట స్వప్న వృత్తాంతం చెబుతుంది. శత్రుపక్షంలో ఉన్నా, నీతినీ,

ధర్మాన్ని, ఏనాడూ వదలని సత్య సౌందర్యమూర్తులుగా సాక్షాత్కరిస్తారు. సరమా త్రిజటలు.

## 7. జనరంజన అంజన

రామాయణ మహిళల్లో అంతగా ప్రాధాన్యం లేకున్నా ఆంజనేయుని తల్లి అంజనను గురించి ఒకటి రెండు విషయాలు ప్రత్యేకంగా చెప్పుకోవలసి ఉంది. అంజన కేసరిభార్య. కుంజరుడనే వానరుని కూతురు.

కేసరితో ఈమెకు వివాహం కాక పూర్వం, అడవిలో ఒంటరిగా ఉన్న అంజనను వాయువు మోహించాడు. అంజన తాను కన్యననీ, వివాహం కావలసిన దానినని చెప్పింది. వాయువు ఆమె కన్యాత్వం చెడదనీ, వివాహమూ జరుగుతుందని నమ్మబలికాడు. వారిరువురికి మహాబలవంతుడైన ఆంజనేయుడు జన్మించాడు.

ఇక్కడ వాయుదేవుని దివ్యశక్తి వల్ల ఆమె కన్యాత్వానికి భంగం కలుగలేదనే అలౌకికాంశాన్ని వదలి వేసి ఆలోచిద్దాం. అంజన గర్భవతి అయ్యింది; కుమారుణ్ణి కన్నది; వాయువు వెళ్లిపోయాడు. ఆ తర్వాత కుంజరుడు వనచరులలో అగ్రజుడైన కేసరికి అంజన నిచ్చి వివాహం చేశాడు. కేసరి ఆంజనేయుణ్ణి తన సొంతకొడుకుగానే పెంచాడు.

వాయువు నిరంతరం లోకకల్యాణం నిమిత్తం తిరిగే వ్యక్తి అనుకొందాం. అటువంటి వాణ్ణి ఒక దగ్గర కట్టివేసి సంసార బంధితుణ్ణి చేయడం అంజనా కుంజరులకు ఇష్టం లేదని గ్రహించాలి. అంజనా వాయువులది గాంధర్వ వివాహంగా భావించాలి. అంజనా కేసరులది పెద్దలు కుదిర్చిన పెళ్లిగా అర్థం చేసుకోవాలి.

భర్త అందనంత దూర దేశం వెళ్లి పోయినట్లయితే మళ్లీ వివాహం చేసుకోవచ్చునని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. ఆ పద్ధతికే ఒడంబడింది అంజన. వివాహ విషయంలో సంతానం విషయంలో రామాయణ మహిళ కింత స్వేచ్ఛ ఉన్నది. ఒకటి రెండు వివాహాలు జరిగినా, గార్హస్థ్య కుటుంబ జీవితాన్ని అభిలషించడమే ఆనాటి మహిళ ప్రత్యేకతగా చెప్పుకోవాలి.

ఇక మాతృమూర్తిగా ఆంజనేయుణ్ణి ఆమె పెంచిన తీరులోని వైశిష్ట్యం అంతా ఆంజనేయుని ధర్మరక్షణా దీక్షలోనే కనిపిస్తుంది. జీవితాంతం జనరంజనానికే పనిచేసిన మహా బలశాలిగా ఆంజనేయుడు నిర్మాణం కావడంలో అంజన పెంపకాన్ని ఆదర్శంగా గుర్తుంచుకోవలసి ఉంది.

## 8. కౌశలపూర్ణ కౌసల్య

"కౌసల్యా సుప్రజా రామ!" అనే వాల్మీకి శ్లోకాన్ని సుప్రభాతంలో ఎప్పుడూ వింటుంటాం!

కౌసల్య పుత్రుడవైన రామచంద్రా అని ఆ మాటలకర్థం. ధర్మవిగ్రహమూర్తి అయిన రాముణ్ణి కన్నతల్లి ఆమె. దశరథుని భార్య కోసలదేశ ప్రభువు భానుమంతుని కూతురు.

కౌసల్యా దశరథులది ప్రేమ వివాహమే. వివాహానికి వస్తున్న దశరథుడు. నదీ ప్రవాహంలో కొట్టుకుపోయి కౌసల్యను కలుసుకొంటాడు. వివాహానంతరం పుత్రకామేష్టి వల్ల ఆమెకు రాముడు జన్మిస్తాడు. రాముణ్ణి అల్లారుముద్దుగా పెంచడమే గాక, వసిష్ఠుని వల్ల అన్ని విద్యలు నేర్పించింది కౌసల్య.

సీతతో పుత్రుని కల్యాణానికి సంతోషించింది. కాని పట్టభంగానికి చింతించింది. అయినా ఒక్కమాట కైకను అనలేదు. కాని దశరథుని మరణం తర్వాత కైకను గట్టిగానే నిందించింది కౌసల్య. తన పుత్రుని దురదృష్టానికి విలపించింది. ఎప్పుడూ సీతా రాముల అభ్యుదయాన్నే ఆకాంక్షించింది. అరణ్యంలోని వారిని గూర్చి, సీతాపహరణం గూర్చి ఎప్పటికప్పుడు తెలుసుకొంటూనే ఉన్నది.

సీతారాముల పట్టాభిషేక పర్యంతం, కౌసల్య వారి యోగక్షేమాల మీదనే దృష్టి నిలిపింది. కౌసల్య భావాలతో తన భావాలు పంచుకొంటూ, ఆమె వేదనలో తానూ భాగస్వామి అవుతూ ఎప్పుడూ నీడలా తోడు ఉన్నది సుమిత్ర.

శ్రీరాముని అశ్వమేధం వరకు జీవించిన పూర్ణాయుష్క కౌసల్య. ఎన్ని కష్టాలుపడ్డా, ఎన్ని చింతలున్నా పుత్రుని విజయం మీదనే, అభ్యుదయం మీదనే ఆమె దృష్టి ఉన్నది. కొడుకుకూ కోడలుకూ ప్రమాదం అని తెలిస్తే చాలు. విచలిత అయ్యే కౌసల్య అప్పటికప్పుడే స్థితప్రజ్ఞగా మారిపోవడమూ చూస్తాం. భావోద్రేకాల కన్నా, భావశాంతికే అంకితమై జీవనం గడిపిన కౌశలపూర్ణ కౌసల్య.

## 9. ఫలితపర్ణ శబరి

శ్రీరాముడరణ్యవాసంలో ఉన్నాడు; తమ్ముడు తాను సీతాన్వేషణలో ఉన్నారు. పంపాతీరంలోని గురువుల ఆశ్రమంలో ఆయన కొరకు ఎదురు చూస్తున్న శతవృద్ధ శబరిని పరమ నిగ్రహంతో శ్రీరాముడు చూశాడు. అంతవరకు అన్వేషణలో ఉన్న ఉద్విగ్నత లేదు. జన్మజన్మాలుగా ఆమెను చూడాలనే ఆ ప్రభువు దీక్షతో అక్కడికి వచ్చినట్లున్నారు.

ఆ శబరి మతంగ మహాముని శిష్యురాలు. గురువులు దేహాన్ని వదలి వెళ్లారు. రామదర్శనానంతరం గురువుల సన్నిధికి చేరాలనే ఆమె అక్కడ ఎదురు చూస్తున్నది.

ఆ ఆశ్రమానికి రాముడు వస్తాడు. ఆయనకు ఆతిథ్యమివ్వాలని పండ్లను రుచిచూచి మంచివేవో, తీయటివి కండగలవి ఏవో అవి దాచి పెట్టింది. ఆమె చేతి మాహాత్మ్యమో, లేదా శీతల సురక్షిత స్థలంలో పెట్టడం వల్లనో అవి రాముడు వచ్చే వరకు నిత్యనూతనంగా

ఉన్నాయి. పళ్లను రామునికి నైవేద్యంగా సమర్పించి, తన జీవనఫలాన్నే ప్రభువుకు అర్పించినంతగా ఆనందించింది. ఆమె గురువుల దీవెన ఫలించింది.

"ఆగమిష్యతితే రామస్సుపుణ్యామిమ మాశ్రమమ్ ।
సతే ప్రతిగృహీతవ్య సౌమిత్రి సహితోఽతిథి: ॥
తంచ దృష్ట్వా వరాన్లోకానక్షయ్యాంస్త్వం గమిష్యసి ॥

*(వాల్మీకి రామాయణం, అరణ్య, 15-16)*

ఈ పవిత్రాశ్రమానికి రాముడు వస్తాడు. సౌమిత్రితో కలిసి ఉన్నా రాముణ్ణి అతిథిగా ఆదరించు. దీనివల్ల నీకు శాశ్వత ఉత్తమలోకాలు ప్రాప్తిస్తాయి. ఇదీ గురువుల దీవెన. తాము ఆశించక తమ శిష్యురాలికిది జరుగుతుందని ఉపదేశించడం ఆ పరిపూర్ణ ఫలితజ్ఞానిని వారు గుర్తించడమే అనాలి.

శబరి శరీరమున్నది; శరీరంలో జీవుడున్నాడు. ఆ జీవుని తపన శ్రీరామదర్శనం. దర్శనం జరిగింది. జీవితానికి పూర్ణత్వం సిద్ధించింది. జీవాత్మ విశ్వాత్మలో కలిసిపోయింది. పండుటాకు నేలరాలిపోయింది. ఇప్పుడు దేహంతో ఉన్న బంధం పోయి విశ్వంతో బంధమేర్పడింది. "విశ్వం" శ్రీ విష్ణు సహస్రనామాలలోని మొదటి నామం.

ఆ శబరి పరమ భక్తురాలు; ఆమెబోయ కాని మరెవరైనా కాని పరిపూర్ణ జీవనాన్ని పరమానందంగా అనుభవించి పునర్జన్మ రహిత పదవికి చేరిన ఆత్మజ్ఞాని.

ఆమె ఆనాటి మహిళల్లో మణి. లోకం కొరకు ఉపాధి (దేహంలో)లో కొంతకాలం ఉంది అంతే! అలాంటి తపస్వినులైన భక్తుల ముంగిటికి విశ్వాత్మే నడచి వస్తుంది. లక్ష్మణ సమేతుడైన రాముడక్కడికి రావడంలో ఉన్న తాత్త్వికార్థమిదే.

సత్సంగత్వం నుండి నిస్సంగత్వానికి, నిస్సంగత్వం నుండి నిర్మోహత్వానికి, నిర్మోహత్వం నుండి నిశ్చలతత్త్వానికి, నిశ్చలతత్త్వం నుండి జీవన్ముక్తికి చేరుకొన్నది శబరిమాత. అలాంటి పరిపూర్ణ జ్ఞానులున్న ఆకాలంలోనే దేహాభిమానమున్న శూర్పణఖలూ ఉన్నారు.

## 10. విషాగ్ని వృక్షం శూర్పణఖ

రావణుని తల్లిదండ్రులు కైకసీ విశ్రవసువులు. వారి చివరి కూతురే శూర్పణఖ అని, అలాకాక విశ్రవసునికి మరో భార్యకు జన్మించిన ఖరాదుల చెల్లెలు శూర్పణఖ అని తల్లి విషయంలో కొద్ది వైరుధ్యం వినిపిస్తున్నది. ఎలాగైతే నేమి ఆమె రావణుని చెల్లెలు. ఈమె భర్త విద్యుజ్జిహ్వుడు.

రావణుడు కాలకేయులపైకి యుద్ధానికి వెళ్లాడు. అక్కడ పొరపాటున తన వెంబడి

వచ్చిన తన బావమరిది అయిన విద్యుజ్జిహ్వుణ్ణి రావణుడు సంహరించాడు. జరిగిన పొరపాటుకు దుఃఖిస్తున్న చెల్లెలిని ఓదార్చి, దండకారణ్యంలో ఉన్న ఖరదూషణాదుల దగ్గర ఉండి శేష జీవితాన్ని ప్రశాంతంగా గడపవలసిందని బోధ చేస్తాడు. అన్నమాటను పాటించి అప్పటి నుండి ఆమె దండకారణ్యంలో తన కొడుకు జంబు కుమారుణ్ణి పెంచుకొంటూ ఉంటుంది. ఈ జంబుకుమారుడు లక్ష్మణుని చేతిలో మరణిస్తాడు.

లక్ష్మణుడు పర్ణశాల నిమిత్తం పొదలు నరుకుతుంటాడు. అందులో ఉన్న జంబు కుమారునికి కత్తి తగులుతుంది. లక్ష్మణుని అజాగ్రత్త వల్ల, నిష్కారణంగా శూర్పణఖ కుమారుడు చనిపోయాడు.

ఈ సంగతి శూర్పణఖకు తెలుస్తుంది. అడవిలోకి వచ్చి బ్రతుకుతున్న ఒక నరుని చేతిలో తన కొడుకు చనిపోవడమా! ఆ నరుణ్ణి ఇప్పుడే పట్టి మ్రింగుతానని పంతంతో వచ్చిన శూర్పణఖ రామలక్ష్మణులను చూస్తుంది. ఆమె కళ్లు తిరిగిపోతాయి. ఈ ఇద్దరు పురషులదేమి సౌందర్యం. ఆ రాముడు మరీ అందంగా ఉన్నాడు. అతడు తన భర్తయితే. ఒక్కసారిగా కామాగ్నితో భగభగమండిపోతుంది. తనను తాను తమాయించుకొని అందంగా అలంకరించుకొని భౌతిక వాంఛా పరితృప్తి నిమిత్తం రాముని దరిచేరి మనసులోని మాట అతని ముందు పెడుతుంది.

ఒళ్లంతా ఒంపులతో, హావభావ విలాసాలతో తన ముందేవో నటనలు చేసి తననలా అడగడం పరిహాసం క్రింద కొట్టిపారవేసి, తనకు భార్య ఉందని లక్ష్మణుణ్ణి అడుగుమంటాడు రామచంద్రుడు. శూర్పణఖ లక్ష్మణుని దగ్గరికి వెళ్లి తన కోరిక వెలిబుచ్చుతుంది. లక్ష్మణుడు నిరాకరిస్తాడు.

అప్పుడామె సీతవైపు చూస్తుంది. ఆమెను చంపివేస్తే రామలక్ష్మణులు తనను దగ్గరికి తీసుకొంటారని భావిస్తుంది. ఆ ఆలోచన వచ్చిన వెంటనే సీత మీద దాడి చేస్తుంది. అప్పుడు శూర్పణఖను కత్తితో అడ్డుకొని, ఆమెను పట్టుకొని నీకిదే శిక్ష అంటూ ముక్కు చెవులు కోసి వదలి పెడతాడు.

కొడుకు పోయాడు; కోరిక తీరలేదు; ముక్కు చెవులుపోయినై. పుత్ర మరణశోకం, పగ, కామోద్భవక్రోధం, పరాభవం..... పరాభవం.... ఖరదూషణ త్రిశిరులకు తన అవమానం తెలిపింది. వారందరూ శ్రీరాముణ్ణి ఎదిరించి మరణించారు.

శూర్పణఖ రావణునికి తన దుస్థితి తెలిపింది. సీత జగదేకసుందరి అని వర్ణించింది; నీ అంతఃపురంలో ఉండదగిన ఆమె అడవిలో నరుల దగ్గర ఉండడమేమిటి అని రెచ్చగొట్టింది. రావణుని చేత సీతాపహరణం చేయించింది శూర్పణఖే.

అలాంటి శూర్పణఖ ఆ తర్వాత ఏమయ్యింది. ఏమయ్యింది! రామ రావణ యుద్ధంలో మరణించింది.... అనుకోవాలి.

పురుషరూపి రావణుడనాలి శూర్పణఖను. ఆత్మమీదనే దృష్టి ఉన్న శబరి ఎక్కడా! దేహం మీదనే దృష్టి ఉన్న శూర్పణఖ ఎక్కడా! భిన్న ధ్రువాలు. పరధనాపహరణం, పరదారాపహరణం, స్వాంతస్సుఖమే జీవితమనుకొనే వారు ఎన్ని అనార్థాలు తెచ్చిపెడతారో! అందుకుదాహరణం శూర్పణఖా రావణులే.

వ్యక్తిగత ద్వేషంతో దేశానికే చిచ్చుపెట్టిన మనిషి చుప్పనాతి. స్త్రీ నాసికా ఖండ...ం తప్పని కొందరు వాదిస్తారు. అందుకే "కోసిన ముక్కే చూశారుగాని చేసిన చేష్టలు చూడలే"ఉన్న సామెత పుట్టింది.

ఒకవైపు నుండి చూస్తే శూర్పణఖ జీవితం చాలా దయనీయంగా కనిపిస్తుంది. అన్న చేతిలో భర్తపోయాడు; ఓ నరుని చేతిలో కొడుకు పోయాడు. రెండు పొరపాటున్నే జరిగాయి. ఇద్దరూ తమ తప్పు ఒప్పుకొంటున్నారు. భర్తను చంపిన మహాబలశాలి అయిన రావణుని మీద ఎటువంటి ఆగ్రహం లేదు. కొడుకును చంపిన న...ని మీద తీవ్రాగ్రహం కలిగింది. కాని వారి భౌతిక సౌందర్యంతో ఆగ్రహం గాలికి కొట్టుకుపోయిం...వి. వాంఛాపరితృప్తి నిమిత్తం తహతహలాడిన మనస్సు దేహాన్ని కుతకుత ఉడికించింది. కాని మానసికా ఘాతంతో పాటు చిరకాలం నిలిచే మచ్చ శరీరం మీద నిలి...పోయింది. తీవ్ర పరాభవం.

ఈ పరాభవాగ్నిలో తన భర్తను చంపిన అన్నను రెచ్చగొట్టింది; అన్నకూడా శత్రువే! అందుకే అతణ్ణి ముగ్గులోకి ... అతని నాశనానికే కారకురాలయ్యింది. అన్నలోని స్త్రీ గత బలహీనతను ఆ విధంగా ఉపయోగించుకొని అతని అంతానికే కారకురాలయ్యింది.

ఇద్దరూ శత్రువులే చావనీ అనుకొన్నదేమో! అయితే శూర్పణఖ వెనుకా ముందేమీ చూడలేదు. అనుకొన్నది ఆచరిస్తూ వెళ్లింది. తనకు హాని కలిగించిన వారికి హాని కలిగించా...ని జీవించింది; అందులో కొంత సాఫల్యాన్ని పొందింద...ని చెప్పాలి. అందుకే ఆమె విషాగ్ని వృక్షం; తాను కాలుతుంది; మరొకరిని కాలుస్తుంది.

## 11. యోగిని ఊర్మిళ

రామాయణంలో మరపురాని మహోన్నత మహిళామూర్తి ఊర్మిళాదేవి. లోకానికి ఆమె నిద్ర గురించే తెలుసు; ఇంకేం తెలియదు.

ఈమె లక్ష్మణుని భార్య; జనకమహారాజు తమ్ముని కూతురు. సీతారాముల కల్యాణంతో పాటు ఊర్మిళా లక్ష్మణుల వివాహమూ జరిగింది.

పితృవాక్య పరిపాలన నిమిత్తం రాముడడవికి వెడతానన్నాడు. సీత తానూ వస్తానన్నది.

అరణ్యాలలో కష్టాలకు సంబంధించిన అంశాలు ఏకరువు పెట్టినా రాముడర్ధాంగి మాటకాదనలేదు.

లక్ష్మణుడూ సీతారాముల వెంబడి వనవాసానికి సిద్ధమయ్యాడు. ఊర్మిళా అడిగి ఉంటుంది. కాని లక్ష్మణుడు తాను సీతారాముల సేవార్థమే - రక్షణార్థమే ఈ నిర్ణయం తీసుకొన్నానని అంటాడు. అందుకే పదునాల్గు సంవత్సరాలు ఒక తపస్సులాగా నిద్రాయోగంలో ఉన్నది ఊర్మిళ.

భర్తమాటను జవదాటక పదునాలుగేళ్లు అయోధ్యలోనే ఉన్నది. పడుకున్న పక్కను వదలక పడుకుంది అంటారు. కైక అడిగిన వరాల మిషతో దుష్టశిక్షణార్థం శిష్ట రక్షణార్థం రాముడు అడవిదారి పట్టాడు. సీత ఆయన్ను అనుసరించింది. కార్యసాధకుడు లక్ష్మణుడు వారికి తోడు. అలా భర్తను త్యాగం చేసిన (సేవార్థం అర్పించిన) ఊర్మిళ పరువంలోని ప్రణాయోపాసనను ప్రణవోపాసన వైపు మరల్చింది. నిద్రాయోగ ముద్రితురాలయింది.

"ఓ పురుషులారా! కర్తవ్య నిష్ఠా పరాయణులైన మీరు మీ భార్యలకు దూరంగా ఉండవచ్చు. అలాంటి సందర్భాల్లో బలీయమైన ఇంద్రియ శక్తికి బానిసలు కాకండి! జీవితంలోని అమూల్యమైన విలువల్ని పోగొట్టుకోకండి! కార్యభారం తీరాక మీరు మీ భార్యల్ని కలుసుకొన్నాకనే జీవన సౌఖ్యాల్ని అనుభవించండి!" - ఇదే లక్ష్మణుడు ఈ హిందూ సమాజంలోని పురుషులకిచ్చిన సందేశం.

"ఓ మహిళా మణులారా! భర్త కార్యభారం మీద దూరదేశం వెడతారు. ఆ సమయంలో ఇంద్రియ లౌల్యానికి చిత్తచాంచల్యానికి గురికాక నిగ్రహంతో మెలగండి...." ఇదే హైందవాంగనలకు ఊర్మిళాదేవి అందించిన సందేశం.

స్వాతంత్ర్యోద్యమంలో సావర్కర్ లాంటి స్వాతంత్ర్య వీరులు ఏండ్లూ-పూండ్లూ చెరసాలలో మ్రగ్గుతున్నప్పుడు వారి ధర్మపత్నులు దేశమాతను నిత్యం పూజిస్తూనే గడిపారు. స్వాతంత్ర్య దేవతనే పరమగమ్యంగా ఎంచుకొన్న మహిళలు కష్టాలన్నీ చిరునవ్వుతో స్వీకరించారు.

ఊర్మిళాదేవి నిద్రాయోగం ఒకధ్యానం - ఒకతపస్సు. అందుకే ఆమెను తపస్విని అనడం - యోగిని అనడం.

పదునాలుగు సం॥ల తర్వాత కనిపించిన భర్త లక్ష్మణస్వామిని ఊర్మిళ గుర్తించలేదు. సీత వచ్చి పరిచయం చేసిందని కథనం. సుమిత్రా కౌసల్యలు ఊర్మిళా [illegible]ుల సాన్నిహిత్యానికి దోహదం చేశారు.

అలా ఆమె యోగం, ఆమె తపస్సు ఫలించింది. ఆమెకు అంగదుడు, చంద్రకేతువు అని ఇద్దరు కొడుకులు కలిగారు. సోమదా గంధర్వి అనే కూతురుపుట్టింది. లవకుశులతో

పాటు ఊర్మిళా లక్ష్మణుల సంతానం కూడా కొన్ని ప్రాంతాలపై ప్రభుత్వం నెరపినట్లు రామాయణ కథనం.

శరీరంలోని సర్వాంగాలు తమ తమ పరిధిలో సేవ చేసినట్లే, సృష్టి జీవయంత్రంలోని చైతన్యాంగాలైన స్త్రీ పురుషులు ఎవరి కర్తవ్యాన్ని వారు నిర్వర్తిస్తున్నారు. తరువాతి తరాల వారికి ప్రేరణ నిస్తున్నారు. ఆ విధంగా మహిళా మణుల్లో మణిపూసై, ప్రేరణ నిచ్చి శక్తి ప్రదానం చేసిన మహాసాధ్వి లోకైక మాత సీత. ఆ సీత కథ చెప్పుకొందాం.

## 12. పరమపునీత లోకమాత సీత

"సీత కష్టాలు సీతవి పీత కష్టాలు పీతవి; సీత చెర, సీతమ్మతల్లి, సీతాదేవి, సీతారాముల్లా ఉన్నారు, సీతాఫలం, సీతమ్మగెల, సీత ఉంటే సిరి ఉంది, సిరిమల్లె సెట్టు కింద సీతమ్మ....'

ఇలా సీతపేరు జనంలో వాడుక. సీతలోకమాత, వేదమాత, గంగామాత, భూపుత్రి, అగ్నిదేవత...... ఇటువంటి ఆరాధనాభావం ఉంది.

మరి అలాంటి సీత అయోధ్య రాముని భార్య; మిథిల జనకుని పుత్రిక. సీత పుట్టినా నాగేటి చాలులో దొరికినా ఆమె మహావేదాంతి జనకుని పుత్రిక. అక్కడే పెరిగింది. సర్వ విద్యలూ నేర్చుకొంది. ఆటపాటల్లో అలవోకగా శివధనుస్సునే ఎత్తి మూలకు పెట్టింది. శ్రీలక్ష్మి కళతో జనకునింట నవరత్నాలు కురిపించింది; నవనందనాలు పండించింది.

అటువంటి సీతకు స్వయంవరం. శివుని విల్లెత్తిన శ్రీరామునితో సీత వివాహంజరిగింది. ఆమెతో పాటే ఆమె వరుస చెల్లెండ్రు ఊర్మిళా, మాండవీ, శ్రుతకీర్తులకు లక్ష్మణ భరత శత్రుఘ్నులతో వివాహాలు జరిగినై.

కల్యాణానంతరం సీత అయోధ్యకు వచ్చింది. శ్రీరాముని పట్టాభిషేకం సంగతి తెలిసి ఆనందించింది. కైక వరాలకు కట్టువడి పితృవాక్య పరిపాలన నిమిత్తం రాముడు అరణ్యాలకు వెళ్లడానికి సంసిద్ధమవుతుంటే భర్తతోడిదే లోకం - అందువల్ల తానూ అతని వెంబడి వస్తానన్నది.

"నేను మీ భార్యను. ఎప్పుడూ మీవెంటే ఉండాలి. మీరు లేకుండా నేనీ అయోధ్యలో ఉండను. మీరు వదలి పెట్టిపోతే నేను జీవించను. ఇదే ధర్మం. మీరు దగ్గరుంటే నావైపెవ్వరూ కన్నెత్తి చూడలేరు.

దైవజ్ఞులు నా జాతకం చూచి నాకు వనవాస ప్రాప్తి ఉందన్నారు. నాకూ ఆ కోరికే ఉంది. వనవాసం కష్టమని నాకు తెలుసు. కానీ నియతాత్ములను ఏ కష్టాలూ ఏమి చేయలేవు. పైగా మీ సుఖదుఃఖాల్లో నేను భాగం పంచుకోవాలి. అందుకే నన్ను మీ వెంట తీసుకొని పోవాలి.

మీరు ఒప్పుకోకపోతే నేను బ్రతకను. విషం త్రాగుతా. నిప్పుపెట్టుకొంటా. నీళ్లలో దూకుతా."

ఇంతగా అడిగినా రాముడు వినలేదు. మళ్లీ ఇలా అన్నది.

"మీకు సౌందర్యం ఉంది. పౌరుషం లేదు. నన్ను పోషించలేక వదలిపెట్టిపోయారని మానాన్నగారికి తెలుస్తుంది. పురుషవేషంలో ఉన్న స్త్రీ అని తెలియక పిల్లనిచ్చి పెళ్లి చేశానే అని ఆయన కుమిలిపోతాడు.

ఎప్పుడూ మీతో ఉండి సేవ చేయడమే నా ధర్మం. మీరెక్కడ ఉంటే అక్కడే ఉంటా. అరణ్యమే నాకు ఉద్యానవనమవుతుంది.

అడవిలో నా వల్ల మీకే కష్టం కలుగదు. నేను మీకు బరువుగా ఉండను. మీతో ఉండడమే నాకు స్వర్గం. మీరు లేకుండా నేనెక్కడ ఉన్నా అది నరకం. మీరు తీసుకొని పోకపోతే నేను చచ్చిపోతా."

అప్పుడామె అన్నమాటల్లో కొన్నే ఇవి. అన్నం అంతా పట్టి చూడాలా! సీత వ్యక్తిత్వానికీ మాటలు పరమ దర్పణాలు.

నారచీరలు ధరించి సీతారామలక్ష్మణులు అడవికి వెళ్లారు. అనుసరించే వారినందరిని వెనక్కు పంపారు. ఆ తర్వాత వారు దండకారణ్యానికి వచ్చారు. నారచీరలు ధరించినా రామలక్ష్మణులు ధనుర్ధారులే అయినందువల్ల, వారిని తమ రక్షకులుగా భావించి రాక్షసుల బాధ నుండి తమను రక్షించాల్సిందిగా సుతీక్ష్ణాది మునులు కోరారు. రాముడు సరే అన్నాడు.

ఆయుధాలు ధరించడం వల్ల హింసా ప్రవృత్తి పెరుగుతుందని, తన దగ్గర ఇంద్రుడు న్యాసంగా పెట్టి వెళ్లిన ఖడ్గం కారణంగా ఓ ముని హింసావాది అయ్యాడని, అకారణవైరం మనకెందుకుని, అరణ్యంలో ఉన్నంత కాలం మనం ముని జీవితం అవలంబిద్దామని సీతాదేవి అనేక హిత వాక్యాలు పలికింది. అందులో ఒకటి రెండిలా ఉన్నాయి.

"మీరు ధనుర్ధారులు. ఋషులకు మాట ఇచ్చారు. మీరు పరాక్రమ వ్యామోహంలో పడ్డారు. దండకలోకి వెడుతున్నారు. ఇక రాక్షసుల మీద బాణాలు వదలుతారు. నాకిది ఇష్టం లేదు. ఆయుధం రౌద్రాన్ని పెంచుతుంది. అపరాధం చేయని రాక్షసులను అకారణంగా ఎందుకు చంపాలి.

అడవిలో ఆపన్నులను కాపాడాలి. నిజమే. కాని మన మిప్పుడు తాపసులం. రక్షణ కార్యం పరిపాలకునిది. ఇప్పుడు మనకాయుధాలు అక్కరలేదు. మళ్లీ అయోధ్యకు వెళ్లినప్పుడు ధరించవచ్చు. రాజ్యం వదలుకొన్నవారు ఋషులుగా ఉండాలనేదే అత్తగారి (కైక) ఆకాంక్ష.

ధర్మంవల్ల అర్థం, సుఖం సమకూరుతాయి. ఈ ప్రపంచానికి ధర్మమే మూలం. అందువల్ల సమర్థులు అనేక నియమాలు పాటించాలి. వ్రతోపవాసాదులతో శరీరాన్ని కృశింపజేయాలి. అలా ధర్మం సంపాదించుకోవాలి."

అప్పుడు సీత ప్రాజ్ఞతకు రాముడు సంతోషించాడు. దండకారణ్యంలో రాక్షసులు నరమాంసభక్షకులై ఎందరినో సంహరించారనీ, వారి ఎముకల ప్రోవులు ఎక్కడపడితే అక్కడ ఉన్నాయనీ, అందువల్లనే మునులందరూ తమను రక్షించవలసిందని కోరారనీ, అందుకే ఈ ధర్మ రక్షాయోగం చేపట్టానని సీతను ఒప్పించాడు శ్రీరాముడు.

ఇంత ధర్మం తెలిసిన సీత మాయలేడిని చూచి భ్రమసింది. రాముని రక్షణకు వెళ్లవలసిందని లక్ష్మణుణ్ణి నిందించింది. రావణుడు అపహరించడానికి వచ్చినప్పుడు అతనికి బుద్ధి చెప్పింది. వాదోపవాదాలు జరిగినై. నీవు నీ వంశం నాశనమవుతుందన్నది. పరదారాభిగమనం - అపహరణం ధర్మం కాదన్నది. అయినా రావణుడు వినలేదు. సీత వెంట్రుకలు పట్టి, మాయారథమెక్కి ఆకాశగమనుడై వెళ్లిపోయాడు. సీత విలపించింది. ఋష్యమూకంపై తన ఆభరణాల మూట వదలివేసింది. నిస్సహాయయై రావణుని లంక చేరింది. వ్రతనిష్ఠాపరురాలై అశోకవనంలో ఉంటున్నది. అలా ఎనిమిది మాసాలు అశోకవనంలో సీత ఉండాల్సి వచ్చింది. ఈ మధ్యకాలంలో సీతాన్వేషణ ప్రారంభమయ్యింది. సుగ్రీవాంజనేయాదులు రామునికండదండగా నిలిచారు. ఆంజనేయుడు వచ్చాడు; తోకచిచ్చుతో లంకకే చిచ్చుపెట్టాడు.

ఆంజనేయుడు సీతమ్మవారిని తన వెంటనే తీసుకొని వెడతానన్నాడు. సీత అంగీకరించలేదు. శ్రీరాముడు రావాలి. రావణుణ్ణి శిక్షించాలి. అప్పుడే తాను అతని వెంట వస్తానన్నది.

ఈ మధ్యకాలంలో రావణుడు అనేక పర్యాయాలు సీతను తన దారిలోకి తెచ్చుకోవాలని ప్రయత్నించాడు. నయానా భయానా చెప్పి చూశాడు. రాక్షస స్త్రీలతో హింసింపజేశాడు. అయినా సీత తొణకలేదు - బెణకలేదు. ఆమె తన దీక్షను వదలలేదు.

రావణుణ్ణి తృణ సదృశంగా చూచింది. అతని ప్రశ్నలకు గడ్డిపరకకే సమాధానమిచ్చింది.

"ఓరి రాక్షసా! పాపిష్టివాడు స్వర్గాన్ని కోరినట్లు నీవు నన్ను కోరి ప్రయోజనం లేదు. నేను పతివ్రతను. నీవు నీ భార్యలను కాపాడుకొన్నట్టే మిగతావారు వారి భార్యలను కాపాడుకొంటారు. పరదారల వెంబడి పడేవాడు పరాభవాలపాలవుతాడు.

నీ పాపకార్యాల వల్ల ఈ లంకారాజ్యం నాశనమైపోతుంది గుర్తుంచుకో! ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకొని నన్ను ఆ శ్రీరామ ప్రభువుకు అప్పగించు. దానివల్ల నీకూ నీ వంశానికి మేలు కలుగుతుంది.

నన్ను అప్పగించకపోతే నీకు చావు తప్పదు. జనస్థానంలో ఖరదూషణ త్రిశరుల నందరిని ఒక్కడే సంహరించాడన్న సంగతి మరిచిపోయావా!

నీకు చేటుకాలం వచ్చింది. ఇక నీవు ఎక్కడికి వెళ్లిదాక్కున్నా శ్రీరాముని బాణాల నుండి తప్పించుకోలేవు.''

రావణుడీ మాటలేవీ వినలేదు. తాను చచ్చాడు. లెక్కలేనంత మంది చావుకు కారకుడయ్యాడు. యుద్ధంలో విజయానికి సంబంధించిన విశేషాలన్నీ సీతకు హనుమంతుడే చెప్పాడు. అప్పుడే సీతకు కావలిగా ఉన్నా రాక్షస స్త్రీలను హనుమంతుడు చంపాలనుకొంటాడు. సీత వారిస్తుంది.

విభీషణుడు సీతాదేవిని రాముని కర్పించాడు. రాముడు సీతాదేవితో పరుషంగా మాటాడాడు. 'నేను నిన్ను అనుమానిస్తున్నాను. నీ ఇష్టం వచ్చిన చోటికి పో' అన్నాడు. అప్పుడు సీత ''మీరు కోపంలో ఉండి అల్పునిలాగా స్త్రీత్వాన్ని పురస్కరించుకొని మాటాడుతు' 'న్నారన్నది. 'నా గురించి మీకే తెలియకపోతే మరెవరికీ తెలియదన్నది. లక్ష్మణుని చితిపేర్చుమన్నది. ఆ లంకలోనే అందరి ముందు అగ్నిప్రవేశం చేసింది. అప్పుడూ అన్నది.

''ఓ అగ్నిహోత్రా! నీవులోక సాక్షివి. నా మనస్సెప్పుడూ నా భర్తపైననే నిలిచి ఉన్నది. అన్యత్ర చలించలేదు. ఇది వాస్తవమయినట్లయితే నీవు నన్ను అన్ని విధాలా రక్షించు.

ఓ లోకసాక్షీ! నా ప్రవర్తనం పరిశుద్ధమైనదైనట్లయితే ఆ రామరాజు నా గురించి అనుకొంటున్న దోషం నాలో లేక పోయినట్లయితే నన్ను అన్ని విధాలా రక్షించు.

మనసా వాచాకర్మణా నేను ఆ సర్వధర్మజ్ఞుణ్ణి, ఆ రామ ప్రభువును అతిక్రమించకుండా ఉన్నట్లయితే ఓ అగ్నిహోత్రా! నన్ను అన్ని విధాలా రక్షించు.

సూర్యచంద్ర వాయువులూ, దశదిశలూ, అహోరాత్రాలూ, ప్రాతస్సాయం సంధ్యలూ, ఈ పృథివీ నేను పతివ్రతను అని నమ్మేట్లయితే ఓ అగ్నిహోత్రుడా! నన్ను అన్ని విధాలా రక్షించు''...

– అలా అని సీతాదేవి అగ్నిలో దూకింది. లోకాలాకులితమైనై. సీత గురించి తెలిసి ఉండి రాముడిలా ఎందుకు చూస్తూ చూస్తూ ఊరుకొన్నాడని దశదిశల్లో దేవతల మాటలు వినిపించినై. సత్యమేమిటో బ్రహ్మనోట ఈ లోకానికి తెలియాలి, నాకు కాదు అన్నాడు రాముడు. బ్రహ్మ నీవు శ్రీమన్నారాయణ మూర్తివయ్యా అన్నాడు. సీత పరిశుద్ధ అన్నాడు. అప్పుడు అగ్ని సీతను శ్రీరాముని కప్పగించాడు. ఆ తర్వాత పుష్పకం మీద అయోధ్యకు చేరారు. సీతారాముల పట్టాభిషేకం జరిగింది.

సీత ఇప్పుడు గర్భవతి. సీత గర్భరక్షణ నియమాలు పాటిస్తున్నది. కష్టాల కాలం

గడచింది. ఇక సుఖాలే ఉంటాయనుకొన్న తరుణంలో భద్రుడు తెచ్చిన వార్త రామునిలో కలకలాన్నిరేపింది. "ఎవడో ఎత్తుకుపోయిన భార్యను రాముడు తీసుకొని వచ్చి ఏలుకోవలసింది కా"దని ఎవరో అన్నారు.

రాముడీవిషయం తమ్ముళ్లకు చెప్పి, లక్ష్మణుణ్ణి పిలచి నిండుచూలాలైన సీతను వాల్మీకుల ఆశ్రమంచెంత వదలి రమ్మన్నాడు. సీతకు రాముడు తనను పూర్తిగా పరిత్యజిస్తున్నాడన్న సంగతి తెలియదు.

సీతను వదలిపెట్టే ముందు లక్ష్మణుడు భోరున ఏడ్చాడు. విషయం చెప్పాడు. సీత మొదట ఏడ్చినా చింతించినా ఆ తర్వాత తానీ అడవిలోనే జీవించి ఉంటానని చెప్పవలసిందని లక్ష్మణుణ్ణి పంపించివేసింది.

ఆ తర్వాత వాల్మీకుల ఆశ్రమంలో ఆమె ప్రసవించింది. లవకుశులను పెంచింది; వాల్మీకి రచించిన రామాయణం వారు నేర్చుకొనేట్టు చేసింది.

రాముడు యజ్ఞదీక్షాపరుడైన సందర్భంలో వారు పాడిన ఈ రామాయణం విన్నాడు. వాల్మీకి వల్ల వారు తన పుత్రులే అని తెలుసుకొన్నాడు. ఆ యజ్ఞ మంటపంలో రేపు అయోధ్యాపుర వాసులందరూ వింటుండగా సీత శపథం చేసిన తర్వాత ఆమెను నేను స్వీకరిస్తాను అన్నాడు. ఆమె పరిశుద్ధ అని తనకు తెలుసునన్నాడు.

ఆ మరుసటి రోజు సీత సభాయజ్ఞ మంటపానికి వచ్చింది. ఆ సమయంలో వాల్మీకి మాటలన్నీ తాను విశ్వసిస్తున్నట్లు, ఆ బాలురు తన కొడుకులే అని అంగీకరిస్తున్నట్లు రాముడన్నాడు.

"ఈ బాలురు జానకేయులు నా కొడుకులే! నా మనస్సుకి తెలుసు. సందేహం లేదు. కాని ఏమి చేసేది! లోకమనునదున్నది! లోకవిశ్వాసం కోసం జానకి తన సౌశీల్యాన్ని ఈ సభామధ్యంలో ప్రకటించవలసి ఉన్నది!!

ఇదీ జానకి విషయంలో ఆమె ఉండగా శ్రీరాముడన్న చివరి మాట. అప్పుడు సభా మధ్యానికి వచ్చి చేతులు జోడించి సీత ఇలా అన్నది.

"రఘుకులస్వామిని తప్ప, వేరొక పురుషుణ్ణి నేను మనసా, ఏ అవస్థలోనూ స్మరింపని దాననయితే, భూదేవి నాకు తనలో ప్రవేశానికి వీలైన రంధ్రాన్ని కలిగించుగాక! మనసావాచా కర్మణా నేను రాముణ్ణి అర్చించేదానను అయితే భూదేవి నాకు వివరము కలిగించు గాక! రాముణ్ణి తప్ప వేరొకణ్ణి నేను ఎరుగను అనే నామాట సత్యము అయితే భూదేవి నాకు తనలో ప్రవేశాన్ని కలిగించు గాక!"

ఇవి సీతాదేవి జీవితంలోని చివరి మాటలు. ఒకే భావాన్ని మూడు విధాలుగా

మూడుసార్లన్న మాటలు. అప్పుడు ఆ సభామధ్యంలోకి భూమిని చీల్చుకొని ఒక దివ్య సింహాసనం పైకి వచ్చింది. ఆ సింహాసనం మీద ఉన్న భూదేవి తన రెండు చేతులు చాచి సీతను తీసుకొని తన ఒడిలో కూచో బెట్టుకొన్నది. అలా ఆదివ్య దృశ్యాన్ని అందరూ చూస్తుండగానే ఆ సింహాసనం రసాతలానికి దిగిపోయింది.

ఇదండీ క్లుప్తంగా సీతకథ. ఆయువు పట్టులైన కొన్ని సన్నివేశాలను స్పృశించి మాత్రమే ఇంత మాత్రం ఇవ్వడం జరిగింది.

సీత సాధుశీల, సాధ్వి, ధర్మాధర్మాలు తెలిసినది. తన అభిప్రాయాన్ని ప్రకటించడంలో వెనుకంజ వేయనిది. రావణుడు భయపెట్టినా, ప్రలోభ పెట్టినా లొంగనిది. రాముడే తనపతి, రాముడే రక్షకుడన్న ఆత్మవిశ్వాసంతో జీవించింది.

లోకంలో రావణుని లాంటి వారెవరైనా తన లాంటి సీతల్ని అపహరించినప్పుడు, వారిని శిక్షించి లోకం నిష్కంటకం చేయాలని ఆశించింది. భర్త ఏ కారణంగానైన వదలి పెట్టినా తన సంతానాన్ని తానే పెంచి విద్యాబుద్ధులు చెప్పించాలని సందేశాన్నందించింది.

మట్టి నుండి పుట్టింది; స్వర్ణంలాంటి జీవిత సందేశమందించింది. చేవ ఉండి అర్థం చేసుకోవాలనుకొన్నవారికి కోటి సందేశాలందించింది. చివరికి మట్టిలోనే కలిసిపోయింది. అందుకే ఆ తల్లి పరమపునీత లోకమాత అయ్యింది.

## ✤ రామాయణం రమణుల కథే

రామ అంటే రాముడు; రామ అంటే రమణి (స్త్రీ) కూడా. రమణులు లేని రామాయణం లేదు. భారతీయ మహిళా జీవనానికి సందేశాలందించిన పాత్రలుగా ఓ పంద్రెండు మందినిక్కడ ప్రస్తావించడం జరిగింది. కొన్ని పూర్ణాలు - కొన్ని అపూర్ణాలు. అయితే పరమాత్మ ఒక్కడే పూర్ణుడు. మిగతాదంతా అపూర్ణమే.

ఇది సృష్టి చదరంగం. ఈ చదరంగంలోని పావులే స్త్రీ పురుషులు. రామాయణంలోని స్త్రీలూ అంతే. ఇంకా సుమిత్ర, త్రిజట, అనసూయ, అరుంధతి, రుమ, రంభ, ధాన్యమాలి, సింహిక, సురస, లంకిణి, అహల్య, శ్రవణుని తల్లి, శాంత, ఋష్యశృంగుణ్ణి నగరానికి తెచ్చిన వేశ్యలు, శ్రుతకీర్తి, మాండవి..... ఇలా వీరందరినీ పరామర్శించాల్సి ఉంది. అప్పుడే రామాయణ మహిళాంతరంగం సమగ్ర దర్శనమవుతుంది.

✤ ✤ ✤

# మహాభారతంలో మహిళలు

- మహేతిహాసంలో మహిళ

1. స్వేచ్ఛాజీవి **గంగ.**
2. ధీరమానస **సత్యవతి.**
3. సౌజన్యవతి **శర్మిష్ఠ**
4. స్వాభిమాని **దేవయాని**
5. కపటి కద్రువ - **వినీత వినత**
6. మేధానిధి **మేనక**
7. సత్యవాది **సరమ**
8. ధర్మవాదిని **జరత్కారువు**
9. మృత్యుంజయి **సావిత్రి**
10. పరమపతివ్రత **పారమార్థికత**
11. వీరమాత **కుంతి**
12. భారత-భారతి **ద్రౌపది**

- భారతం మహిళా భారతం

# మహాభారతంలో మహిళలు

## ❖ మహేతిహాసంలో మహిళ

మహాభారతంలో మహిళలు అనంగానే ఎవరికైనా ప్రప్రథమంగా స్ఫురించే మహిళ ద్రౌపదే; ఆ తర్వాత గుర్తుకు నచ్చే తల్లి రాజమాతకుంతి. అయితే ఈ సుదీర్ఘ మహేతిహాసంలో మరెందరో మహిళలున్నారు. ఆయా సందర్భాల్లో కనిపించే వీరికి వారి వారి ప్రత్యేక వ్యక్తిత్వాలున్నాయి.

ఆ వ్యక్తిత్వాల్ని సరిగా గుర్తించాలంటే భారత హృదయం తెలవాలి. వ్యాసుని ఆవేదన అర్థం గావాలి. భారతంలోని ఏ పాత్ర విషయంలోనైనా ఈ పద్ధతే అనుసరించాలి.

ఊర్ధ్వబాహు విరౌమ్యేష - సచకశ్చిత్చ్ఛృణోతిమే ।
ధర్మాదర్థశ్చ కామశ్చ - సధర్మః కింన సేవ్యతే ॥

నా రెండు చేతులు పైకెత్తి ఎలుగెత్తి చెబుతున్నాను. ధర్మం ద్వారానే అర్థం లభిస్తుంది. ధర్మంతోనే భోగాలు ప్రాప్తిస్తాయి. కాని నా మాట వినువారేరి! అనుసరించేవారేరి!

ఈ మాట ఎవరో అనడం లేదు; ధర్మాధర్మకోవిదుడైన వేదవ్యాస మహర్షే అంటున్నారు. ధర్మం మూలాధారంగా మహాభారత గ్రంథ నిర్మాణం జరిగింది. ఈ ధర్మం సనాతనమైంది. అధునాతనమైంది. అది వదలి పెట్టి జీవించడం కష్టం. జీవించినా ఆ బ్రతుక్కి ఓ అర్థమూ పరమార్థమూ ఉండదు. మహాభారతంలోని పాత్రలన్నీ ఈ ధర్మం చుట్టూ పరిభ్రమించినవే. ఇది భారతీయమైన ధర్మం; భారతధర్మం.

ఈ ధర్మం అందరు సుఖంగా ఉండాలంటున్నది; అందరు ఆరోగ్యంగా ఉండాలంటున్నది; అందరు అంతట మంచినే చూడాలంటున్నది; ఏ ఒక్కరు కూడా దుఃఖంపాలు కావద్దంటున్నది.

"సర్వేభవన్తు సుఖిన : - సర్వేసన్తు నిరామయాః,
సర్వేభద్రాణి పశ్యన్తు - మాకశ్చిత్ దుఃఖభాగ్భవేత్ "

ఇంత మహోన్నత లక్ష్యాదర్శాలతో ముందుకు నడిచే భారతీయుడు

ఆత్మవత్సర్వభూతానిగానే భావించాడు. సర్వభూతాత్మలకు తన ఆత్మకు అద్వైతాన్నే ఆరాధించాడు. పురుషునికి స్త్రీకి అభేదాన్నే పాటించాడు. కాని స్త్రీ బాల వృద్ధులు కుసంస్కారి - అహంకారి అయిన మదోన్మత్త పురుషుని దురాక్రమణకు గురి అవుతూనే ఉన్నారు. ఈ కుటిలుర దుష్ట ప్రయత్నాల్ని ఎదిరించి నిలవాలనీ, స్వాభిమానంతో జీవించాలని భారత స్త్రీ సందేశమిస్తూనే ఉంది.

ఆనాడు వ్యాసుడే తన మాట వినువారేరి అని వాపోయాడు; మరి ఈ మహిళ మాట వినువారేరి అని ఇప్పుడడుగాల్సి వస్తుంది. అయినా వారి జీవన విధానం విశ్వానికి శాశ్వత సందేశాన్ని అందిస్తూనే ఉంది. అలా సార్వకాలీన సత్యసందేశాల్ని అందించే మహాభారతంలోని కొంతమంది మహిళల పాత్రల్ని స్పృశించడమే ఉద్దేశ్యంగా ఈ పరిశీలన కొనసాగుతున్నది.

## 1. స్వేచ్ఛాజీవి గంగ

“నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి” అన్న స్మృతి వాక్యానికి ఈనాడు విపరీత వ్యాఖ్యానాలు వినిపిస్తున్నాయి. ఆ కారణాన కొన్ని వాస్తవాలు మరుగున పడిపోతున్నాయి. కొంతమంది మనుషుల్లో ఉన్న మృగతత్వాన్ని దృష్టిలో పెట్టుకొని ప్రాచీన కాలంలో స్మృతికారులు పై కట్టడి చేశారు. బాల్యంలో తండ్రి రక్షణలో, యౌవనంలో భర్త రక్షణలో, వృద్ధాప్యంలో కొడుకు రక్షణలో స్త్రీ ఉండాలని చెప్పిన పై శ్లోకంలోని పూర్వార్ధభావంలో పురుషునికి చేసిన హెచ్చరిక ఇది. ఆయా పనుల్లో మునిగిపోయిన పురుషుడు తన కూతురిని, తన భార్యను, తన తల్లిని రక్షించడంలో ఏ మాత్రం ఏమరిపాటు లేకుండా ఉండాలనే స్మృతికారుని తాపత్రయం. ఇక చివరి వాక్యం స్త్రీకి చేసిన హెచ్చరిక, బాల్యంలో నీకు రక్షకుడిగా మీ నాన్నగారుంటారు. ఆయన లేకపోతే అలా నాన్నలా నిన్ను చూసుకొనే వ్యక్తి దగ్గరే ఉండాలని అర్థం. యౌవనంలో స్వేచ్ఛగా తిరగకు. తిరుగుకానీ నీ భర్త నీకు రక్షకుడిగా ఉన్నప్పుడు మాత్రమే తిరుగు. వృద్ధాప్యంలో కొడుకు అండన కాలం గడిపేయ్. రోగం వచ్చినా, రొష్టు వచ్చినా రక్షకునిగా ఉండేవాడు కొడుకే గదా!

స్మృతి ఇట్లా నిర్దేశించిందన్న సంగతి భారతీయ సమాజంలో నూటికొక్కరికో ఇద్దరికో తెలిసి ఉంటుంది. అంతే! ఆ గ్రంథం అలా చెప్పినా చెప్పకున్నా అనురాగం - ఆత్మీయత తన వారిని కాపాడుకొనే యత్నం చేస్తుంది. చేపకు ఈత నేర్పాల్సిన అవసరం లేకుండానే, తన కూతురిని సరిగా పెంచాలని తండ్రికీ, తన భార్యను అనురాగంతో చూసుకోవాలని భర్తకూ, తన తల్లిని మన్నించాలని కొడుకుకూ ఎవరూ చెప్పాల్సిన అవసరం లేదు. తన పూర్వీకుల్ని చూసి లోకాన్ని చూసి స్త్రీ యైనా పురుషుడైనా మంచిని ఆచరిస్తారు. చెడును విసర్జిస్తారు. అందుకు వ్యతిరేకంగా ఎవరైనా నడుచుకుంటే వారికి ఏవో నిహిత స్వార్థాలున్నాయని భావించాలి.

స్త్రీకి స్వాతంత్ర్యమే లేదు. బురఖావేసుకొని నాలుగు గోడల మధ్య ఇండ్లల్లోనే కూచోవాలని ప్రాచీన కాలంలో భావించే ఉంటే, మనకు లభిస్తున్న ప్రాచీన ఐతిహాసిక పౌరాణిక గ్రంథాల్లో స్త్రీల అభిప్రాయాలకు ఏ మాత్రం విలువ లభించలేదనే నిదర్శనాలు దొరికేవి. భారతంలో గంగా, సత్యవతుల పాత్రల్ని పరిశీలిద్దాం. వాళ్ల మాటకున్న విలువ వల్ల స్త్రీ కున్న ప్రత్యేకత అర్థమవుతుంది.

శంతనునికున్న పూర్వజన్మ ప్రస్తావన ప్రస్తుతానికి అప్రస్తుతం. ఇంద్రసభలో మహాభిషునిగా శంతనుడు పిలువబడేవాడు. ఇంద్రసభకు వచ్చిన గంగ ఆ మహాభిషుణ్ణి చూచి మనసు పడింది. అతడు కూడ మనసుపడ్డాడు. నిండు సభలో ఒకరినొకరు వాంఛాపూరితంగా చూసుకోవడం సభామర్యాదకు భంగం. అందుకు ఇంద్రుడు కోపగించాడు. ఇద్దరుసంస్కారచిత్తులు కాబట్టి అతని ఆగ్రహాన్ని మన్నించారు. ఆ తర్వాత గంగాతీరంలో ఇద్దరూ కలిశారు. వివాహానికి గంగ అంగీకరించింది. అయితే మొదటనే కొన్ని షరతుల్ని విధించింది. తన ఇష్టానికి భిన్నంగా శంతనుడు వ్యవహరించరాదనీ, ఏ మాత్రం తన విషయంలో అప్రియంగా వ్యవహరించినా వెళ్లిపోతానని మొదటే 'కరాఖండిగా' చెప్పేసింది గంగ. శంతనుడు అంగీకరించాడు. గంగ శంతనుని భార్య అయ్యింది. ఆమెకు వరుసగా ఏడుగురు పుట్టారు. ఆ ఏడుగురు శిశువుల్ని, పుట్టిన వెంటనే నదిలో పడవేసింది.

ఇక్కడ అష్టవసువుల కథల్ని, పూర్వజన్మ వాసనల్ని కొద్దిసేపు పక్కకు పెట్టి ఆలోచిద్దాం. తన కన్న సంతానాన్ని ఏ తల్లీ గంగ పాలు చేయాలని అనుకోదు. ఏ అసాధారణ పరిస్థితుల్లోనే ఇరుక్కొని, మనస్సు పిరికిమందు తాగినపుడు, జీవితం మీద రోసినప్పుడు, తన పిల్లల్ని అంతం చేసి తానూ చావాలని నిశ్చయించుకొనే స్త్రీల కథలు అప్పుడప్పుడు అక్కడక్కడ బయటపడుతూనే ఉన్నాయి. ఈ విషయంలో పురుషుడు కూడా స్త్రీకేం తీసిపోవడం లేదు.

ఇక గంగకేమో తాను బతకాలని ఉంది. సాంసారిక జీవనం మీద తీపే ఉంది. కాని పిల్లల మీద ఎంత మాత్రం మోజు లేదు. వాళ్ళకు పాలివ్వాలని, లాలించాలని, పెంచాలని ఆమె భావించనే లేదు. ఎందుకీ బాదరబందీ అనుకొంది. పుట్టిన వెంబడే తీసుకుని నదిలో పడవేసింది. గంగ గంగలో పడవేసింది అనే విషయానికి గంగ సంతానాన్ని తనలోనే లయం చేసుకొందనీ కొందరు అర్థం చెప్పవచ్చు. మొత్తం మీద సంతానం పెంచడం ఆమెకు ఇష్టం లేదు.

ఎనిమిదవ కొడుకుని కూడా ఆమె పారవేయబోయింది. ఇన్నాళ్లకు ఇన్నేళ్లకు అప్పుడు శంతనుడు అడ్డుపడ్డాడు. తనకు అప్రియం పలుకనన్న శంతనుడు అప్పుడు పలికాడు. అంతే గంగ శంతనునికి 'గుడ్‌బై' చెప్పేసింది. శాశ్వతంగా విడాకులిచ్చేసింది. జీవితంలో మళ్లీ యేనాడు కూడా శంతనుణ్ణి కలువలేదు. గంగ విడిచిపెట్టిన ఆఖరి కొడుకును పెంచి పెద్ద చేసి విద్యాబుద్ధులు చెప్పించాడు శంతనుడు. (గంగ కూడా విద్యాబుద్ధులు చెప్పించింది) ఆ

కొడుకే భీష్ముడు, ధర్మవేత్త అయ్యాడు. బతికినంతకాలం తన కొరకు గాక ఇతరుల కొరకే బతికాడు.

కొందరు బుద్ధిహీనులు తమ సంకుచిత కుత్సిత వర్గ దృక్పథంతో గంగకు ఒక కులాన్ని లేదా జాతికి అంటగట్టి వాళ్లల్లో స్త్రీకి ఇంకా అంత స్వాతంత్ర్యం ఉందని గప్పాలు కొడుతుంటారు. గంగకు కులమేంటి! జాతియేంటి! అసలు జాతి శబ్దాన్ని కనీస అర్థజ్ఞానం లేకుండా ప్రయోగించడం శోచనీయం.

"అంతర్గుడగుడాయతే బహిర్వ్యక్తుం నశక్యతే" అన్న ధోరణిలో ఆనాటి స్త్రీ పురుషులుండలేదని, ఇంకా పురుషుడే తన మనసులోని భావాల్ని చెప్పడంలో వెనక ముందాడాడని, పుత్ర ప్రేమతోనే లేదా మానవతా దృక్పథంతోనో ఆమె ధోరణికి అడ్డుపడ్డాడని, గంగ మాత్రం సామాజిక ధర్మాన్ని కూడా ఉల్లంఘించి సంతానాన్ని కాపాడుకోడం కన్నా, పెంచుకోడం కన్నా మనసు చెప్పినట్లు స్వేచ్ఛగా వ్యవహరించడమే శ్రేష్ఠంగా భావించిందనీ - ఇంకా - ఇంకా అనేక విషయాలు ఈ గంగ పాత్ర చిత్రీకరణ ద్వారా మనకు తెలుస్తున్నాయి. భీష్ముని నిర్యాణ సందర్భంలో ఆ గంగమ్మ తల్లి మహా సముద్రమయింది.

ఆ శంతనుని పూర్వార్థ జీవితంలో గంగ ఇలా వ్యవహరిస్తే ఇక ఉత్తరార్థ జీవితంలో ప్రవేశించిన సత్యవతి ఎలా వ్యవహరించిందో పరిశీలిద్దాం.

## 2. ధీరమానస సత్యవతి

గంగ వెళ్లిపోయిన తర్వాత శంతనుడు చాలా కాలం వరకు మళ్లీ పెళ్లి చేసుకోలేదు. పెళ్లనేది ఇద్దరికీ సంబంధించిన విషయం. తన మనోభావాలకు ఈడైన జోడును వెతుక్కోడంలో తప్పేం లేదు. శంతనునికి జీవితంపై విరక్తి వల్లనో, తనకు సరియైన స్త్రీ లభించకపోవడం వల్లనో సత్యవతిని చూసేంతవరకు ఎప్పుడూ ఆ ప్రసక్తే తేలేదు.

శంతనుడు సత్యవతిని అడిగాడు. ఆమెకూ ఇష్టమే. అందుకే తండ్రిని అడుగుమంది.

తండ్రిని అడుగుమనడంలో ఆమెకు స్వాతంత్ర్యమున్నట్లా అని కొందరు సందేహం వెలిబుచ్చొచ్చు. కాని ఇంతవరకు సత్యవతి ఎవరికీ తెలియకుండా పరాశరుణ్ణి ప్రేమించింది. ఆ ప్రేమ ఫలితంగా వారికి వ్యాసుడు పుట్టాడు. సత్యవతీ పరాశరుల మధ్యన సాంసారిక, లైంగిక సంబంధం ఉంది గాని వైవాహిక బంధం లేదు. వ్యాసుడు కలిగాక పరాశరుడు వెళ్లిపోయాడు. వ్యాసుడు కూడా వెళ్ళిపోయాడు. మధ్యమధ్యన వచ్చి తల్లిని చూస్తానన్నాడు. పరాశరుడు ఇక ఎప్పటికీ రాడు. కొడుకేమో ఉండికూడ లేనట్టే.

అందువల్ల మళ్లీ తండ్రి పంచన చేరింది సత్యవతి. నిజానికి ఆ తండ్రి ఈమెను పెంచిన తండ్రి. చేపకడుపున ఒక జాలరికి లభించింది సత్యవతి. ఆమెను దాశరాజుకిచ్చాడతడు.

కన్నబిడ్డలా పెంచి పెద్దచేశాడు దాశరాజు. ఆ తండ్రికి తెలియకుండా తాను పరాశరుణ్ణి ప్రేమించినందుకు సత్యవతి బాధపడిందేమో! పరాశరుడు వెళ్లిపోతే ఆమెం బాధపడలేదు. ఇద్దరం కలిశాం, ఓ కొడుకు పుట్టాడు; ఆయన కేవో తపస్సులు పరిశోధనలూ ఉన్నాయి. అందుకొరకు తనను వదలి వెళ్లిపోతున్నాడు. తండ్రికి చెప్పకుండానే తాను అతనితో స్వతంత్రించి వ్యవహరించింది. అది బెడిసికొట్టింది. అందుకే ఇప్పుడు శంతనుణ్ణి పునర్వివాహం చేసుకోవాలని ఉన్నా ఆ నిర్ణయాన్ని తండ్రికే వదిలేసింది.

ఏయే సందర్భాల్లో స్త్రీ పునర్వివాహం చేసుకోవచ్చో స్మృతికారుడే చెప్పాడు. "పురుషుడన్ని విధాలా నష్టపోతే, కాలం తీరో లేదా అకస్మాత్తుగానో మరణిస్తే, సన్యాసం పుచ్చుకొని వెళ్లిపోతే, నపుంసకుడై సాంసారిక జీవనానికి అయోగ్యుడైతే, పతితుడై పనికిమాలిన పనులకు పాల్పడితే, సప్తవ్యసనాలకు లోనైతే, అటువంటి వానిని వదిలి పెట్టి స్త్రీలు మరో పెళ్లి చేసుకోవచ్చు". మహాభారతోద్యోగ పర్వంలో వ్యభిచరించడం, జూదమాడడడం, త్రాగడం, తిట్టడం, కొట్టడం, మొండి పట్టుదల కలిగి ఉండడం, వ్యర్థంగా డబ్బు ఖర్చు పెట్టడం మొదలైనవి సప్తవ్యసనాలుగా చెప్పబడ్డాయి. స్మృతికారుని ఆ నియమం స్త్రీ పురుషులిద్దరికీ సమానంగానే భావించాలి. పునర్వివాహ విషయంలో స్మృతికారుని కున్న ఈ విశాల దృక్పథాన్ని స్మృతులంటే గిట్టని మహాశయులు చదువలేదో, చదివినా భారతీయమైన శ్రేష్ఠ విషయమేది కూడా వారి ఒంటికి జీర్ణం కాదో అర్థం కాదు. ఎప్పుడూ పెడదారి పట్టి తిట్టి తిట్టి నోరుకంపు చేసుకోడం తప్పిస్తే మంచి అంగీకరించని వంచకులను సరియైన మార్గంలో పెట్టడం కష్టమే మరి.

ఇక్కడ సత్యవతీ శంతనులిద్దరూ ఒకేరకంగా ఉన్నారు. ఇద్దరి మానసిక స్థితి సరిపోయింది. ఒకరిని భర్త విడిచిపోయాడు. మరొకరిని భార్య విడిచిపోయింది. ఒకరినొకరు చూచుకొన్న తర్వాత ఇద్దరికీ వివాహం చేసుకోవాలనిపించింది. దానికి పెద్దల ఆమోద ముద్ర లభిస్తే చాలు అంది సత్యవతి. సరే అన్నాడు శంతనుడు. కాని దాశరాజు పెట్టిన షరతు శంతనుణ్ణి సంతాపంలో ముంచేసింది. సత్యవతీ శంతనులకు కలిగిన సంతానానికే రాజ్యం కట్టబెట్టాలన్నాడతడు. అతడలా అడగడానికో కారణముంది. శంతనునికి ఇది వరకే ఒక కొడుకున్నాడు... భీష్ముడు. అతడు అప్పటికే సకల విద్యల్లో ఆరితేరాడు. బుద్ధిమంతుడని పేరు తెచ్చుకొన్నాడు. న్యాయంగా రాజ్యం అతనికే దక్కుతుంది. కాని దాశరాజు మడత పేచి పెట్టాడు. పరాశర సత్యవతుల ప్రేమాయణం సత్యవతి చెప్పకున్నా దాశరాజుకు తెలియకపోలేదు. అందువల్లే దాశరాజు తన కూతురుకు మరోసారి దెబ్బ తగలరాదనుకొన్నాడు. రేపటినాడు శంతనుడు సత్యవతీ సంతానానికి రాజ్యాధికార అర్హత కలిగిస్తే, మంచైనా చెడ్డయినా కొడుకు దగ్గర ఉండిపోతుంది.... అనుకొన్నాడు దాశరాజు. ఆ కారణాన్నే ఆ షరతుపెట్టాడు. శంతనుడు ఆలోచనల్లో పడ్డాడు. సర్వవిధాలా సమర్థుడైన పెద్దకొడుక్కే రాజ్యమివ్వాలి. ఈ కారణంగా సద్గుణవతి - సౌందర్యవతీ అయిన సత్యవతిని వదులుకోడం కూడా ఇష్టం లేదు. గుంజాటన పడ్డాడు; చింతించాడు. అతని సంస్కారచిత్తం మౌనముద్ర

కొడుకే భీష్ముడు, ధర్మవేత్త అయ్యాడు. బతికినంతకాలం తన కొరకు గాక ఇతరుల కొరకే బతికాడు.

కొందరు బుద్ధిహీనులు తమ సంకుచిత కుత్సిత వర్గ దృక్పథంతో గంగకు ఒక కులాన్ని లేదా జాతికి అంటగట్టి వాళ్లల్లో స్త్రీకి ఇంకా అంత స్వాతంత్ర్యం ఉందని గప్పాలు కొడుతుంటారు. గంగకు కులమేంటి! జాతియేంటి! అసలు జాతి శబ్దాన్ని కనీస అర్థజ్ఞానం లేకుండా ప్రయోగించడం శోచనీయం.

"అంతర్గుడగుడాయతే బహిర్వక్తుం నశక్యతే" అన్న ధోరణిలో ఆనాటి స్త్రీ పురుషులుండలేదని, ఇంకా పురుషుడే తన మనసులోని భావాల్ని చెప్పడంలో వెనక ముందాడాడని, పుత్ర ప్రేమతోనే లేదా మానవతా దృక్పథంతోనో ఆమె ధోరణికి అడ్డుపడ్డాడని, గంగ మాత్రం సామాజిక ధర్మాన్ని కూడా ఉల్లంఘించి సంతానాన్ని కాపాడుకోడం కన్నా, పెంచుకోడం కన్నా మనసు చెప్పినట్లు స్వేచ్ఛగా వ్యవహరించడమే శ్రేష్ఠంగా భావించిందనీ - ఇంకా - ఇంకా అనేక విషయాలు ఈ గంగ పాత్ర చిత్రీకరణ ద్వారా మనకు తెలుస్తున్నాయి. భీష్ముని నిర్యాణ సందర్భంలో ఆ గంగమ్మ తల్లి మహా సముద్రమయింది.

ఆ శంతనుని పూర్వార్ధ జీవితంలో గంగ ఇలా వ్యవహరిస్తే ఇక ఉత్తరార్ధ జీవితంలో ప్రవేశించిన సత్యవతి ఎలా వ్యవహరించిందో పరిశీలిద్దాం.

## 2. ధీరమానస సత్యవతి

గంగ వెళ్లిపోయిన తర్వాత శంతనుడు చాలా కాలం వరకు మళ్లీ పెళ్లి చేసుకోలేదు. పెళ్లనేది ఇద్దరికీ సంబంధించిన విషయం. తన మనోభావాలకు ఈడైన జోడును వెతుక్కోడంలో తప్పేం లేదు. శంతనునికి జీవితంపై విరక్తి వల్లనో, తనకు సరియైన స్త్రీ లభించకపోవడం వల్లనో సత్యవతిని చూసేంతవరకు ఎప్పుడూ ఆ ప్రసక్తే తేలేదు.

శంతనుడు సత్యవతిని అడిగాడు. ఆమెకూ ఇష్టమే. అందుకే తండ్రిని అడుగుమంది.

తండ్రిని అడుగుమనడంలో ఆమెకు స్వాతంత్ర్యమున్నట్లా అని కొందరు సందేహం వెలిబుచ్చొచ్చు. కాని ఇంతవరకు సత్యవతి ఎవరికీ తెలియకుండా పరాశరుణ్ణి ప్రేమించింది. ఆ ప్రేమ ఫలితంగా వారికి వ్యాసుడు పుట్టాడు. సత్యవతీ పరాశరుల మధ్యన సాంసారిక, లైంగిక సంబంధం ఉంది గాని వైవాహిక బంధం లేదు. వ్యాసుడు కలిగాక పరాశరుడు వెళ్లిపోయాడు. వ్యాసుడు కూడా వెళ్ళిపోయాడు. మధ్యమధ్యన వచ్చి తల్లిని చూస్తానన్నాడు. పరాశరుడు ఇక ఎప్పటికీ రాడు. కొడుకేమో ఉండికూడ లేనట్టే.

అందువల్ల మళ్లీ తండ్రి పంచన చేరింది సత్యవతి. నిజానికి ఆ తండ్రి ఈమెను పెంచిన తండ్రి. చేపకడుపున ఒక జాలరికి లభించింది సత్యవతి. ఆమెను దాశరాజుకిచ్చాడతడు.

ధరించింది. అతని శరీరం దినం దినం కృశించింది. తండ్రి మనస్సులోని కోరిక పసిగట్టాడు భీష్ముడు. తానే నేరుగా దాశరాజు దగ్గరికి వెళ్లి సంబంధం ఖాయం చేశాడు. అందుకై తాను జీవితాంతం పెళ్లి కూడ చేసుకోనన్నాడు. ఆ ప్రతిజ్ఞ భీషణమయింది; భీష్మమయింది; అప్పటి నుండే అతడు భీష్ముడయ్యాడు.

సత్యవతీ, శంతనులకు చిత్రాంగదుడు, విచిత్ర వీర్యుడు కలిగారు. శంతనుడు మరణించాడు. పెద్దకొడుకు భీష్ముడే సత్యవతీ సుతులకు విద్యాబుద్ధులు చెప్పించాడు. సత్యవతి సంతోషించింది. భీష్ముడు చిత్రాంగదుని రాజు చేశాడు. ఇతణ్ణి ఒకయుద్ధంలో చిత్రాంగదుడనే గంధర్వుడు చంపేశాడు. ఆ తర్వాత విచిత్రవీర్యుడు రాజయ్యాడు. నవ యౌవనుడైన విచిత్రవీర్యునికి కాశీరాజు కూతుళ్లయిన అంబిక అంబాలికలతో పెళ్లి జరిపించాడు భీష్ముడు. కాని విచిత్రవీర్యుడు సంతానం కలుగక ముందే చచ్చిపోయాడు. రాజ్యం అరాజకమయ్యే ఆ పరిస్థితుల్లో ఇక భీష్ముడే ధర్మదండం చేత పట్టాడు.

ఆ సమయంలో సత్యవతి సుదీర్ఘంగా ఆలోచించింది. అనాదిగా వస్తోన్న ఈ వంశవృక్షం విచ్ఛేదమయ్యేట్లుంది. కురువంశంలో మిగిలినవాడవునీవొక్కడవే కాబట్టి పెళ్లి చేసుకొని ఈ వంశాన్ని నిలుపు అంది. భీష్ముడంగీకరించలేదు. పైగా భీష్మోపదేశం చేశాడు. భీష్ముని అనుమతితో వ్యాసుణ్ణి ధ్యానించింది సత్యవతి. తన కన్యా జీవితంలో కన్నకొడుకు ఇప్పుడు వేదవేదాంగవేత్తయై వేదవ్యాసుడైనాడు. ఆ వ్యాసుడు వెంటనే వచ్చాడు. సత్యవతి వ్యాసునికి నియోగం గూర్చి చెప్పింది. దేవర న్యాయం సమ్మతింపుమంది. వ్యాసుడు అంగీకరించాడు. ఆ కారణంగా అంబిక అంబాలికలకు ధృతరాష్ట్రుడు, పాండురాజు కలిగారు. నియోగంలో కలిగిన మాతృదోషం వల్ల ధృతరాష్ట్రుడు గుడ్డివాడయ్యాడు. పాండురాజు పాండు దేహుడయ్యాడు. ఈ దుస్థితికి సత్యవతి ఎంతో చింతించింది. మళ్లీ వ్యాసుణ్ణి ఆహ్వానించింది. రూపవంతుడైన కొడుకును పొందాల్సిందిగా కోడలు అంబికను నియోగించింది. అంబిక తన స్థలంలో దాసిని ఉంచింది. ఆమెకు వ్యాసుని వల్ల విదురుడు కలిగాడు. ఇక వాళ్ల పెంపకం బాధ్యతను భీష్ముడు స్వీకరించడంతో సత్యవతికి భారం తగ్గింది. ఆ తర్వాత ధృతరాష్ట్రుని కొడుకుల్ని, పాండురాజు సంతానాన్ని చూసి ఆనందించింది. ఒకనాడు ప్రసంగవశాత్తు వ్యాసుడు ధృతరాష్ట్ర నందనులు వంశనాశన కారకులవుతారన్నాడు. ఇకతాను, తన కొడుకు ఇక్కడే ఉండి ఇంకా ఏమేం చూడాలో అని చింతించింది. వెంటనే అంబిక అంబాలికలతో తపోవనానికి బయలుదేరింది. ఇక ఆ తల్లి శేష జీవితం అక్కడే గడిచిపోయింది.

సత్యవతి జీవితంలో ఎందరి బంధాలో అనుబంధాలో పెనవేసుకొని పోయాయి. దాశరాజు, పరాశరుడు, వేదవ్యాసుడు, శంతనుడు, పాండురాజు, చిత్రాంగదుడు, విచిత్ర వీర్యుడు, భీష్ముడు, ధృతరాష్ట్రుడు, పాండురాజు, విదురుడు, కౌరవులు, పాండవులు, ప్రాచీన కాలపు స్త్రీపైన మగవాడి బలం, జులుం, జబర్దస్తీ పెత్తనం అదీ ఇదీ అణగదొక్కింది

అనే వారికనైనా ఆలోచించండి! జీవితంలోని అన్ని ఒడుదుడుకుల్లోను, ఏ మాత్రం చలించని ధీరమానసగా, ప్రణయజీవిగా, బాధ్యత గల గృహిణిగా, వంశవృక్షాన్ని నిలపాలని తపించే యజమానురాలిగా ఆమె మూర్తి నాడైనా నేడైనా రేపైనా అలాగే అలాగే సాక్షాత్కరిస్తుంది. అయితే ఇలా అన్వయించుకొనే సహృదయత ఉండాలి పఠితకు. భారతీయ సంస్కృతి మీద అభిమానముండాలి. తిట్టుకొంటూ కూచోడం కంటే మంచిని పట్టుకోడం మంచిది లేకపోతే ఎవరికి వారే యమునా తీరే !

## 3. సౌజన్యవతి శర్మిష్ఠ

మహాభారతం స్త్రీ పాత్రల్లో సౌజన్యవతి శర్మిష్ఠ, రాక్షసరాజైన వృషపర్వుని కూతురు. బాల్యంలోనే చాలా గ్రంథాలు చదివింది. దేవయాని, ఈమె ఇద్దరూ సహాధ్యాయినులు. ఆ కారణాన్నే కలిసి ఆడేవారు, కలిసి పాడేవారు, కలిసి విహరించేవారు, దేవయాని శుక్రుని కూతురు. శుక్రుడు రాక్షసుల గురువు వృషపర్వుని దగ్గరే ఉండి రాజుకు, రాజ్యానికి హితాన్ని చేకూర్చే సలహాలిస్తుండేవాడు. వృషపర్వునికి శుక్రుడంటే గురి; అపారమైన భక్తి కూడా.

ఒకనాడు శర్మిష్ఠ దేవయాని తమ స్నేహితురాండ్రతో, పరిచారికలతో వనవిహారానికి వెళ్లారు. ఆడీ పాడీ అలసి అందరూ దగ్గరేఉన్న సరస్సులో దిగారు. స్నానాలు చేశారు. ఈ సందర్భంలోనే సుడిగాలి వచ్చింది. ఆ గాలికి ఒడ్డున పెట్టిన వారి చీరలు కలగాపులగంగా కలిసిపోయాయి. సరస్సు వెలుపలికి వచ్చిన శర్మిష్ఠ, దేవయాని చీర కట్టుకొంది. దేవయాని శర్మిష్ఠ మైలచీర తాను కట్టుకోను అంది. తన చీర తనకు విడిచి ఇవ్వమని అంది. దేవయాని అడిగిన ధోరణి శర్మిష్ఠకు నచ్చలేదు. "ఏం కట్టుకొంటే! నీ చీర నేనుకట్టుకొన్నాగా, నా చీర నువ్వు కట్టుకో" అంది. "నేను బ్రాహ్మణ బాలికను, నీ చీరను కట్టుకోను" అంది దేవయాని, ఆ మాటలో శర్మిష్ఠకు మంట మండింది. 'మా అయ్య దగ్గర మీ అయ్య నౌకరీ చేస్తున్నాడు తెలుసా' అన్నది. అయినా దేవయాని వినలేదు. వాళ్లు నడుస్తూనే ఉన్నారు. వాదం కొనసాగుతూనే ఉంది. శర్మిష్ఠ దేవయానిని పాడుబడ్డ బావిలోకి త్రోసేసింది. ఇంటికి వెళ్ళిపోయింది. ఆమె వెంబడి మిగతా అందరూ వెళ్లిపోయారు.

శర్మిష్ఠ ఈ చర్య ఉచితమని కొందరు, కాదని కొందరు వాదించే అవకాశముంది. చీరలు రెండూ ఒకేరకంగా ఉన్నాయి. అందువల్ల శర్మిష్ఠ పొరబడి కట్టుకొంది. పొరపాటే! కాని దేవయాని అడిగిన తీరులో అహం ధ్వనించింది. దేవయానికి గుణపాఠం నేర్పాలనుకొంది. అందుకే పాడుబడ్డ బావిలో త్రోసింది. అందుకు ఫలితంగా శర్మిష్ఠకు పెద్ద శిక్షపడింది. తన పరిచారికలతో దేవయానికి శర్మిష్ఠ జీవితాంతం దాసీగా ఉండాలి. బావిలోని దేవయానిని యయాతి రక్షించాడు. దేవయాని ఇంటికి వెళ్లలేదు. మరెక్కడికైనా వెళ్లాలనుకొంది. శుక్రునికీ సంగతి తెలిసింది. కూతురుకు చెప్పి చూశాడు. ఆమె వినలేదు. తాను కూడ కూతురిని అనుసరించాడు. వృషపర్వునికీ సంగతి తెలిసింది. ఉరుకులు పరుగులతో వచ్చి దేవయాని

కోరిన విధంగా తన కూతురు శర్మిష్ఠను ఆమెకు దాసిగా అప్పగించాడు. ఇది శర్మిష్ఠకు పెద్ద శిక్షేమరి.

ఇక్కడ శర్మిష్ఠ ఇంత పెద్ద శిక్షకు ఎందుకు తలవంచాల్సి వచ్చింది. ఆమె ధర్మాధర్మకోవిద, సామాజిక ధర్మాన్ని, రాష్ట్ర ధర్మాన్ని పరిరక్షించడంలో వ్యక్తికి కలిగే నష్టం పెద్దగా పరిగణించాల్సిన అవసరం లేదు. తానొక్కతి స్వాతంత్ర్యాన్ని కోల్పోయినందువల్ల దేశానికి వచ్చే నష్టమేం లేదు. కానీ కూతురి మీద ప్రేమతో తమ దేశం నుండి శుక్రుడే వెళ్లిపోతే దేశ పరిస్థితి యేమవుతుంది. యంత్రాంగం నడిచేదెట్లా! తన తండ్రికి పరిపాలనలో సలహాలిచ్చేదెవరు? ధర్మమూ, నీతీ బాగా తెలిసిన శుక్రుడు లేకపోతే రాజ్యము అల్లకల్లోలం కాదా! తమ దేశం శత్రువుల చేతుల్లో పడి స్వాతంత్ర్యాన్ని కోల్పోదా, తానొక్కతి స్వాతంత్ర్యం కోల్పోడం అది పెద్దగా పరిగణించదగిందేం కాదు! మొత్తం దేశాన్నే తాను కాపాడిందవుతుంది. అందుకే తలవంచేసింది శర్మిష్ఠ.

ఇంకేం ఇక దేవయాని ఆడింది ఆట, పాడింది పాట! తండ్రిని ఒప్పించి యయాతిని పెళ్లి చేసుకొంది. దాసి శర్మిష్ఠ దేవయానిని అనుసరించింది. దేవయానికి సంతానం కలిగింది. శర్మిష్ఠ తన బ్రతుకును గూర్చి చింతించింది. ఒకనాడు యయాతితో ఉద్యానవనంలో మాట్లాడింది. తనను కూడా భార్యగా స్వీకరించుమంది. యయాతికి కూడా శర్మిష్ఠపైన అనురాగముంది; ఆమెకు సరియైన అంతస్తు సమకూర్చాలనే అభిప్రాయముంది. కాని శుక్రుడేమంటాడో అని భయముంది. ఆ సమయంలో శర్మిష్ఠయే రాజుకు ధర్మోపదేశం చేయాల్సి వచ్చింది. ఇంకేం యయాతిని ఒప్పించింది. దేవయానిని రెండు విధాలుగా దెబ్బతీసింది. దేవయాని భర్త తనకు భర్త అయ్యాడు. దేవయాని సంతానానికి చెందాల్సిన రాజ్యాధిపత్యం శర్మిష్ఠ సంతానానికే దక్కింది. యయాతిని ఒప్పించడంలో శర్మిష్ఠకు దూరదృష్టి లేకపోలేదు. దేవయాని ఇన్నీ తెలుసుకునే స్థితిలో లేదు.

ఉద్యానవనంలో శర్మిష్ఠ ఒంటరి బతుకు బతుకుతున్నదిలే అనుకొంది. కాని ఆమెసంతానవతి అయిందని తెలిసిన వెంటనే వెళ్ళి అడిగింది 'నీవు కన్యవు' అని; శర్మిష్ఠ అబద్ధమాడి తప్పుకొంది. ఒక ముని నాకు సంతానాన్ని ప్రసాదించాడంది. దేవయాని పెద్దగా పట్టించుకోలేదు. ఆ తర్వాత శర్మిష్ఠకు మరో ఇద్దరు కొడుకులు పుట్టారు. దేవయానికేదో అనుమానం వచ్చింది. ఆ పిల్లల్లో యయాతి పోలికలు కొట్టవచ్చినట్లు కనపడుతున్నాయి. ఇక వారినే అడిగింది. 'మీ తల్లితండ్రులెవరు అని' ఆ పిల్లలు యయాతి శర్మిష్ఠలను చూపించారు. ఆమె రుసరుసలాడుతూ కోపంతో తండ్రి దగ్గరికి వెళ్లింది. శుక్రుడు యయాతికి శాపం ఇచ్చాడు. ఇక అది వేరేకథ.

శర్మిష్ఠ ముగ్గురు బిడ్డల తల్లి. ద్రుహ్యు, అనువు, పూరుడు తల్లి అదుపాజ్ఞల్లో పెరిగారు. అందరికన్నా చిన్నవాడు సకలశాస్త్రాన్ని అధ్యయనం చేశాడు. మాతాపితల్ని దైవాలుగానే భావించాడు. అతడే యయాతి తర్వాత రాజయ్యాడు.

దేవయానీ, శర్మిష్ఠల మధ్యన జరిగిన సంఘర్షణలో చివరికి శర్మిష్ఠే గెలిచింది. ఆమె చీర ఈమె కట్టుకోడంలోనే కథంతా సంకేతింపబడింది. ఆమె భర్త ఈమె భర్త అయ్యాడు. ఆమె కుమారునికి దక్కాల్సిన రాజ్యం ఈమె కుమారునికి దక్కింది. శర్మిష్ఠ కుండాల్సిన రాజసం దేవయానికుంది. దేవయాని కుండాల్సిన సాత్త్వికం శర్మిష్ఠకుంది. అహంకారం వల్ల గురుపుత్రిక భంగపడింది. లోకాన్ని అర్థం చేసుకొని వ్యవహరించడం వల్ల రాజపుత్రిక విజయాన్ని సాధించింది. ఆమె జీవితంలో కొన్ని కష్టాలనుభవించినా చివరికి సుఖానుభవాలన్నీ ఆమెకే దక్కాయి.

దేవయానితో వాదించినప్పుడు ప్రకటింపబడ్డ శర్మిష్ఠ వ్యక్తిత్వం, తండ్రి ముందు మూగవోయింది. అయితే మూగనోము పట్టి ఆమెకు దాసిగా ఉండడానికి అంగీకరించడంలో స్వార్థం కన్న పరమార్థం మిన్న అని భావించడం తప్ప మరింకేం కాదు. కాని దేవయాని సుఖాల్ని తాను కైవసం చేసుకోవడంలోనే ఆమె నీతి పల్లవించింది; పుష్పించింది; ఫలించింది. "నన్నేలిన దేవయానికి నీవు భర్తవు, కాబట్టి నాకు కూడా భర్తవే"... "లాజిక్" ఉపయోగించింది. దేవయానితో నిన్ను పంపించేప్పుడు "భార్యగా చూసుకోడం తప్ప నీ విషయంలో మిగతా సమస్త సౌకార్యాలు సమకూర్చుమన్నాడు; నేనెలా మాట తప్పుతాను" అన్నాడు యయాతి. ఒక కన్యను భార్యగా స్వీకరించే సమయంలో అబద్ధం ఆడవచ్చు తప్పేం కాదు అని ధర్మశాస్త్రాల్ని ఏకరువు పెట్టింది శర్మిష్ఠ. ఈ విధంగా తాను అనుకొన్నది సాధించింది, అందుకే సాత్త్విక సౌజన్య సాహస సహనశీల శర్మిష్ఠ అనాలనిపిస్తుంది.

## 4. స్వాభిమాని దేవయాని

మహాభారతంలోని మహిళల విషయం ప్రస్తావిస్తున్నప్పుడుకేవలం కౌరవ పాండవుల కాలం నాటి మహిళలే అనుకోవడం సబబు కాదు. ఆ గ్రంథంలో వచ్చిన ప్రతి మహిళ పరిశీలనార్హ అవుతుంది. కౌరవ పాండవుల పూర్వీకుల్లో యయాతి మహారాజు ఒకరు. ఆయన భార్యే దేవయాని. వృషపర్వుడనే రాక్షస రాజుకు గురువైన శుక్రాచార్యునికి, ఇంద్రుని కూతురైన జయంతికి ఈమె జన్మించింది. శుక్రునికి కూతురు మీద ఎనలేని ప్రేమ. ఆమె అడిగితే కొండమీది కోతినైనా తెచ్చివ్వడానికి సిద్ధంగా ఉన్నాడు శుక్రుడు. ఆ కారణంగానే ఆమెలో మంకుపట్టు పెరిగింది. దానితో పాటు ఓ రకమైన స్వాభిమానం కూడా ఆమె కలవడింది.

శుక్రుని దగ్గర మృతసంజీవని, విద్య ఉంది. దేవత ఆదేశంతో ఆ విద్య నేర్చుకోవాలని, దేవతల గురువైన బృహస్పతి కుమారుడు కచుడు వచ్చాడు. శుక్రుని దగ్గర శిష్యునిగా చేరాడు. వినయంగా మెలగాడు. శుక్రునికి సన్నిహితుడయ్యాడు. దేవయానికి పూలూ పళ్ళూ తెచ్చిచ్చేవాడు. దేవయాని అతణ్ణి ప్రాణంతో సమానంగా ప్రేమించింది. అతనొకనాడు ఆలస్యంగా వస్తే ఆమె ప్రాణం గిలగిలా కొట్టుకొనేది. కచుడు శుక్రుని కంత సన్నిహితుడవడం

రాక్షస బాలురకు నచ్చలేదు. అడవికి పువ్వులు తేవడానికి వెళ్ళిన కచుణ్ణి వారు చంపి చెట్టుకు వ్రేలాడదీశారు. రాత్రి వరకు కచుడు రాకపోయేసరికి దేవయాని తండ్రి దగ్గరకు వెళ్ళి దుఃఖించింది. శుక్రుడు జరిగింది తెలుసుకొని మృతసంజీవని విద్య ప్రయోగించి కచుణ్ణి బ్రతికించాడు. మరో రోజు రాక్షసులు కచుణ్ణి చంపి కాల్చి బూడిద చేసి ఆ బూడిదను సురలో కలిపి అది శుక్రుని చేత త్రాగించారు. శుక్రుడు మద్యం మత్తులో ఉన్నాడు. దేవయాని తండ్రి దగ్గరకు వెళ్ళి విలపించింది. శుక్రుడు జరిగిందంతా తెలుసుకొన్నాడు. తన తప్పు గ్రహించాడు. తన కడుపులోని కచునికి మృతసంజీవని ఉపదేశించాడు. కడుపు చీల్చుకొని కచుడు బయటపడ్డాడు. తాను నేర్చుకొన్న మృతసంజీవని ప్రయోగించి శుక్రుణ్ణి బ్రతికించాడు. ఆ విధంగా అడగకుండానే కచునికి మృతసంజీవని లభించింది. ప్రయోగం కూడా చేసి చూసుకోవడం జరిగింది.

ఆ తర్వాత కొన్నాళ్లకు అతడు బయలుదేరాడు. శుక్రుని దగ్గర అనుమతి తీసుకొన్నాడు. దేవయాని దగ్గరకు వెళ్ళాడు. ఆమె మనస్సులోని మాట చెప్పింది. కచుడంగీకరించలేదు. గురుపుత్రి సోదరితో సమానమన్నాడు. దేవయాని అభిమానం దెబ్బతిన్నది. "నీవే నేర్చుకొన్న మృతసంజీవని విద్య నీకు పనిచేయకుండుగాక" అంది. అపుడు కచుడన్నాడు "నేను ధర్మం తప్పలేదు. ఈ విద్య నాచే నేర్చుకొన్నవారు ప్రయోగిస్తే పనిచేస్తుంది. నీవు మాత్రం అధర్మంగా వ్యవహరించావు. కాబట్టి నిన్ను బ్రాహ్మణుడు పెళ్ళాడకుండుగాక"... అని వెళ్ళిపోయాడు.

ఇక్కడ కచుడు కార్యార్థియై వచ్చాడు. అతననుకొన్నది సాధించాడు, వెళ్ళిపోయాడు. దేవయాని కచుని మీద మనసుపడింది. మనువాడ నిశ్చయించింది. కచుడు కాదన్నాడు. పైగా ధర్మసూక్ష్మం చెప్పాడు. దేవయాని మనోరథం తీరలేదు. కచుని కార్యం నెరవేరింది. అతని ఆ కార్యం నెరవేరరాదు. కక్ష తీర్చుకోవాలనుకొంది. అందుకే శాపమిచ్చింది. కాని ఆ శాపాన్ని నేర్పుగా తిప్పుకొని మృతసంజీవని విద్య దేవతలకు తెలిసేట్టు చేశాడు కచుడు. అంతవరకు దేవయాని అడిగి కాదనిపించుకొన్నదేదీ లేదు. కచుని మీద ఆమెకు నిగ్రహించుకోలేనంత ఆగ్రహం వచ్చింది. ఇచ్చిన శాపం వెనక కూడ ఆలోచన ఉంది. నేర్చుకొన్న విద్య పనిచేయకపోతే ఎక్కడికి పోతాడు తన తండ్రి దగ్గరే ఉంటాడనుకొంది. కాని తానొకటి తలిస్తే దైవమొకటి తలిచినట్లయ్యింది.

వృషపర్వుని కూతురు శర్మిష్ఠ దేవయాని. ఆమె, పరిచారికలతో కలిసి వనవిహారం చేసి జలవిహారానికై సరస్సులో దిగారు. వాళ్ళు స్నానాలు చేస్తున్నారు. సుడిగాలి రేగింది. చీరలు చిందరవందర అయ్యాయి. ఆ తొందరలో దేవయాని చీర శర్మిష్ఠ కట్టుకొంది. శర్మిష్ఠ చీర దేవయాని కట్టుకోడానికి ఇష్టపడలేదు. పైగా బ్రాహ్మణ బాలికను నేను నీ మైల చీర కట్టుకోను అంది. 'మా అయ్య దగ్గర మీ అయ్య నౌకరీ చేస్తున్నాడు' అంది శర్మిష్ఠ. అయినా దేవయాని వినలేదు. శర్మిష్ఠ చీర అడ్డాదిడ్డం చుట్టుకొని దేవయాని వాదిస్తూనే ఉంది. శర్మిష్ఠ దేవయానిని

పాడుబడ్డ బావిలో త్రోసివేసింది. దేవయాని తలచుకొంటే పైకి వచ్చేది కాని తనను బావిలోంచి తీసిన సాక్ష్యం ఒకటి కావాలి. అందుకే చాలాసేపు బావిలో ఉంది. అదేదారిన యయాతి వచ్చాడు. ఆమె ఏడ్పు విన్నాడు. బయటకు తీశాడు. ఇక్కడ తీయడమంటే లోనికి దిగి ఎంతో కష్టపడి ఆమెను తీయడం కాదు. ఒడ్డుమీద ఉన్నాడు. చేయి పట్టి లాగాడు. అంతే దేవయానికి సాక్ష్యం లభించింది. ఘూర్ణిక అనే పరిచారిక దేవయానిని వెతుకుతూ వచ్చింది. దేవయాని వృషపర్వుపురంలోనికి రానంది. ఇక శుక్రుడే దేవయానిని అనుసరించాడు.

ఇక్కడ కథగాని మలుపు తిరగకపోతే ఆ తండ్రీ కూతుళ్ళు మరెక్కడికో వెళ్ళేవారే! కాని వృషపర్వుడే దిగి వచ్చాడు. శుక్రుణ్ణి వేడుకొన్నాడు. తన రాజ్యాన్ని విడిచిపోవద్దన్నాడు. నా పట్టింపేం లేదు; దేవయాని కోరిక తీర్చమన్నాడు శుక్రుడు. ఇంకేం దేవయాని కోరిన విధంగా తన కూతురు శర్మిష్ఠను ఆమె పరిచారికల్ని దేవయానికి దాసీలుగా సమర్పించాడు.

మా అయ్య దగ్గర మీ అయ్య నౌకరీ చేస్తున్నాడన్న మాటకు, తనను బావిలో త్రోసిన నేరానికి శర్మిష్ఠను జీవితాంతం దాసీగా చేసుకొంది. దేవయాని తన పంతం నెగ్గించుకొంది. తనంటేయేంటో 'తడాఖా' చూపించింది. దేవయానిదెంత ప్రతీకార మనస్తత్వం. ఒక్క దెబ్బకు వెయ్యి దెబ్బలు తీసుకొంది. అంతేకాదు. శర్మిష్ఠను చావుదెబ్బ కొట్టింది.

శర్మిష్ఠ దాసీ అయ్యాక దేవయాని తానెంతోఎత్తు ఎదిగినట్టు భావించింది. దర్పంతో ఆ దాసీ జనం మీద అధికారం చెలాయించింది. వారినందరినీ తీసుకొని వనవిహారాలకు జలవిహారాలకు వెళ్ళేది. ఒకనాడు అరణ్యానికి వచ్చిన యయాతిని చూచింది. కచుని శాపం ఎక్కడో అంతరాంతరాల్లో మెదలుతూనే ఉంది. ఇక అది తప్పదనుకొంది. అందుకే యయాతిని అడిగింది.

"ఆ రోజు నన్ను బావిలోనుండి తీసేటప్పుడు నీ కుడిచేతితో నా కుడిచేతిని పట్టుకొన్నావు. మనకారోజే పెళ్ళయిపోయినట్టు లెక్క'' అంది. "ధర్మాధర్మాలు తెలిసిన శుక్రుడు అంగీకరిస్తే నాకేమభ్యంతరం లేదు'' అన్నాడు. యయాతి దేవయాని కొరకు ధర్మశాస్త్రాన్నయినా తిరిగి రాస్తాడు శుక్రుడు. ఇంకేం స్వయంగా అక్కడికే వచ్చి 'ధర్మ విరోధమేమి లేదన్నాడు' పెళ్ళయిపోయింది; పిల్లలూ పుట్టారు.

ఈ సందర్భంలో యయాతి జీవితంలో శర్మిష్ఠ ప్రవేశించింది. అశోకవనంలోని గృహంలో ఆమె ఉండేది. యయాతిని ఒప్పించడానికి ఆమె కూడ ధర్మశాస్త్రాన్ని వల్లించింది. శర్మిష్ఠ సంతానవతి అయ్యింది. ఒక్కరిద్దరు కాదు, ముగ్గురు పిల్లలు. శర్మిష్ఠ మొదట సంతానవతి అయినపుడు దేవయాని అడిగింది. ఒక మునివరం వల్ల కలిగారని శర్మిష్ఠ అంది. అప్పుడు దేవయాని పెద్దగా పట్టించుకోలేదు. కాని ముగ్గురు పిల్లలు యయాతిలాగా కనిపించడంతో దేవయాని యయాతినే అడిగింది. యయాతి సమాధానం చెప్పలేదు. దేవయానిలో అతృత,

ఏంటీ చిక్కుముడి, ముడివిడివడదే, పిల్లల్నే అడిగింది. పిల్లలు యయాతి శర్మిష్ఠల్ని తమ తల్లిదండ్రులుగా చూపించారు.

అగ్ని పర్వతం బద్దలయ్యింది. సప్త సముద్రాలు ఆకాశం ఎత్తు ఎగిశాయి. భూకంపం పుట్టింది. గ్రహాలు గతులు తప్పాయి. భూనభోంతరాల్లో ప్రతిధ్వనించే హాహాకారాలు పుట్టాయి. ఇవన్నీ ఎక్కడో పుట్టలేదు; దేవయాని మనస్సులో పుట్టాయి. కళ్ళు నిప్పులు కురిశాయి; నీళ్ళు పారాయి.

ఇక్కడ శర్మిష్ఠ స్థానంలో మరొకరు ఉంటే దేవయానికంత బాధ కలిగేది కాదు. తాను ఏ శర్మిష్ఠనైతే జీవితాంతం దాసీగా పొందిందో, ఆ దాసీ దానికి తనంత స్థానమిచ్చాడు తన భర్త. అందుకే ఆమె ఉడికిపోయింది. ఉసూరుమంది. తండ్రి దగ్గరకు పయనం కట్టింది. మహావేగంతో వెళ్ళిపోయింది. దేవయాని మనస్తత్వం యయాతికి తెలుసు. అందువల్ల అతడు కూడా వెనువెంటనే ఆమెను అనుసరించాడు. అప్పటికే దేవయాని భర్త అనుచిత కార్యాన్ని తండ్రితో చెప్పేసింది. కంటికి కడివెడుగా ఏడ్చింది. శుక్రుడు కూతురు దుఃఖం చూడలేకపోయాడు. వెనకా ముందు చూడకుండా యయాతికి శాపం ఇచ్చాడు. యయాతి అప్పటికే చేతులు జోడించి శుక్రుని ముందు నిలబడ్డాడు. కాని శుక్రుని శాపం తగలనే తగిలింది. యౌవన మదంతో అనుచితంగా వ్యవహరించాడని భావించిన యయాతికి వృద్ధాప్యం ప్రసాదించాడు. కూతురు మీద ఎంత ప్రేమ ఉన్నా యయాతికిలాంటి శాపమా!

కొందరు రాజులు బహుపత్నీకులుగా ఉండడం ఆనాడు సహజాతి సహజం. ఒక సహజవాతావరణాన్ని అసహజంగా మార్చివేసింది దేవయాని. ఆమె ఆవేశం, అహం, అభిమానం, ఆ విధంగా అనర్థదాయకమయింది. తనకు జీవితాంతం దాసీగా ఉండవలసిన శర్మిష్ఠ తనంతదైపోయిందన్న "షాక్"తో ఆమె ఎంతో ఆవేశపడిందో ఎంత తొందరపడిందో ఆమెకే తెలియదు. భవిష్యత్ పరిణామాల గురించి ఆలోచించనే లేదు. "చేసుకొన్న వాళ్ళకు చేసుకొన్నంత మహదేవా" అన్నట్టయింది.

శాపగ్రస్థుడైన తండ్రికి శర్మిష్ఠ చివరి కొడుకైన పూరుడు తోడ్పడ్డాడు. ఆ తర్వాత పూరుడే రాజ్యాధికారి అయ్యాడు. అతని పేరిటనే కురువంశీయులకు పౌరవులనీ, పౌరవ వంశీయులని పేరు కూడా వచ్చింది. దేవయాని కుమారులు కూడా సాధారణ సామంత రాజులైనా చక్రవర్తిత్వం మాత్రం దక్కలేదు.

మొత్తం మీద దేవయాని చుట్టూరా జరిగిన ప్రతి సన్నివేశానికి, సంఘటనకూ దేవయానే కారకురాలు. మంచి జరిగిందా చెడు జరిగిందా అనేది అప్రస్తుతం. కాని ఆమె స్వాభిమానం, స్వాతంత్ర్యం, సాహంకారం సమస్యల్ని సృష్టించింది. సంతాపాన్ని జ్వలించింది. శర్మిష్ఠపై పాఠకునికి సానుభూతి కలిగేట్లు చేసింది.

# 5. కపటి కద్రువ - వినీత వినత

కశ్యపునికి ఎందరో భార్యలు, వాళ్ళంతా ధరణీదక్షుల కూతుళ్ళే. దక్షుడు ఒక్కొక్క అల్లునికి ఒకరిని మించి ఇచ్చాడు. అందులో కశ్యపునికి అదితిని, దితిని, కద్రువను, వినతను ఇచ్చి పెళ్ళి చేశాడు. ఒక పురుషుడు ఒకరిని మించి పెళ్ళి చేసుకోవడం వల్ల కొన్ని సామాజిక ప్రయోజనాలు నెరవేరినా కుటుంబాల్లో కలతలు మనస్పర్ధలూ కూడా పెరిగాయి అన్నది సత్యం. అయితే చాలా మందిని పెళ్ళి చేసుకోవడం అనేది నూటికో కోటికో ఏ ఒక్కరిద్దరికో చెల్లింది. ఆ ఒకరిద్దరి కథలు పది మందిలో నాని గ్రంథాలకెక్కి కూచున్నాయి. అలాగే కశ్యపుని భార్యలైన కద్రూవినతల గాథ కూడా భారతాదిపర్వంలో చోటు చేసుకొంది.

ఇద్దరూ అక్క చెల్లెండ్రే అయినా ఇద్దరి మనస్తత్వాలు పూర్తి భిన్నంగా ఉన్నాయి. వారి వారి మనస్తత్వాలకనుగుణంగానే వారిసంతానాలు తయారయ్యాయి. ఆయా పరిస్థితులకనుగుణంగా కొందరిలో మార్పులు వచ్చాయి. పొరపాట్లు మానవ జీవితంలో సహజమే అయినా తాబట్టిన కుందేలుకు మూడే కాళ్ళు అనే మనస్తత్వాల వల్ల చీలికలు వస్తాయి. తప్పును సరిదిద్దుకోక పోవడమే కాకుండా పైగా సమర్థించుకొనే ప్రయత్నం చేసి సౌమ్యుల్ని సజ్జనుల్నీ అణగద్రొక్కే యత్నాల్లో తాత్కాలిక విజయం సాధించి పెత్తనం చలాయించడం చూస్తే, బాధల్లో ఇరుక్కొన్న వారి వైపు సహజంగా మొగ్గిపోతాడు పాఠకుడు.

ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకొని కద్రూవినతల జీవితాల్ని పరిశీలిస్తే కద్రువ కపటి అని వినత వినీత అని తేలిపోతుంది.

ఆ రోజు వినత, కద్రువలిద్దరు సముద్రం ఒడ్డుకు విహారానికి వెళ్ళారు. రోజూవచ్చేవారే; ఆ రోజూ వచ్చారు. అప్పుడప్పుడు కనిపిస్తున్న ఇంద్రాశ్వం ఉచ్చైశ్రవం ఆ రోజూ కనిపించింది. 'ఆహా గుర్రం ఎంత తెల్లగా ఉంది' అంది వినత. 'తోక నల్లగా ఉంది' అంది కద్రువ. 'నీవే కన్నులతో చూశావో' అంది వినత. 'ఆ గుర్రం శరీరంలో నల్లదనముంటే నీవు నాకు దాసీవి కావాలి; లేదా నేను నీకు దాసినవుతాను పందెం' అంది కద్రువ. సరే దగ్గరకు వెళ్ళి చూద్దాం పద' అంది వినత. 'ఈ రోజు పొద్దుపోయింది. రేపు వచ్చి చూద్దాం' అంది కద్రువ. సరే అంది వినత.

ఆ రోజు రాత్రి తన కొడుకులను పిలిచి సంగతి చెప్పి, గుఱ్ఱం తోక నల్లగా కనిపించేటట్టు చేయండన్నది. అది అధర్మం అని అంగీకరించలేదు పాములు. జనమేజయుడు చేయబోయే సర్పయాగంలో చావండని కొడుకులకే శాపమిచ్చింది కద్రువ. తానాడిన అబద్ధాన్ని నిజంగా నిరూపించాలనే తాపత్రయంతో కొడుకులనే బలిపెట్టింది కద్రువ. కర్కోటకుడనే కొడుకు తల్లి శాపానికి భయపడి ఆమె చెప్పిన పని చేశాడు. పాము, గుఱ్ఱం తోకను చుట్టుకోవడం వల్ల తోక కొంత నల్లగా కనిపించింది, నమ్మింది వినత; కద్రువకు దాసి అయ్యింది. ఆ రోజు నుండి ఆమె కొడుకులకూ ఆమెకు సేవలు చేస్తూ ఉంది.

ఈ సంఘటనకు తెర వెనుక కథ కొంత ఉంది. ప్రపంచంలోని ఏ పౌరాణిక సాహిత్యంలో అయినా కొన్ని అంతరార్థాలూ కొన్ని అతిశయోక్తులూ ఉంటాయి. ఆ కథల్లోని స్త్రీల వ్యవహారాలూ, ప్రవర్తనలూ, మనస్తత్వాలే ప్రధానంగా చర్చించుకొంటున్నాం. కాబట్టి అంతరార్థాల్ని అతిశయోక్తుల్ని స్పృశించడం లేదు. కౌరవ పాండవుల కథకు బీజరూపంగా నాగ గరుడోపాఖ్యానం కనిపిస్తోంది. అంతరార్థాలు పెద్దలు తేల్చాల్సి ఉంది.

కద్రువకెందరో కొడుకులు పుట్టారు. వినతకు రెండు గుడ్లు పుట్టాయి, ఎన్నాళ్లకూ ఏ గుడ్డూ పగలలేదు. వినత విసిగింది. ఓ గుడ్డును ఒలిచింది. ఊరువులు తయారు కాని అనూరుడు బయట పడ్డాడు. ఆత్రపడ్డందుకు కద్రువకు దాసీగా బతుకుపో అని శాపమిచ్చాడు. వినత విచారించింది. రెండో గుడ్డులో సహజంగా పుట్టే కొడుకు ఆ శాపాన్ని తీరుస్తాడని వెళ్ళిపోయాడు. ఇక ఆ రెండో అండం నుండి సహజంగా పుట్టిన కొడుకే గరుడుడు.

తల్లి కద్రువకు నాగులకు సేవలు చేస్తున్నట్టుగానే దాసీ కొడుకుగా గరుడునికీ కంచి గరుడ సేవ తప్పలేదు. ఓనాడు పాముల్ని ఆకాశమంత ఎత్తు తీసుకొని వెళ్ళాడు గరుడుడు. సూర్య రశ్మివేడికి మలమల మాడాయి పాములు. కద్రువ నానా మాటలంది గురుడుణ్ణి. 'ఈ బానిస బతుకు వచ్చిందెట్టా, పోయేదెట్టా, అని తల్లిని అడిగాడు గరుడుడు. తల్లి కథంతా చెప్పింది.

మాతృదాస్య విమోచనార్థం తన ప్రాణాన్నయినా ఇవ్వడానికి సిద్ధపడ్డాడు గరుడుడు. మాయమ్మ బానిసత్వం పోవాలంటే నన్నేం తెచ్చివ్వమంటారు చెప్పండి అని నాగుల్ని అడిగాడు. అమృతం తెచ్చివ్వమన్నాయి నాగులు. ఇంద్రుణ్ణి జయించి అమృతం తెచ్చి యిచ్చి మాతృదాస్య విమోచనం చేశాడు గరుడుడు.

మహాభారతంలో కద్రూ వినతల కథ ఇంతే. కద్రువ వినతను దాసీ చేసుకుంది. ఇదేం ఒప్పందం అని వారినెవ్వరూ ఏమీ అనలేదు. అటు తండ్రి గాని, ఇటు భర్త గాని ఆమెను వారించలేదు. కాలమే సమాధానం చెబుతుందనుకొన్నారేమో! కద్రువ వినత కన్నా సహజంగా పెద్దది. పైగా కొడుకుల భుజబలం తనకు అండ, అనుకొంటున్నది. కాని ఆ కొడుకులే మాట విననప్పుడు శపించింది. ఆ తర్వాత కొడుకుల మీద ఆమె పట్టుపోయింది. లేకపోతే గరుడుడు నాగులతో ఒప్పందం కుదుర్చుకొనే వాడు కాదు.

తల్లుల పందెం కొడుకుల ఒప్పందం ఇది అతి సహజ పరిణామం. తల్లి చేసిన పని తప్పని తెలిసిన తనయులైనా వినత దాసీత్వాన్ని, గరుడుని సేవల్ని స్వీకరించకుండా ఉండాల్సింది. కాని వారితో కావాల్సినన్ని పనులు చేయించుకొన్నారు. పైగా బానిసత్వ నిర్మూలనార్థం అమృతమే అనుభవించాలనుకొన్నారు. నోటి దగ్గరికి వచ్చిన అమృతమే నోట్లోకి పోకముందే ఇంద్రుడెగరేసుకుపోయాడు. రెండు నాల్కల ధోరణితో వ్యవహరించి నిజంగానే ప్రమాదాన్ని కొని తెచ్చుకొన్నాయి నాగులు.

మొత్తం మీద వినయశీలగా సత్యశీలగా వ్యవహరించిన వినత మొట్టమొదట అనేక కష్టాలకు గురైనా కన్నకడుపు కార్యదీక్షతో కష్టాల కడలి కడముట్టింది. "అబద్ధం కానీ సుబద్ధం కానీ కుంతీ పుత్రుడు వినాయకుడంటాను" అన్న సామెతగా కపటి కద్రువ వ్యవహరించి నాగమాతనామాన్ని సార్థకం చేసుకొంది.

## 6. మేధానిధి మేనక

మేనక పాత్ర శివపురాణంలో బ్రహ్మాండ పురాణంలో కనిపించాలి గాని, మహాభారతంలో కనిపించడమేంటి అని కొందరు విస్తుపోతారు. కొద్ది దృష్టి వెనక్కు సారిస్తే భారత వీరుల పూర్వీకుల్లో భరతుడు, అతని తల్లి శకుంతల, ఆమె తల్లి మేనక కళ్ళ ముందు సాక్షాత్కరిస్తారు. మేనక అలా మెరిసి మాయమవుతుంది. భారతంలో కాని ఇతర గ్రంథాల్లో గానీ దేవలోకాలలో అప్సరసగా, హిమవంతుని భార్యగా, పార్వతికి తల్లిగా, పరమశివునికి అత్తగా ఈమె ఎంతో ఉచితంగా వ్యవహరించిన ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి.

భారతంలో కూడా మేనక ఇద్దరికి తల్లి అయ్యింది. విశ్వావసుడనే గంధర్వ రాజు వల్ల ప్రమద్వరను, విశ్వామిత్రుని వల్ల శకుంతలను కన్నది. ఈ ఇరువురిని వదలిపెట్టి మళ్లీ దేవేంద్రుని కొలువు కూటానికి వెళ్లింది. మేక దేవేంద్రుని చేతుల్లో కీలుబొమ్మ అని కొందరు వాదించవచ్చు. రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ, మొదలైన ఈ అప్సరసలంతా దేవరాజు దగ్గర కొలువు చేస్తున్నారు. అతని అధికారానికి ముప్పు వచ్చిన అనేక సందర్భాలలో లేదా ముప్పువచ్చిందని భావించిన సమయాల్లో వీరు అతణ్ణి ఆదుకొన్నారు. అయితే సంతానాన్ని వదిలి వెళ్ళిపోవడమేంటి అనే ప్రశ్న రావచ్చు. ఆదుకోడానికి వాళ్ళనే ఎందుకు ఉపయోగించాలి అని ఎద్దేవగా అడగవచ్చు.

నిజమే సాఫీగా సాగని కొన్ని జీవితాలు అనేక సందేహాలకు తావిస్తాయి. కొన్ని సమాధానాలు కేవలం సమర్థించడానికే అన్నట్టుగా ఉండి ప్రాశ్నికునికి తృప్తి ఇవ్వకపోవచ్చు. అయినా ఆ కథలో ఆ పాత్రకున్న ప్రయోజనాన్ని ఆ పాత్ర మనస్తత్వాన్ని ఆ పాత్ర ఆ తర్వాతి తరాలకు అందిస్తున్న సందేశాన్ని విశ్లేషించినప్పుడు, వివరించినప్పుడు ఆలోచనాశీలురు ఆహా- ఓహో అనకుండా ఉండలేరు.

మేనక విశ్వాసులకు ప్రమద్వర జన్మించడం, ఆ ప్రమద్వరను వదిలి ఆమె వెళ్ళిపోవడం, ప్రమద్వర స్థూలకేశుడనే ముని ఆశ్రమంలో పెరగడం, ఆమెను రురుడు వరించి పెళ్ళి చేసుకోవడం అతి సహజంగా జరిగిన పరిణామాలు. అదే విధంగా మేనక విశ్వామిత్రులకు శకుంతల జన్మించడం,శకుంతలను వదిలి మేనక వెళ్ళిపోవడం,శకుంతలను కణ్వ మహాముని పెంచి పోషించి విద్యా బుద్ధులు చెప్పించడం, శకుంతలా దుష్యంతుల గాంధర్వ వివాహం, భరతుని జననం, సాంసారిక వైచిత్రి, లోక ప్రవృత్తి, మానవ మనస్తత్వ వికృతి - ప్రకృతి -

సంస్కృతి, ఒక్కటేమిటి అన్ని ఒక మహాగాథగా ఆవిర్భవించడం, అతి క్లిష్టంగా జరిగినట్లనిపించిన సంఘటనలు. (అయితే తాను వెళ్లిపోయాక ఆ తర్వాత తన సంతానాన్ని గురించి మేనక ఏ మాత్రం పట్టించుకోలేదు. కాళిదాసు కల్పనలో తప్ప).

పట్టించుకోవాల్సిన అవసరం ఆమెకు లేదు. ఆమె తన కర్తవ్యాన్ని నిర్వర్తించి వెళ్ళిపోయింది. అంతే, తన సామ్రాజ్యం ప్రశాంతంగా ఉండాలి; తనఅధికార పీఠం భద్రంగా ఉండాలి; ఇది దేవేంద్రుని ఆలోచన. అధికార పీఠ భద్రతకు రాజ్య ప్రశాంతతకు నాడైనా నేడైనా అవినాభావ సంబంధముంది. రాజ్యంలో ప్రశాంతి ఉంటే దేశంలోని ప్రజల ధనమాన ప్రాణాలకు రక్షణ ఉంటుంది. ఆ రక్షణ కొరకు సమర్ధవంతంగా పరిపాలన చేయడం పాలకుల ధర్మం. ఆ ధర్మాన్ని దృష్టిలో ఉంచుకొనే దేవరాజు వ్యవహరించాడు.

కేవలం మేనకను ఒక వ్యక్తిగా తీసుకొని పరిశీలించినపుడు దేవరాజు ఈ చర్య అమానుషమనిపిస్తుంది. తన అందచందాలతో, తళుకు బెళుకులతో ఒక శక్తిపరుణ్ణి భ్రష్టుని చేసి, అతని దీక్షను, ప్రక్కదారులు తొక్కించి వెళ్ళిపోవడం అనుచితమే అనిపిస్తుంది. కాని రాష్ట్ర శ్రేయస్సు దృష్ట్యా, ప్రజా సంక్షేమ దృష్ట్యా అప్పుడప్పుడీ దారి తొక్కడం అధికారులకు తప్పదు.

ఆధునిక కాలంలో అమెరికా నుండి విముక్తి పొందడానికి వియత్నాం ఎంత మంది మేనకలను ప్రయోగించిందో పరిశీలిస్తేతెలుస్తుంది. కరుడు గట్టిన దేశభక్తితో తమ సర్వస్వాన్ని ధారపోసి అమెరికా సైన్య రహస్యాల్ని తెలుసుకోవడంలో వారు చూపించిన నేర్పు ఓర్పు 'నభూతో నభవిష్యతి' అని ప్రశంసింపబడ్డది. చైనా కమ్యూనిస్టుల వశమయ్యాక వేలాది మంది యువతుల్ని విదేశాల్లో కూడా గూఢచారి కార్యక్రమాల్లో నియోగించడం అనేది దాచేస్తే దాగని సత్యం.

ఒకనాడు దేశ శ్రేయస్సు దృష్ట్యా ప్రయోగింపబడ్డ మేనకలు, ఇవాళ సి.ఐ.ఏ ద్వారా, కె.జి.బి. ద్వారా అవతలి దేశరహస్యాలు తెలుసుకోవడానికి ప్రయోగింపబడటం నాటికీ నేటికీ ఉన్న వ్యత్యాసం. ఇదేంటి అని ప్రశ్నిస్తే ఇది మా దేశ శ్రేయస్సు దృష్ట్యా మేము అవలంభిస్తున్న పథకం అంటారేమో కాని ఆనాటి మేనకకు భద్రత ఉన్నది. నేటి మేనకకు అది లేదు. ఆనాటి మేనక అది తన ధర్మంగా భావిస్తే, నేటి మేనక జీతపు రాళ్ళ కొరకు చేసే పనిగా భావిస్తుంది.

రాజర్షియైన విశ్వామిత్రుడు దేవ సామ్రాజ్యం మీద దృష్టి పెట్టుకొని తపస్సు చేస్తున్నాడని అపోహపడ్డ దేవేంద్రుడు మేనకను ప్రయోగించాడు; అంతే! తన ధర్మం నెరవేర్చాక ఇక మేనక అక్కడ ఉండలేదు. శారీరక బంధాల్ని త్రెంచేసి హృదయ స్పందనల్ని నిలిపేసి మనస్సుకే ప్రాధాన్యం ఇచ్చిన మేనక నిజంగా మేధానిధి.

## 7. సత్యవాది సరమ

మహాభారతంలో కొంత మంది స్త్రీలు అలా మెరపుల్లా కనిపించి మాయమవుతారు. వారు ఉన్నా లేకున్నా కథాగమనానికి పెద్ద ఆటంకమేం ఉండదు. అవి స్వల్ప పాత్రలే అయినా స్త్రీ వ్యక్తిత్వ ప్రదర్శనలో వ్యవహరించిన తీరు మాత్రం ఆదర్శనీయం. ఆ పాత్రలో సరమ ఒకరు.

జనమేజయుడు రాజ్యపాలన చేస్తున్నపుడు ఓ సంఘటన జరిగింది. సరమ కుమారుడు సారమేయుడు క్రీడార్థం అటూ ఇటూ తిరుగుతూంటే జనమేజయుని తమ్ముాలు శ్రుతసేన, భీమసేన, ఉగ్రసేనలు అతణ్ణి బాగా కొడతారు. సారమేయుడు పరుగెత్తుకొని వెళ్లి తల్లికి సంగతి చెబుతాడు. ఆమె కోపంతో జనమేజయుని దగ్గరకు వస్తుంది.

"ఏ తప్పు చేయని నా కుమారుణ్ణి నీ తమ్ముాలుదయలేని వారై, బుద్ధిలేని వారై దండించారు. ఇది తగినది. ఇది తగనిది అని ఆలోచించకుండా పేదవారికి కీడు చేసే దుర్మార్గులు తగిన ఫలం అనుభవిస్తారు" అని అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

భారతంలో సరమ పాత్ర ఇంతే! కానీ రాజునైనా ఎదిరించి మాటాడి బుద్ధి చెప్పే వ్యక్తిత్వం, ఆనాటి సామాన్య స్త్రీలకు కూడా ఉండిందని తెలుస్తోంది. రాజును అంతలేసిమాటలనడానికి ఎంత ధైర్యం కావాలి. ఆమె ఆ మాటలని వెళ్ళిన తర్వాత జనమేజయుడు ఉచిత రీతిని వ్యవహరించాడు. అంటేఒక రాజుకు కూడా మార్గోపదేశం చేసే వ్యక్తిత్వం ఆనాటి సాధారణ స్త్రీకి కూడా ఉందని ఈ సరమ పాత్ర తెలియజేస్తుంది.

## 8. ధర్మవాదిని జరత్కారువు

జనమేజయుడు చేసిన సర్పయాగాన్ని మాన్పించిన వాడు ఆస్తీకుడు. ఇతని తల్లిదండ్రులిద్దరి పేర్లు ఒక్కటే జరత్కారువు. తండ్రి మహా మేధావి మహర్షి. తల్లి కద్రువ కూతురు వాసుకి చెల్లెలు. అన్న కోరిక మీదనే ఆమెఅతణ్ణి పెళ్లి చేసుకుంది. జీవితాంతం బ్రహ్మచారిగా ఉండి ఆశ్రమాల్లోనే కాలం గడపాలనుకొన్న జరత్కారుడు. తన పేరు గల సద్గుణశీల లభించినప్పుడు వంశవృక్షం నిలపడానికి మాత్రమే పెళ్లి చేసుకొన్నాడు. ఏదో ఒక నెపం మీద భార్యను వదిలి వెళ్లిపోవాలనే ఉంది అతనికి.

అందుకనే మొదటి రోజే నీ వల్ల నాకెలాంటి అవమానం జరిగినా వెళ్లిపోతాను అన్నాడు. జరత్కారువు చాలా జాగ్రత్తగా మెలగింది. వారి దాంపత్య జీవితం చిగురించింది. ఆమె గర్భవతి అయ్యింది. ఒకనాడు సంధ్యా సమయం వరకతడు నిద్రిస్తూనే ఉన్నాడు. ఆమె తొడపైన అతని తల ఉంది. సంధ్యాకాలంలో చేయాల్సిన ధర్మ కార్యాలకు ఏనాడు ఆటంకం కలగరాదు. అలా కలిగితే ధర్మలోపమవుతుంది. భర్త కోపగించినా సరే ధర్మలోపం

మాత్రం జరగరాదనుకుంది జరత్కారువు. అందుకే అతణ్ణి నిద్రలేపింది. ఆఫీసుకు వెళ్లాల్సిన భర్త అదే పనిగా నిద్రపోతుంటే ఈ కాలపు భార్య మేల్కొలిపినట్లు అంతే!

ఆమె ధర్మనిష్ఠను జరత్కారుడు అవమానంగా భావించాడు. 'తుమ్మితే ఊడిపోయే ముక్కెన్నాళ్లుంటుంది?' అతనికి కావల్సింది ఏదో ఒక నెపం. అదీ నెపం కాని నెపం.

"నేను మేల్కొనే వరకు ఆ సూర్యుడస్తమించేవాడా! నీవు నాకు అవమానం చేశావు. అందువల్ల నేను వెళ్లిపోతున్నాను. నీవు నీయన్న దగ్గర ఉండు. మహా మేధావి అయ్యే కొడుకు పుడతాడు. వాణ్ణి అభివృద్ధిలోకి తీసుకొని రా! ఆమెను అన్నకు అప్పగింతలు చెప్పి, ఈ విడాకులు శాశ్వతం సుమా!" అనేశాడు.

మహాభారతంలో జరత్కారువు కథ ఇంతే. నిద్రలేపడమనే కారణంగా భర్త శాశ్వతంగా వెళ్లిపోతే! పోతే పోయాడు కాని ధర్మకార్యం మిన్న అని భావించింది జరత్కారువు. సరిగ్గా చెప్పాలంటే భర్త కన్న ధర్మం మిన్న అని భావించిది. చిన్న పాత్ర అయితేనేం ఎంత పెద్ద సందేశాన్ని అందించింది.

## 9. మృత్యుంజయి సావిత్రి

సైంధవుని కారణంగా ద్రౌపది అరణ్యవాసంలో మరోసారి ప్రమాదంలో పడింది. భీమార్జునుల శక్తి ముందు సైంధవుడు నిలవలేక పోయాడు; బంధితుడయ్యాడు; కాని ధర్మరాజు క్షమాభిక్ష కారణంగా సైంధవుడు బ్రతుకు జీవుడా అని వెళ్లిపోయాడు. ద్రౌపది లాగా ఈ విధంగా అరణ్యంలో అష్ట కష్టాలకు గురైన వారెవరైనా ఉన్నారా అని ధర్మరాజు ఋషులనడిగాడు. వారు సతీ సావిత్రి కథ చెప్పారు. క్లుప్తంగా కథ ఇది.

మద్రదేశాన్ని అశ్వపతి మహారాజు పరిపాలిస్తున్నాడు. ఆయనకు, గాయత్రీ మంత్రానుష్ఠానం వల్ల చాలా కాలానికి, సావిత్రీ దేవి వరప్రసాదంగా సావిత్రి అనే అమ్మాయి కలిగింది. అశ్వపతి భార్య మాళవి; ఆమెను అల్లారు ముద్దుగా పెంచింది. సావిత్రి సౌజన్యవతి - సౌందర్యవతి - విద్యావతి. ఆమె దేశమంతా తిరిగి తీర్థయాత్రలు చేసి వచ్చింది. ఆ సమయంలోనే సాళ్వ దేశాన్ని పరిపాలిస్తున్న ద్యుమత్సేనుడు శత్రువుల వల్ల అడవుల పాలు కావడం, తన భార్యతో, కొడుకు సత్యవంతునితో ఆయన అరణ్యంలో చిన్న ఆశ్రమం ఏర్పాటు చేసుకొని జీవిస్తుండడం తెలుసుకొన్నది. స్వయంగా సత్యవంతుని సద్గుణాలకు కదలిపోయి అతణ్ణి వరించానని చెప్పేసింది. సత్యవంతుని తేజస్వితను నారదుడూ ప్రశంసించాడు. ద్యుమత్సేనుడు మరీ మరీ అడగడంతో అతని ఆయుర్దాయం మాత్రం ఇక సంవత్సరమే ఉందన్నాడు. తండ్రి సావిత్రితో మరెవరినైనా వరించవలసిందని కోరాడు. అప్పుడు సావిత్రి ఇలా అన్నది.

"నా నిర్ణయం మారదు. నేను వరించిన వాడు గుణవంతుడైనా కాకపోయినా, పూర్ణాయుష్కుడైనా కాకపోయినా అతనే నా భర్త. నా మనో నిశ్చయం మారదు; మనస్సు వ్యక్తికి పరమ ప్రమాణం. నా అభిప్రాయాన్ని మార్చడానికి ప్రయత్నించకండి" అని సావిత్రి సూటిగా చెప్పింది. ఇక అశ్వపతి ప్రయత్నాలు ప్రారంభించాడు.

రాజ్యాన్ని కోల్పోయిన అంధరాజు ద్యుమత్సేనుడు. అరణ్యంలో ఉన్నాడు. సత్యవంతుని అల్పాయుష్కత తెలిసినా సావిత్రి ఇష్టం మేరకు అశ్వపతి అరణ్యానికి వెళ్ళి ద్యుమత్సేనుణ్ణి ఒప్పించి సావిత్రీ సత్యవంతుల వివాహం జరిపించాడు.

వివాహం జరిగినప్పటి నుండి సావిత్రి రోజులు లెక్కపెడుతున్నది. ఆత్మశక్తి పెంచుకొంటున్నది. సత్యవంతుని మరణమిక నాలుగు రోజులుందనగా ఆమె ఉపవాస దీక్షతో వ్రతం ప్రారంభించింది. భర్త అడవికి వెళ్ళేప్పుడు అప్పుడప్పుడు ఆమె వెళుతుండేది. ఆ రోజు చివరి రోజు; సత్యవంతుడు ఇంత చిన్న పని కదా (కట్టెలు కొట్టడం) తన వెంట అవసరం లేదన్నాడు. ఈ రోజే మీకు తోడుగా ఉండవలసి ఉన్నది అని సావిత్రి సత్యవంతుణ్ణి అనుసరించింది. ఆమె నారదుడు చెప్పిన మంత్ర - వ్రత -జపతపాదులన్నీ ఈ మధ్య కాలంలో పాటించింది.

అరణ్యంలో సత్యవంతుడు గురు జనాలకు ఫలమూలాలు సేకరించి మూట గట్టాడు; ఇక కొన్ని కట్టెలు సమకూర్చుకొని వెళ్లాలి. గొడ్డలితో కట్టెలు కొడుతున్నాడు. తీవ్ర శిరోవేదనకు గురి అయి ఆ సంగతి సావిత్రికి చెప్పాడు. సావిత్రి సత్యవంతుని తలను తన ఒడిలోకి తీసుకొని ధ్యానమగ్నురాలై ఉంది. సత్యసత్త్వ గుణ సంపన్నుడైన సత్యవంతుని ప్రాణాలు తీసుకొని వెళ్లడానికి యముడే వచ్చాడు.

కాల ధర్మాన్ని పాటించవలసి ఉన్నదని తెలిపాడు. సావిత్రి దేవ్యంశలో జన్మించిన సంగతి తెలుసు. సావిత్రి కిరణం, ఆమె భర్త సత్యం, తాను చీకటి. ఆ చీకటిలోకి సత్యాన్ని లాగేశాడు. సత్యవంతుని ప్రాణం తీసుకొని యముడు బయల్దేరాడు. సావిత్రి అతణ్ణి అనుసరించింది. యముడువద్దన్నా వినలేదు. తన భర్త ప్రాణమెక్క[illegible]ంటే తానక్కడే ఉంటానన్నది. ఆమె పట్టుదలకు ముగ్ధుడై యముడు వరం కోరుకొమ్మన్నాడు.

"తన మామగారికి రాజ్యం ప్రసాదించుమంది; నేత్రదానం చేయుమంది" సావిత్రి. యముడామెకా వరం ప్రసాదించి, కదిలాడు. సావిత్రి అతణ్ణి అనుసరించడం మానలేదు. యముడు తనను అనుసరించరాదన్నాడు.

"ప్రభూ! భర్త సన్నిధిలో నాకు అలసట అనేదే ఉండదు. నా భర్త మీదగ్గర ఉన్నాడు. అయన ఎక్కడ ఉంటే నేనూ అక్కడే ఉండాలి గదా! వారిని మీరెక్కడ ఉంచుతారో నేనూ అక్కడే ఉంటాను. సత్పురుషసమాగమం అభీష్టాలు తీరుస్తుంది. వారి మైత్రి విడనాడకూడదు.

మీరు దివ్యులు; మీతో ఏర్పడ్డ ఈ మాత్రం మైత్రి కూడా వ్యర్థమవుతుందని నేననుకోవడం లేదు" అంది సావిత్రి.

"అమ్మాయీ! నీ మాటలు వినసొంపుగా ఉన్నాయి. నీవు సత్యవంతుని ప్రాణాలు తప్ప మరేమైన కోరుకో" అన్నాడు సంతోషంగా యముడు. అప్పుడుసావిత్రి తన తండ్రి వంశాభ్యుదయాన్ని ఆశించి ఆయనకు నూరుగురు కొడుకులు ప్రసాదించుమన్నది. "సరే ఇచ్చాను ఇక వెనుకకు మళ్లి పొమ్మ" - వెళ్లి నీ భర్త శవానికి అగ్ని సంస్కారాలు చేయమ్మా' ' అని కదిలాడు యముడు. సావిత్రి వెనక్కు మళ్లలేదు. అతణ్ణి అనుసరించడం మానలేదు.

"మీరు : ర్యనందనులు. ధర్మ మార్గాన యమనియమాలతో నడుస్తారు. అందుకే మిమ్మల్ని యమ ర్మరాజంటారు. మీకు సజ్జనులంటే ఇష్టం. సజ్జనులు కూడా మిమ్మల్ని - మీ కర్తవ్య ని ్వహ ణను మెచ్చుకొంటారు. అందుకు మీ సౌజన్యమే కారణం, మీ విధి నిర్వహణ అపూ ్వమయింది" అన్నది సావిత్రి.

"బాగుందమ్మా! నీ మాటలు వింటుంటే, నా గురించి ఇన్ని మంచి అభిప్రాయాలు లోకంలో ఉన్నాయి కదా అని ఆనందం కలుగుతుంది. నీవు అది తప్పమరే వరమైన కోరుకో అమ్మాయి" అన్నా డు యముడు.

"నా భర్తతో ా సమాగమం వల్ల బలపరాక్రమ సంపన్నులూ, వంశవర్ధకులూ అయిన నూర్గురు కొడుకు ను ప్రసాదించండి" అన్నది. ఈ వరం కూడా ఇచ్చాను మరలి పొమ్మన్నాడు.

"ప్రభూ! ా ర్త సత్యవంతుడు; అలాంటి సత్యానికి ప్రాణ ప్రదానం చేశారు. సంతానం కలిగే ివ్వడం వల్ల , భర్త ప్రాణాలను ప్రసాదించినట్లే అయిం"దని సావిత్రి ముకుళిత హస్తా ల నిలుచున్నది.

యముడు సావిత్రి పట్టుదలకు మెచ్చి ఆమె కోరిన విధంగా సత్యానికి ముక్తిని ప్రసాదించాడు. సావిత్రి యముణ్ణి అనేక విధాల కీర్తించి, వెంటనే సత్యవంతుని శరీరం దగ్గరికి చేరుకొన్నది. భర్త తలను ొడిలోకి తీసుకొన్నంతలోనే అతనిలో చైతన్యం వచ్చింది. తమను అన్వేషించి, అలసిపోయి ఆ్రమంలో ఉన్నద్యుమత్సేన శైబ్యలను కలిసి వారికానందం కలిగించారు. గౌతముని ప్రేరణతో జరిగినకథ సావిత్రి ఇలా చెప్పింది.

"ఏనాడో నారద మహర్షి నా పతి మృత్యువు గురించిచెప్పారు. ఆ అకాల మృత్యువును జయించాలనే నేను నిశ్చయించుకొన్నాను. వారు చెప్పిన ప్రకారంగా ఆ మృత్యువు వచ్చే దినం గుర్తించాను. అది ఈ రోజే. నా భర్త వెంబడి అడవికి వెళ్లాను. వారు శిరోవేదనకు గురి అయి నిద్రలోకి జారుకొన్నారు. అప్పుడు యముడు వచ్చి వీరి ప్రాణాలను తీసుకొని క్షీణ దిశగా వెడుతున్నారు. ఆయనను అనుసరించి అనేక ధార్మిక విషయాలు చర్చించాను. వారు

ప్రసన్నులై నాకు అయిదు వరాలు ప్రసాదించారు. అందువల్లనే మా అత్తమామలకు కళ్లు వచ్చినై. రాజ్యం కూడా సంప్రాప్తిస్తుంది. నా తండ్రికి నూరుగురు బిడ్డలు కలుగుతారు. నాకూ నూర్గురు పుత్రులు కల్గుతారు. నా భర్తకు ప్రాణమిచ్చి వెళ్లిపోయాడు. . . ఇవీ నేను పొందిన వరాలు. ఆయనతో పోరాడి ఇవి సాధించుకోవడం వల్ల ఆశ్రమానికి రావడం ఆలస్యమైంది'' అన్నది సావిత్రి.

ఇదండీ సావిత్రి కథ. విప్లవయోగి అఖండ భారత సిద్ధాంత ప్రవక్త అరవింద మహర్షి ఈ కథనే ఆధారంగా తీసుకొని ఆంగ్లంలో సావిత్రి అనే మహా కావ్యాన్ని రచించాడు. ఆంగ్ల సాహిత్యంలో ఇవాళ అది తలమానికం. నిజానికి చీకటి అపహరించిన సత్యాన్ని వెలుతురు మళ్లీ లోకానికి చూపిందనేదే ఈ కథలోని పరమార్థం

మహిళ ఈ సృష్టికి వెలుతురు వంటిదనీ, ఆమె తలచుకొంటే ఏదైనా సాధిస్తుందని నిరూపించిన సావిత్రి భారతీయ మహిళల ముందు, ప్రపంచ ప్రమదల ముందు ఆదర్శంగా నిలిచింది. మృత్యువునైనా జయించవచ్చునని అందరికీ ఆత్మ విశ్వాసాన్ని ప్రసాదించింది. "తమసోమా జ్యోతిర్గమయ" అన్న భారతీయ అనుష్ఠాన వేదాంత ధ్యేయ వాక్యాన్ని అక్షరాలా నిరూపించింది.

స్త్రీ శక్తి నిరూపణలో పరాంకోటి స్థానంలో నిలిచింది ఈ కథ. భారత సావిత్రి భారతీయ మహిళలకందరికి స్ఫూర్తినిస్తుంది. "మృత్యోర్మా అమృతం గమయ" - అని భారతీయ వేదాంతమన్నదిందుకే అనిపిస్తుంది.

## 10. పరమ పతివ్రత - పారమార్థికత

అరణ్య పర్వంలోనే ధర్మరాజు ధర్మవ్యాధోపాఖ్యానం విన్నాడు. ధర్మ వ్యాధుడు మాంసాన్ని విక్రయించే వృత్తి ధర్మాన్ని నిర్వర్తిస్తూ తల్లిదండ్రుల సేవతో జీవితం పరమార్థ పథం వైపుగా నడిపిస్తున్నాడు. ఆ ఉపాఖ్యానంలోనే ఊరూ పేరూ లేని ఓ పతివ్రత కథ ఉంది.

తన ధర్మాన్ని (విధినీ - డ్యూటీని) తానెంత మాత్రం ఏమరుపాటు లేకుండా నిర్వర్తించడం వల్ల ఆమెకు లోకం పోకడలన్నీ తెలిసినై. ఆమె గృహిణి. గృహస్థ జీవనం సుఖ సంపదలకు నిలయం. ధర్మానికి మూలం కూడా అదే. అందువల్ల ఆర్తులూ, అన్నార్తులూ గృహస్థునే ఆశ్రయిస్తారు.

ఆ విధంగా కౌశికుడనే మహర్షి వచ్చి "భిక్షాందేహి" అని వాకిట నిలుచున్నాడు. ఆమె భిక్ష తెస్తాను ఉండమని లోనికి వెడుతున్నంతలో, ఆమె భర్త అలసి సొలసి ఇంటికి వచ్చాడు. అలసిపోయిన భర్తకు సేవలు చేసి, అతను విశ్రాంతి తీసుకొంటుండగా, అప్పుడు భిక్ష తీసుకొని వచ్చింది; అంత ఆలస్యానికి కౌశికునికి కోపం వచ్చింది. ఆమె వైపు కోపంతో

చూశాడు. ఆమె అతని కోపాన్ని గుర్తించింది. అతను వేద వేదాంగవేత్తలైన విప్రులకిది అవమానం తెలుసా అన్నాడు.

అప్పుడామె బ్రహ్మజ్ఞానమున్న వాడే బ్రాహ్మణుడన్నది. సత్యం పలికేవాడు, అహింసనమలుపరచేవాడు, గురుజనహితాన్ని కాంక్షించేవాడు, జితేంద్రియుడు, అందరినీ తన లాగే భావించే ధార్మికుడు, కామక్రోధాది అరిషడ్వర్గాలను జయించిన వాడు, షట్కర్మలను లోక హితం కొరకే ఆచరించేవాడే బ్రాహ్మణుడు తెలుసా అన్నది. పైగా తన పతివ్రతా ప్రభావం చేత నీవు అరణ్యంలో కోపంతో చూచి ఓ కొక్కెరను చంపిన సంగతి కూడా తెలుసుకొన్నానన్నది. తనధర్మమేంటో చాలా గట్టిగా చెప్పేసింది.

పతియ చూవె నాపాలికి పరమదైవ
మేను వాఙ్మనః క్రియల తద్ధితమ యెపుడు
కోరియొనరింతు దీని మిగులగ నొండు
ధర్మువులు గాన నెందును తలచి తలచి.

కష్టపడి పని చేసి, అలసి సొలసి ఇంటికి వచ్చిన వారికి కనీస విశ్రాంతి కల్పించడం ఇంటిలోని వారి కర్తవ్యం. ఆమె అదే చేసింది.

ఆయన ఆకలితో తూలుతూ వచ్చాడు. పీట వేసింది; కూచున్నాక నీళ్లిచ్చింది; ఆ తర్వాత స్నానం చేయించింది; నవ్వుతూ మురుస్తూ ఇంత తినేట్టు చేసింది; కడుపు నిండా తినిపించింది. ఆ తర్వాత విశ్రాంతి గదిలో పడుకోడానికి ఏర్పాట్లు చేసింది. కొంత సేపు సేవ చేసింది; ఆ తర్వాతే భిక్ష తెచ్చింది. ఇంత సేపు తనను వాకిట నిలిపినందుకు కౌశికునికి కోపం వచ్చింది.

కోపానికి చచ్చి పడిపోవడానికి ఆమె కొక్కెర కాదు. ఆ విషయమే ప్రస్తావించి కౌశికునికి అనేక ధార్మికాంశాలు చెప్పింది. ధర్మ సంబంధ అంశాలు ఇంకా తెలుసుకోవాలనుకొంటే తల్లిదండ్రుల సేవ చేసే మిథిలాపురి ధర్మ వ్యాధుణ్ణి సందర్శించుమంది. నీకు స్వాధ్యాయమే తెలుసుకొని ధర్మ సూక్ష్మాలు తెలియవు; అందుకని ధర్మవ్యాధుణ్ణడిగి తెలుసుకొమ్మన్నది. కౌశికుడు ధర్మవ్యాధ దర్శనార్థం వెళ్లిపోయాడు.

మహాభారతంలో అతి సాధారణ గృహిణి ఈ పతివ్రత. కుటుంబంలో తన ధర్మాన్ని నిర్వర్తిస్తూ, విశ్వ ధర్మాన్నే బోధించి, శాసించగల స్థితికి చేరుకొంది. కూటిలోని రాయి తీయగలిగితే ఏటిలోని రాయి తీస్తామంటామే; అది ఇదే! ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికి ఎగిరిందని, ఇంటిని దిద్దలేని వాడు ఇంటర్నేషనలిజాన్ని గురించి మాటాడుతున్నాడనే సామెతలు పుట్టిన సంఘటనలను పరిగణనలోకి తీసుకొంటే, పతి సేవకు (గృహసేవకు) ఆమె అంకితమైన పరమార్థమేదో సరిగా అర్థం చేసుకోగల్గుతాం. "స్వధర్మేనిధనం శ్రేయః"

అన్న గీతా వాక్యాన్ని పరిపూర్ణంగా ఈ పతివ్రత కథకు అన్వయించుకొని అధ్యయనం చేయగలుగుతాం.

వేల పుటల భారత చరిత్రలో కేవలం రెండుపుటల కథ మాత్రమే ఉన్న పతివ్రత కథ పరిశీలనానంతరం భారతంలోని ఓ ప్రధాన పాత్రను పరామర్శిద్దాం. భారత కథంతా అక్కడక్కడ పరచుకొని ఉన్న ఆ రాజమాత కుంతి గురించి తెలుసుకొందాం.

## 11. వీరమాత కుంతి

యదువంశ రాజు శూరుడు; అతని పుత్రిక కుంతి; ఈమె మొదటి పేరు పృథ. ఈమె పాండురాజు పత్ని. ధర్మజభీమార్జునుల తల్లి; మాద్రి మరణానంతరం ఆమె పుత్రులు నకులసహదేవులను తన కుమారులతో పాటే పెంచింది. పాండవుల తల్లి అంటే గుర్తుకు వచ్చేది కుంతే. అయిదుగురినీ పంచ ప్రాణాలలా పెంచి విద్యా బుద్ధులు చెప్పించింది. పాండు రాజు మరణించాడు. అతనితోపాటే మాద్రి చనిపోయింది. దేశానికి ధృతరాష్ట్రుడు రాజయ్యాడు. నిజానికి కుంతి హస్తినలోనే ఉండి తన పిల్లలను పెంచుకోవాలి. కాని, ఆమె గిందమముని ఆశ్రమంలోనే ఉండిపోయింది. పాండవులు పదేళ్లు దాటే వరకు మున్యాశ్రమాలలోనే పెరిగారు.

హస్తినకు వారు వచ్చేవరకు దుర్యోధనులు తమదే రాజ్యంగా జీవిస్తున్నారు. ఆ పరిస్థితులలో వారి బారి నుండి తన కొడుకులు తప్పించుకొనేట్టు, ఎదుర్కొనేట్టు తీర్చిదిద్దగలిగింది. భీష్మద్రోణుల అండ ఉండగా, విదురుని సలహాలు పాటిస్తూ పాండవులను ధీరులుగా - వీరులుగా నిర్మాణం చేసింది. అందునల్లే కుమారాస్త్ర విద్యా ప్రదర్శనంలో తన కొడుకుల శౌర్య పరాక్రమాల్ని జనం ప్రశంసిస్తుంటే వారి ఎదుగుదలకు కదలిపోయి ఆకాశందిక్కు చూచింది. అప్పుడే ఆమెకు కర్ణుడు గుర్తుకు వచ్చాడు. తాను కుంతి భోజుని దత్తపుత్రికగా ఉన్నప్పుడు యౌవన చాపల్యంతో దుర్వాసుడిచ్చిన మంత్రాన్ని సూర్యుని పై ప్రయోగించి కన్యగానే కర్ణుణ్ణి కన్నది. కాని అతణ్ణి చాటుగా వదలి వేసింది. కుటుంబ మర్యాదను స్వతంత్రించి ఉల్లంఘించింది. తప్పు తెలుసుకొని ధీరమానసగా వ్యవహరించింది. ధర్మ పక్షం జయి[illegible]ని కురుక్షేత్రంలో కర్ణుణ్ణి వరం కోరుకొన్నది. ఆ విధంగా ఒక్క అర్జునుడు తప్ప ఎ[illegible]తా ఎవ్వరు కర్ణుని బారి పడకుండా సంరక్షించుకోగలిగింది. కర్ణుడు తన పెద్ద కొడుకన్న [illegible]స్యాన్ని కర్ణ మరణం వరకు కాపాడగలిగింది. కన్యగా ఆమె సంతానం కన్నందుకు కుమిలిపోయినట్లెక్కడా కనిపించదు. కాని లోకధర్మాన్ని ఉల్లంఘించాను కదా అని ధర్మ వేత్రిగా కొద్ది చింతించింది.

లక్క యింటి నుండి కొడుకులతో బయలుపడ్డ తర్వాత ఆమె మూర్తిమత్వం, వ్యక్తిత్వం, వీరమాతృశక్తి ఏక చక్రపురంలో ప్రకాశించింది. తానూ తన కొడుకులు బ్రాహ్మణ

వేషధారులై ఉన్నారు. వారే యింట ఉన్నారో ఆ యింటి గృహిణికి ఒక్కడే అబ్బాయి. ప్రతి రోజూ ఆ ఊరిలోని ఒక్కొక్క ఇంటి నుండి ఒక్కరిని బకాసురుని తిండికై పంపాలి. ఒక్కగానొక్క కొడుకును రాక్షసుడు చంపి తింటాడు కదా అని ఆ యింటి యజమానురాలేడుస్తున్నది. సంగతి సందర్భం తెలుసుకొన్నది. తన కొడుకుల్లో ఒకరిని పంపిస్తానన్నది. భీముణ్ణి పంపించింది. ఈ సందర్భంలో కొద్దిపాటి గుంజాటన మనస్సులో జరిగింది. భీముడు వాడిని సంహరించి వస్తాడనే నమ్మకముంది. కాని మాతృప్రేమ.

"వంద మంది కొడుకులున్నా అందులో ఒకడు అనిష్టుడైనంత మాత్రంలో ఎవరైనా వదులుకొంటారా" అనుకొన్నది.

ఒకవేళ తన కొడుకు చనిపోతే, ఆ గృహిణి బ్రాహ్మణికి పుత్రశోకం తప్పించిన పుణ్యం దక్కుతుంది. తన కొడుకు విజయం సాధిస్తే వేల మంది గృహిణులు పుత్ర శోకంలో పడకుండా కాపాడ గల్గుతుంది. ఏ విధంగా చూచినా ధర్మ విజయమే. తల్లిగా ఆమె కొంత బాధపడవచ్చు. కాని ప్రస్తుతమా పురాన్ని కాపాడాలి. అందుకే ఏ తల్లి చేయని పని ఆమె చేసింది. ఆమె నమ్మకం వమ్ము కాలేదు. భీముడు విజయుడై తిరిగి వచ్చాడు.

కుంతి కొడుకులతో కొన్నాళ్ల పాటు ద్రుపదుని పాంచాల నగరంలో బ్రాహ్మణ వేషాలతోనే గడిపింది. అప్పుడే అర్జునుడు మత్స్యయంత్రాన్ని ఛేదించాడు. ద్రౌపదితో పాటు వచ్చిన పాండవులు భిక్ష తెచ్చామన్నారు. కుంతి అయిదుగురు సమానంగా పంచుకొండన్నది. ద్రౌపది వ్యాస-కృష్ణ-ద్రుపదుల ఆజ్ఞానుసారంగానే అయిదుగురికి భార్య అయ్యింది. కుంతి అన్న ఈ మాటలను ఇది బహుభర్తృత్వం క్రిందికి వస్తుంది కదా అని ఎవరూ తీవ్రంగా వ్యతిరేకించలేదు. పైగా ద్రౌపది వ్యతిరేకించలేదు.

కుంతి మాట వెనుక మహాబలశాలురైన పంచపాండవులను కలిపి ఉంచే ద్రౌపది లావణ్యం వల్ల, దేశం చీలకుండా అఖండంగా ఉంటుందనే భావన ఉన్నట్టు కొందరూహిస్తున్నారు. జీవితాంతం ఆ అయిదుగురు అన్నదమ్ములను కలిపి ఉంచే శక్తిగా ద్రౌపదిని కుంతి గుర్తించడం మామూలు మాట కాదు. అది మాతృస్వామ్య వ్యవస్థ అనీ, ఆ తర్వాతిది పితృస్వామ్య వ్యవస్థఅనీ కోడిగుడ్డు మీద ఈకలు పీకే దృష్టి కాకుండా, దేశహిత దృష్టితోనేఈ కల్యాణం గురించి ఆలోచించాలి. అమ్మ మాట జవదాటని దాని వెనుక ఉన్న తత్త్వమిదే అనుకొందాం ప్రస్తుతానికి.

దుష్టచతుష్టయం పన్నిన కపట జూద వ్యూహంలో తన కొడుకులు చిక్కుకోకుండా ఆమె కాపాడుకోలేకపోయింది. జూదంలో ఓడిపోయి కొడుకులు కోడలు అడవుల పాలైతే, తాను రాజప్రాసాదంలో ఉండడం ఎంత మాత్రం తగదని విదురునింట ఉండడం ఆమె విజ్ఞతకెత్తిన వైజయంతిక.

శక్తి సముపార్జించుకొని రాజ్యం వీరభోజ్యంగానే తన కొడుకులు పొందాలని ఆమె ఆశించింది. రాయబారమప్పుడు కృష్ణుడు కుంతిని సందర్శించాడు. మొదట మెడ పట్టుకొని ఏడ్చినా, ద్రౌపదిని మన యింటికి తెచ్చుకొని ఆమెకేం సుఖం కలిగించామని వాపోయింది. చివరకు "రాజ్యం వీరభోజ్యమనీ, వీరభోగ్యావసుంధరా" అని గుర్తుంచుకొమ్మన్నది. కొడుకులనుధర్మవీర మార్గంలో నడిపించే నీవే దిక్కన్నది.

కురుక్షేత్ర యుద్ధం పరిసమాప్తమయ్యింది. అశ్వత్థామ అపాండవానికి బ్రహ్మాస్త్రాన్నే ప్రయోగించాడు. ఉపపాండవులు చనిపోయారు. ఉత్తరాగర్భ నిక్షిప్త శిశువొక్కడే వారసునిగా మిగులుతాడు. అన్నాళ్ల భారత వంశం నిర్వంశం అయ్యేట్టుంది. ఆ కృష్ణ పరమాత్మను తలచుకొమ్మంది; ఉత్తర తలచుకొన్నది. ఇంకేం కృష్ణుడు చక్రంతో వైష్ణవ మాయతో బ్రహ్మాస్త్రాన్నినిరోధించాడు; ఉత్తర గర్భస్థ శిశువును కాపాడాడు.

దుర్మార్గుల ప్రాణాలు తీయవలసిందని కోరిన ఆ తల్లే సన్మార్గులను కాపాడుమన్నది. కృష్ణుడామె కోరిక మన్నించాడు. ఇక చాలు! ఈ జీవితానికింత మాత్రం చాలు. ఈ వంశం వర్ధిల్లుతుంది. ఈ దేశం నిలుస్తుంది. అందుకే "ఘన సింధువు చేరెడి గంగ భంగి నీ పాదసరోజ చింతనము పై ననిశంబు మదీయబుద్ధి నత్యాదర వృత్తితో కదియు నట్లుగ చేయగదయ్యా!" అని వేడుకొన్నది.

"శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగార రత్నాకరా!
లోకద్రోహి నరేంద్ర వంశదహనా! లోకేశ్వరా! దేవతా
నీకబ్రాహ్మణ గోగణార్తి హరణా! నిర్వాణ సంధాయకా!
నీకున్ మ్రొక్కెద త్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!"

కృష్ణుణ్ణి కుంతి అలా ఎందుకు పొగిడింది. తన వంశాన్ని రక్షించినందుకా! కన్నే తెరవని, నిజానికి రూపమే ఏర్పడని అండంలోని పిండాన్ని కాచినందుకేనా! అంత మాత్రానికే ఇంత పొగడ్తనా!

తన కళ్ల ముందే భారత వంశం నిర్వంశం కావడానికి వీల్లేదు. మరి అలా కాకుండా కాపాడిన వాడు కృష్ణుడు. అందుకే మోహ విచ్ఛేదం చేయుమన్నది. ఈ జీవాత్మను విశ్వాత్మలో చేర్చుకొమ్మన్నది.

కాని ఆమె కోరిన విధంగా కాలేదు. కురుక్షేత్ర యుద్ధానంతరం గాంధారీ ధృతరాష్ట్రులతో అడవికి వెళ్లిపోయింది. అరణ్యంలో జపతపాల్లో ఉన్నప్పుడు, దావాగ్నికి గాంధారీ ధృతరాష్ట్రులు ఆహుతి అయిపోతుంటే, వారినిరక్షించేశక్తి లేక, తనను తాను రక్షించుకొనే శక్తి ఉన్నా, వారిని విడిచి వెళ్లి తనను తాను కాపాడుకోవడం ధర్మం కాదనుకొన్నది. వారితో పాటే అగ్నికి ఆహుతైపోయింది.

ఒకరింట పుట్టింది; తన ప్రమేయం లేకుండా దత్తు వెళ్లింది. కన్యగానే కొడుకును కన్నది. ఎవరి వెలివేతకు గురి కాలేదు. పైగా వీర పాండురాజుకు పత్ని అయ్యింది. ముగ్గురు కొడుకుల కన్నది. మాద్రితోపాటు వీరపత్ని అయ్యేదే గాని ఆమె అయిదుగురిని పెంచి, మహావీరులను తయారు చేసి వీరమాతగానే మిగిలిపోయింది. నిజానికి స్వర్గారోహణం వరకు రాజమాతగా ఉండేహక్కున్నా - వీలున్నా ఇష్టపడలేదు. తపస్విని జీవితాన్నే ఎన్నుకొన్నది. చివరకు వీర తపస్వినిగా నిలిచిపోయిన వీరమాత కుంతి.

## 12. భారత భారతి ద్రౌపది

మహాభారతంలోమరెందరో మహిళలను గురించి చెప్పవలసి ఉన్నా, ద్రౌపదిని గురించి చెప్పుకోకపోతే ఈ మహిళా భారతం పూర్ణత్వాన్ని సంతరించుకోదు. ఆమె యజ్ఞంలో పుట్టింది - యాజ్ఞసేని. ఆమె కృష్ణ వర్ణ-కృష్ణ. ఆమె పాంచాల రాజ పుత్రిక - పాంచాలి. ఆమె ద్రుపదుని తనయ-ద్రౌపది. ఆమె వర్చస్వి, తేజస్వి, ఓజస్వి, తపస్వి, ధర్మాధర్మ ప్రజ్ఞా వచస్వి.

పంచభూతాలే అయిదుగురుగా జన్మించారనుకొంటే,శరీరాలు వేరైనా ఒకే విధంగా మెలగిన పంచపాండవుల సతియామె.

తనను అవమానించిన ద్రోణుణ్ణి జయించే వాడికే తన కూతురునివ్వాలని నిశ్చయించి, కేవలం అర్జునుడు భేదించగల మత్స్య యంత్రాన్ని నిర్మించి అనుకొన్నది సాధించిన ద్రుపదుని పుత్రిక ద్రౌపది, తండ్రి, కృష్ణుడు, వ్యాసుడు,కుంతి తదితరుల కోరిక మేరకు, తన కోరిక మేరకు అయిదుగురికి భార్య అయ్యింది.

అసలు పాండవులు జ్యోతిశాశస్త్రం ప్రకారంగా అయిదు నక్షత్రాలనీ, ఆ అయిదింటికి వెలుగు ప్రసాదించి, అవి వెలిగేట్టుగా చేసే ఏకతా నక్షత్రవే ద్రౌపది అని జ్యోతిశ్శాస్త్రవేత్తలంటున్నారు. మన దేవీ దేవతలు, పురాణ పురుషులందరు గ్రహ నక్షత్ర తారకల ఆధారంగా నిర్మితమైన వారే అని వీరి వాదన. అయితే ఈ శాస్త్రం నమ్మనంతగా భారతేతిహాసం భారతీయుల్లో మమైక్యమైపోయింది.

ఏది ఏమైనా ద్రౌపదిని ధర్మరాజు మాయా జూదంలో ఒడ్డాడు. మొదటి జూదంలో అన్నీ కోల్పోయాడు; ద్రౌపదిని నిండు సభలోకి లాక్కొని వచ్చారు. అప్పుడామె అడిగిన ప్రశ్న ఈనాటికీ ప్రశ్నార్థకంగానే నిలిచింది.

మున్ను తన్నోటువడి మఱి నన్ను నోటు
వడియెనో, నన్ను మున్నోట వడి విభుండు
క్రన్న తన్నోటు వడియెనో యన్న నాకు
నెఱుగ చెప్పుము దీని నీ వెఱుగుదేని (సభా, 2-209)

ద్రౌపది అయిదుగురి భార్య. ధర్మరాజు తాను మొదటే ఓడిపోతే ఆమెను పణంగా పెట్టడానికే వీలు లేదు. ఎందుకంటే భర్త ఓడిపోయిన తర్వాత ఆమె కూడా ఓడినట్లే లెక్క. ఆమెనే మొదట పణంగా పెట్టడానికి వీల్లేదు, ఎందుకంటే మిగతా నలుగురి అనుమతి తీసుకోకుండా ఆమెను పందెంగా కాయరాదు. పైగా ఆమె అనుమతి లేకుండా కూడా పందెం కాయకూడదు. ఇవి ఏవీ కనుక్కోకుండానే ఆమెను పణంగా అంగీకరించడం పెద్ద తప్పు. ద్రౌపది వస్తువు కాదు, ధర్మరాజుకు తన తమ్ముళ్లను కూడా పణంగా పెట్టే అధికారంలేదు. తన మీద, తనకు లభించిన అర్ధ రాజ్యం మీద తప్ప మరిక దేని మీదా అతనికి అధికారం లేదు. అందుకే ద్రౌపది పరమ విజ్ఞతతో పై ప్రశ్నలు లేవనెత్తింది.

నిర్భయంగా నిండు సభలో ఆమె అడిగిన ప్రశ్నలకు సమాధానం ధర్మరాజు తప్ప మరెవ్వరూ చెప్పలేరని తేల్చివేశారు. దుశ్శాసన-దుర్యోధనులను సంహరిస్తానన్న భీముని ప్రతిజ్ఞలతో సభ దద్దరిల్లిపోయింది. అప్పుడు ధృతరాష్ట్రుడు అదురుకొని ద్రౌపదిని వరాలడుగుమని, ఆ వరాల నెపంతో పాండవులకు ముక్తి ప్రసాదించాడు; వారి రాజ్య భాగాన్ని వారికిచ్చి వేశాడు.

పాండవులకేమైన భూమి మీద హక్కు ఏర్పడిందంటే ద్రౌపది ఈ విధంగా సంపాదించి పెట్టిందే! లేకపోతే వారు సర్వస్వాన్ని కోల్పోయినవారే.

అయితే ధర్మరాజు రెండోసారి జూదానికి సిద్ధమై ఓడిపోయి పండ్రెండేళ్ల అరణ్య వాసం, ఒక ఏడు అజ్ఞాత వాస సమయ విధికి తలొగ్గి ద్రౌపదితో - తమ్ముళ్లతో వెళ్లిపోయాడు. ఈ పదమూడేళ్ల తర్వాత కూడా ధర్మరాజుకు భూమి అడిగే హక్కు ద్రౌపది వరం వల్లనే సిద్ధించిందన్నది గ్రహించాలి. ఈ విధంగా తన భర్తలకు భూమి భిక్ష పెట్టిన ఉదారమూర్తి ద్రౌపది.

అరణ్యంలో భర్తలతోపాటు అష్టకష్టాలు పడ్డా, సైంధవుని చేత అపహరింపబడ్డా, దుర్వాసుని శాపానికిఎదురు నిలవవలసి వస్తుందనిపించినా ఏ మాత్రం చెక్కు చెదరని ధీరచిత్త ద్రౌపది.

అజ్ఞాతవాసంలో కాముకుడైన కీచకుణ్ణి హడలగొట్టిన తీరు స్త్రీ జాతికే శౌర్యపాఠాలు నేర్పినట్లనిపిస్తుంది. ఆ పద్యం చూడండి!

దుర్వారోద్యమ బాహు విక్రమ రసాస్తోక ప్రతాప స్ఫురత్
గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతులేవురిప్డు నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముం గొనుట తథ్యంబెమ్మెయిం కీచకా!

నీచుడైన కారణంగా భయపెట్టాల్సిందే అని నిశ్చయించుకొని పైవిధంగా పలికింది. వాడు వినలేదు. తప్పనిసరి పరిస్థితుల్లో అజ్ఞాతవాస రహస్య భంగం కాకుండా యుక్తియుక్తంగా, కీచక ఉపకీచకుల సంహారానికి ప్రధాన కారకురాలు కావల్సి వచ్చింది.

ఆ తర్వాత శ్రీకృష్ణుడు రాయబారానికి వెళ్లడానికి ముందు పాండవులందరు తమ తమ ఆలోచనలు చెప్పినప్పుడు, ద్రౌపది పలికిన పలుకుల వల్ల ఆమె మండే అగ్ని గోళంలా కనిపిస్తుంది.

"ఆ యింటి కోడలిని నేను. కనీస మర్యాద లేదు సరికదా ఏక వస్త్రను నన్ను సభకీడ్చి తెచ్చారు. కులాంగననిలా తేవచ్చునా! నేను కోడలిగావీరి ఇంటికివచ్చానా! దాసీగా వచ్చానా!"

ఇలా పలికి నల్లటి పెద్ద పాములాంటి తన వెంట్రుకల్ని గోవిందుని ముందు పెట్టి ఇలా అన్నది!

అన్నయ్యా! గుర్తుంచుకో! ఇవి దుశ్శాసనుని వ్రేళ్లకుతగిలి సగం తెగిపోగా మిగిలినవి సుమా! కౌరవుల దగ్గర ఏవో సంధి మాటలు జరుపుతానంటున్నావే; అప్పుడీ వెంట్రుకలను గుర్తు పెట్టుకోఅన్నయ్యా!

ఈ వెంట్రుకలు పట్టి ఈడ్చిన ఆ చేయి ముక్కలు ముక్కలుకావాలి. వాడి శరీరం యుద్ధంలో చూరుచూరై గుర్తించరానంతగా మారిపోవాలి. అప్పుడు గాని నా వేడి చల్లారదు. సంధి తోటి సంప్రదింపుల తోటి ఆరిపోయే అగ్ని కాదిది. నేనిన్నాళ్లు అగ్గి ఒడిలోకట్టుకొని రాకాసి ఓర్పుతో ఉన్నాను. నేనూ ధర్మరాజు ఇద్దరం రాజరాజు పీనుగు కన్నారా చూడాలి."

ఏమి మాటలు! ఈటెల మూటలు!

అసలు పాండవులెవరూ ఇంత గట్టిగా అనలేదేమో! వారిలోని చైతన్యానికి శక్తిని ప్రసాదించింది ద్రౌపదే!

జూదం తర్వాత స్వర్గారోహణం వరకు పాండవులను నడిపింది ద్రౌపదే అన్నా ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదు.

అశ్వత్థామ కారణంగా అయిదుగురు కొడుకులూ చనిపోయినప్పుడు ఆమె గర్భశోకం వర్ణనాతీతమే! కాని తన లాగా పుత్ర శోకంలో కృపి (అశ్వత్థామ తల్లి) మునగడం తనకిష్టం లేదని, అతణ్ణి వదలిపెట్టవలసిందని భీమార్జునుల్ని వేడుకొంటుంది.

ఎంత వీరమో! అంత దయ!

ఎంత స్వాభిమానమో! అంత ఆత్మ ప్రత్యయం!

రామయణానికి వాల్మీకి "సీతాయాశ్చరితం మహత్" (సీతాచరిత్రం) అని పిలిచారు. అదేవిధంగా భారతాన్ని ద్రౌపదీయం అనీ, ద్రౌపదీ చరిత్రం అని పిలవ్వచ్చు. అందుకే ద్రౌపది భారతానికే మూలం అనవచ్చు. ద్రౌపది భారత భారతి అనవచ్చు.

## ✤ భారతం మహిళా భారతం

అసలుభారతమే మహిళా భారతం. ఏ పాత్రా తన వ్యక్తిత్వాన్ని వదులుకోలేదు; స్వాభిమానాన్ని చంపుకోలేదు. ఇలాంటి వ్యక్తిత్వాలు, సత్యసంధత, ధర్మాభిమానం, పరాక్రమశీలత, చొరవ, ఆర్తత్రాణ పరాయణత్వం, త్యాగశీలత ఉన్న మహాభారత మహిళా మణులింకెందరో ఉన్నారు. వారిలో పౌష్యమహాదేవి, ప్రమద్వర, శకుంతల, అంబ, అంబిక, అంబాలిక, మాద్రి, గాంధారి, హిడింబి, తపతి, ఇంద్రసేన, ఉలూచి, సుభద్ర, చిత్రాంగద, జర, ఊర్వశి, దమయంతి, లోపాముద్ర, సత్యభామ, సుధేష్ణ,ఉత్తర, భానుమతి, భూదేవి, గౌతమి, రుక్మిణి,యాదవాంగనలు, శిఖండి(?) . . . . ఇలా ఇలా.

మహాభారతంలోని ఏ మహిళ కూడా 'మొగమిచ్చకం' కొరకు మాటాడదు. స్వాభిమానాన్ని చంపుకోదు. అదలింపులకు బెదరింపులకు లొంగదు. సుధేష్ణ లాంటి ఒకరిద్దరు మహిళలు తమ రాజ్య రక్షణ నిమిత్తం అనుచితంగా వ్యవహరించినా ఆ పరిస్థితులనధ్యయనం చేసిన పఠితలకు ఆమె విషయంలో జాలే కలుగుతుంది. సుధేష్ణకు తెలుసు; తాను తప్పు చేస్తున్నానని! ఆమె ప్రవర్తన కారణంగానే తాను చిక్కుల్లో పడుతున్నానని ద్రౌపది గ్రహించి ఆ చిక్కుల్ని ఛేదించడానికే నిశ్చయించుకొంటుంది. సుధేష్ణ అసహాయస్థితి పఠితకూ అర్ధమవుతుంది.

నేటి భారతీయ మహిళ నాటి భారత మహిళ ఇచ్చే సందేశాన్ని తుచ తప్పకుండా పాటించక పోవచ్చు గానీ, ఆ పాత్రల ఆదర్శాల్ని అభినందించకుండా ఉండలేదు. దేశ కాల పరిస్థితుల్ని బట్టి ఆనాటి మహిళల జీవితాల్ని సమన్వయించుకోకుండా ఉండలేదు. వర్తమానంలోని స్త్రీ పురుషులు భవిష్యత్తు భవ్యపథంలో అడుగువేయడానికి భూతకాలంలోని ఏ పాత్ర మార్గదర్శనం చేసినా కాదని మొండికేసే వారెవరూ ఉండరు. మహాభారత - మహాభారతీయ మహిళల విషయంలో కూడా ఇది సరిగా వర్తిస్తుంది.

✤ ✤ ✤

# దేశ చరిత్రలో మహిళలు

✤ వికాసశీల దిశ ఉన్నా - అభద్రతలో అతివలు.

1. గృహంలో **యశోధర** - ఆశ్రమంలో **సుందరి**
2. ప్రచారిక **సంఘమిత్ర**
3. దేవిగా మారిన **ఉభయభారతి**
4. ఉత్తమసేవిక **సుజాత**
5. వీరనారి **రుద్రమ**
6. రామాయణ రచయిత్రి **మొల్ల**
7. నాయకురాలు **నాగమ్మ**
8. వీరుడు వెన్ను చూపరాదన్న **చానమ్మ**
9. చివరకు చితినే వరించిన **సంయుక్త**
10. కృష్ణభక్తే **మీరాబాయి** శక్తి
11. విద్వేషాల మంటల్లో **దుర్గావతి**
12. యువతకు ప్రేరణ **ఝాన్సీరాణి**

✤ చరిత్రలో ఇంకా ఎందరో...

# దేశ చరిత్రలో మహిళలు

## ❖ వికాసశీలదిశ ఉన్నా అభద్రతలో అతివలు

చరిత్రలో చరిత్ర సృష్టించిన మహిళలెందరో హిందూదేశంలో ఉన్నారు. మహాభారత కాలం నుండి శాలివాహనశక ప్రారంభం వరకు, లేదా క్రీస్తు శక ప్రారంభం వరకు చరిత్ర చీకటి కోణాల్లో దాచేస్తే దాగని సత్యాలెన్నో ఉన్నాయి. ఈ మధ్యకాలం అయిదువేల నుండి ఏబయివేలదాకా, అయిదులక్షల దాకా సాగదీయబడింది. అందువల్ల ఈ సుదీర్ఘకాలంలో అంటే కురుక్షేత్ర యుద్ధ పరిసమాప్తి నుండి క్రీ.శక ప్రారంభం వరకు మహిళా జీవితాల్ని అధ్యయనం చేయడానికి కొన్ని సంస్కృత, ప్రాకృత దేశీభాషా గ్రంథాలే ఆధారంగా నిలిచాయి. భాస శూద్రక బాణభట్టాది మహాకవుల గ్రంథాలలో కనిపించే వాసవదత్త, రత్నావళి, అవంతి సుందరి, రాజశ్రీ, మహాశ్వేత, వసంతసేన తదితర విద్వద్వందిత మహిళామణులెందరో అధ్యయనశీలుర దృష్టిపథంలో నిలుస్తారు.

జైన బౌద్ధాది మతాల విజృంభణకు కొద్ది ముందుగానే కౌటిల్యుని అర్థశాస్త్రం, వాత్స్యాయనుని కామసూత్రాలు, ఆపస్తంబుని గృహ్యసూత్రాలు వచ్చేశాయి. భాసుని స్వప్న వాసవదత్తమ్ - చారుదత్తమ్, శూద్రకుని మృచ్ఛకటికమ్ అప్పటికే ప్రచలితమైనై. సాహిత్య గ్రంథాల్లో చిత్రింపబడ్డ మహిళలు రామాయణ భారత కాలాల నాటి మహిళలకు తీసిపోని విధంగా కనిపిస్తారు. ఇక నూతన స్మృతుల్లో - శాస్త్రాల్లో మహిళల పట్ల కొన్ని సడలింపులు కొన్ని బిగింపులు సూత్రపక్కీలో కనిపిస్తాయి. అయితే ఏవి వచ్చినా వాటి వెనుక దేశకాలమాన పరిస్థితులున్నాయి అని అధ్యయనం చేస్తే ప్రతిదీ సహృదయంతో అర్థం చేసుకోగలుగుతాం. కేవలం మనల్ని కించపరిచే విదేశీయుల వ్రాతలే పరమప్రమాణంగా గ్రహిస్తే, బురదలో కాలు వేసిన వారమవుతాం.

మన ఇతిహాస సంస్కృతుల్ని ఈ దేశాన్ని దోచుకోవడానికి వచ్చినవాడు, బలంతో అధికారం చలాయించాలని వచ్చినవాడు సకారాత్మక (Positive Outlook) దృష్టితో స్పందించి వ్రాస్తాడా? వ్రాశాడా? అందువల్ల మహాభారత కాలం నుండి క్రీస్తు శకారంభం వరకున్న ఆ కాలఖండం గురించి చరిత్రను పునర్నిర్మించాల్సిన ఆవశ్యకత ఉన్నది. ఉదాత్త త్యాగశీలురైన వాసవదత్తాదులను, సౌజన్యశీలురైన అవంతికాదులనూ, సచ్ఛీల సన్మార్గగాములైన

వసంతసేనాదులను ప్రత్యేకంగా అధ్యయనం చేయవలసి ఉంది. దేశ చరిత్రలో మహిళలు అనే అంశాన్ని, క్రీస్తుశకారంభం నుండి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం (1857) వరకు అనుశీలించవచ్చు.

అప్పటి యుగంలో మాయావతి, యశోధర, సంఘమిత్ర, సుజాత, సుందరి, తిష్యరక్షిత, గౌతమి, కామసాని, వాసిష్ఠి, లీలావతి, ఉభయభారతి, కోడబలిశ్రీ, మహాదేవి, అక్క మహాదేవి, మాళవిక, రుద్రమదేవి, రంగాజమ్మ, కణ్ణగి, తిరుమలదేవి, చిన్నాదేవి, గంగాంబ, వరదాంబిక, చానమ్మ, మాంచాల, నాగమ్మ, రాణీసంయుక్త, మీరాబాయి, దుర్గావతి, రాణిపద్మిని, పన్నా, అహల్యాబాయి, మల్లమ్మ, చెన్నమ్మ, ఝాన్సీ లక్ష్మీబాయి.... ఇంకా ఎందరో పరిశీలించాల్సిన వారున్నారు. వీరందరూ దేశాన్నీ, ధర్మాన్నీ, సాంస్కృతికమూల్యాల్నీ, వికాసశీలదిశలో పయనింపజేసినవారే. స్మృతి శాస్త్ర శాసనాల్లో ఎన్ని నియమాలున్నా, దేశహితకారకమైనవే ఆచరించారనడానికి అనేక ఆధారాలున్నాయి. అయితే ముస్లింల దండయాత్రల తర్వాత హిందూ మహిళా వికాసం తగ్గింది. జాతి తనను తానురక్షించుకోడానికి తాబేలు తన అంగాల్ని లోపలికి లాక్కొని కదలక మెదలక ఉన్నస్థితిని గుర్తుకు తెచ్చింది. భద్రత పెరుగుతుందనుకొన్నప్పుడు సర్వాంగాల సంకోచం నుండి వికాస స్థితికి ఎదుగుతూ వచ్చింది. జాతిలో కారణాలేవైతేనేమి గాని భద్రతా అభద్రతా భావాలున్నా చొరవ ఉన్నవారు చొచ్చుకుపోయిన ఘట్టాలెన్నో ఉన్నాయి. రెండువేల సం॥ల ఈ సుదీర్ఘ కాలఖండంలో కొందరిని గురించి క్లుప్తంగా తెలుసుకొందాం.

## 1 గృహంలో యశోధర - ఆశ్రమంలో సుందరి

హిందుత్వంలో కర్మకాండ ప్రాబల్యం పెరిగి పోయి, వ్యక్తుల్లో తృష్ణాపూరిత దురాశ, హింసోన్మత్త అధికార లాలస వ్యాపిస్తున్న తరుణంలో హిందుత్వ సంస్కరణకే బుద్ధుడు ఆవిర్భవించాడు. తలచుకొంటే రాజుగా సర్వసుఖాలు అనుభవించే స్థితిలో ఉండి కూడా, యశోధరతో వివాహానంతరం, ఓ కొడుకు కూడా కలిగాక సన్యసించాడు. అహింసయే పరమధర్మంగా గ్రహించి ఆశ్రమాలు బౌద్ధ విహారాలు నెలకొల్పి, భిక్షుక వ్యవస్థను పటిష్ఠం చేస్తున్నాడు బుద్ధుడు.

ఆ సందర్భంలో గృహస్థాశ్రమంలో ఉన్న యశోధర స్థితి ఏమిటి? తన మామగారి అండదండలతో తన కొడుకుకు విద్యాబుద్ధులు చెప్పించుకొంటున్నది. తన భర్త ప్రచార వ్యవస్థకు, బోధలకు ప్రజలు బ్రహ్మరథం పడుతుంటే గృహబంధాలు వదలి విశ్వవీథుల్లోకి ఆయన ఎందుకు వెళ్లాడో అర్థం చేసుకొంటున్నది.

కుటుంబబంధాలు వదలివెళ్లిపోయే గృహయజమాని, తన గృహంలోనే ఉండే భార్య-పిల్లల పోషణకు సరియైన దారి ఏర్పరచే పోవాలనేది ఒక నియమం. పురాణకాలంలోని స్త్రీల

జీవితాల అధ్యయన సందర్భంగా ఒకటి రెండు పర్యాయాలు ఈ విషయం చర్చించడం జరిగింది. బుద్ధుడు హిమాలయ పర్వత ప్రాంతాల్లో ఉన్న శుద్ధోదన మహారాజు పుత్రుడు. అందువల్ల ఆయన భార్య యశోధరకూ, ఆమె కొడుకుకూ దినబత్తానికి లోపం లేదు.

అయితే బుద్ధునికి వరుసకు తమ్ముడయ్యే రాజబంధువు అయిన నందునికి కూడా దీక్ష ఇచ్చి, భిక్షా పాత్ర పట్టించాడు బుద్ధుడు. నందుని భార్య సుందరి. ఆమెకీ పద్ధతి నచ్చలేదు. తమను పిట్టలుగా బ్రతకండని శపించినా సంతోషంగా కలిసి బ్రతికేవారమనీ, ఈ వియోగం దుస్సహమని ఆమె విలపించింది. చివరకు తనకు కూడా దీక్ష ఇవ్వవలసిందని ప్రార్థించింది. భిక్షుకీ జీవితానికి స్త్రీలు అర్హులుకారనే అభిప్రాయం బౌద్ధంలో చాలా కాలం కొనసాగింది. కాని బుద్ధుని నిర్యాణానికి ముందు భిక్షుకీ జీవనానికి స్త్రీలకు అనుమతి ఇవ్వడం జరిగింది. ఆ విధంగా సుందరి బౌద్ధ సన్యాసినియై ఆశ్రమ జీవితంలో ప్రవేశించింది. స్త్రీ పురుషులకు వేర్వేరు నిబంధనలు పెట్టిన బౌద్ధమే చివరికి స్త్రీకి ప్రవేశం కల్పించింది. స్త్రీ ప్రవేశం కారణంగానే బౌద్ధమత ప్రచారం బాగా జరిగింది. గృహస్థ ధర్మంలో యశోధర, ఆశ్రమ ధర్మంలో సుందరి తమ తమ విధుల్ని నిర్వర్తించారు.

## 2. ప్రచారిక సంఘమిత్ర

బౌద్ధమత పరివ్యాప్తికి కంకణం కట్టుకొన్న అశోకుడు తన కొడుకు మహేంద్రుణ్ణి, కూతురు (సోదరి) సంఘమిత్రను బౌద్ధమత ప్రచారకులుగా నియోగించాడు. హిందూదేశంలో రాజులు కూడా మత ప్రచారకుల నియమించి, మతాన్ని ప్రోత్సహించిన మొట్టమొదటి రాజు అశోకుడు. రాజులు ఏదో ఒక మతాన్ని అవలంబించినా తామే మత ప్రచారం చేయడం గాని, ప్రచారకులను నియమించడం గాని చేయకూడదు. రాజు సర్వమత సౌమనస్యుడై ఉండాలి. అయితే అశోకుడు అనుసరించిన పద్ధతి ఒప్పొ తప్పొ అన్నది ఇప్పుడు చర్చనీయాంశం కాదు.

సంఘమిత్ర దేశంలో తిరిగి ప్రచారం చేయడం, సింహళం తదితర దేశాలకు వెళ్లి బౌద్ధమత ప్రచురానికి పూనుకోవడమనేదే గ్రహించాల్సిన - అనుశీలించాల్సిన అంశం. ఇంటి నుండి ఇంద్రలోకం దాకా అయిన మహిళ వెళ్లి ప్రచారం చేయవచ్చునని సంఘమిత్ర నిరూపించింది. ఆమె సింహళంలో శిలాస్తంభాల మీద వ్రాయించిన సూక్తులున్నాయి. ఆ ద్వీపంలోని వారెందరో ఆమెకు హార్దిక స్వాగతం పలికినట్లు చరిత్రకారులు చెబుతున్నారు. స్త్రీ సర్వసంగ పరిత్యాగియై దేశదేశాల్లో పర్యటించి మత ప్రచారం చేయడాన్ని ఆకాలంలో వీరోచిత పవిత్ర కార్యంగా భావించారు.

అయితే సనాతన ధర్మంలోని ఆశ్రమాలకే అధిష్ఠాతలుగా మహిళలే ఉన్నట్టి ఆధారాలు సాహిత్యంలో లభిస్తున్నాయి. తదనంతర కాలంలో సనాతన ధర్మం, బౌద్ధం నుండే అన్యమతాలు స్త్రీలను ప్రచారికలుగా గ్రహించే స్ఫూర్తిని పొందడం, అందులో ఆ మతాలు మరీ ముందుకు చొచ్చుకుపోవడం చరిత్ర నిరూపిస్తున్న సత్యాలే.

## 3. దేవిగా మారిన ఉభయభారతి

బౌద్ధం దేశంలో కొన్ని విలువలు ప్రతిష్ఠాపించింది. ఆ తర్వాత ఆదిశంకరులు అద్వైత సిద్ధాంతం ద్వారా సనాతన ధర్మకేతనం ఎగురవేశారు. అయితే కర్మకాండనే ప్రధానంగా అనుసరించే మండన మిశ్రుణ్ణి తన సిద్ధాంత ప్రచారానికి అనుకూలంగా మార్చుకోవలసి వచ్చింది. అతని సిద్ధాంతం తప్పని వేదాంత జ్ఞానం వైపు మళ్లించాలి. అందుకే మండనమిశ్రునితో వాదానికి దిగారు శంకరులు. మండన మిశ్రుడు వ్యాసజైమినులను సాక్షులుగాఉండమన్నాడు. అందుకు తగినవారు మండన మిశ్రుని భార్య ఉభయభారతే అని, ఆమెసరస్వతీ దేవి అపరావతారమని వారు చెప్పి వెళ్లిపోయారు.

ఇక అధ్యక్షస్థానంలో ఉభయభారతి కూర్చోవలసి వచ్చింది. ఆమె ఇరువురి మెడలలో పూలమాలలు వేసింది. వాదోపవాదాలు నెలల కొద్ది జరిగాయి. చివరకు శంకరులు జయించారని తీర్పునిచ్చింది. అయితే అంతమాత్రంతో సరిపోదని శంకరులు తనతో కూడా వాదించాలని ఉభయభారతి అన్నది. స్త్రీలతో వాదం తగదన్నాడు శంకరుడు. అప్పుడు ఉభయభారతి ఇలా అన్నది.

“నీ మతాన్ని ఖండించే వారు స్త్రీలైనా పురుషులైనా నీ మత రక్షణ నిమిత్తం నీవు వారితో వాదం చేయవలసిందేకదా! పూర్వం యాజ్ఞవల్క్య మహర్షి గార్గితో వాదం చేయలేదా! సులభ జనకుల మధ్య సంవాదం జరగలేదా! ఆనాడు వారు తప్పు చేయలేదు కదా?'' అన్నది ఉభయభారతి.

శంకరుడంగీకరించాడు. ఇరువురి మధ్య శ్రుతి శాస్త్ర ప్రమాణాలతో పదిహేడు రోజులు వాదోపవాదాలు జరిగాయి. వినేవారందరు పరమానందభరితులవుతున్నారు. శంకరులు బ్రహ్మచారిగానే సన్యసించిన కారణంగా, అతనికి కామ శాస్త్ర సంబంధ అంశాలు తెలువవని గ్రహించిన ఉభయభారతి అటువంటి ప్రశ్నలడిగింది. శంకరులు నెలరోజుల సమయం తీసుకొని ఆ శాస్త్రాన్ని అధ్యయనం చేసి వచ్చాడు. ఆ తర్వాత వాదంలో ఉభయభారతి పొల్గొనక శంకరుల సిద్ధా:తాన్ని అంగీకరించింది. శంకరులు తాను ప్రతిష్ఠించే శారదాదేవి విగ్రహాలలో సరస్వతీదేవి అపరావతారమైన ఉభయభారతే నిలచి జనతకు జ్ఞానాన్ని ప్రసాదించాలని కోరాడు. ఆయా ఆశ్రమాలలో దేవాలయాలలో ప్రతిష్ఠాపించే శారదమాత విగ్రహాలలో సరస్వతీ ప్రతిరూపమైన ఉభయభారతే ఉండి జ్ఞానదానం చేస్తున్నదని గ్రహించాలి.

ఈ కథలోని అవతారాలనూ, మహిమలనూ వదలి వేద్దాం. సర్వశాస్త్రాలనూ, వేదాలనూ, ఉపనిషత్తులనూ, వేదాంత సంప్రదాయాల నన్నిటిని జీర్ణం చేసుకొన్న జ్ఞానదేవిగా ఉభయభారతిని భావించాలి. ఆమె జ్ఞానానికి గుర్తుగానే ప్రజలు శారదాదేవి విగ్రహాలను ప్రతిష్ఠిస్తున్నారని గ్రహించాలి. తన ప్రజ్ఞ చేత ఒక మహిళ మనుష్యత్వం నుండి దివ్యత్వం వైపుగా ఎదగవచ్చుననే సందేశమే ఉభయభారతి కథ ద్వారా ప్రచారం చేయవలసి ఉంది.

## 4. ఉత్తమ సేవిక సుజాత

బుద్ధుడు నిష్ఠా గరిష్ఠుడై ఆహారాన్ని వదలి తపస్సు చేస్తున్నాడు. దేహం కృశీభూతమై నేలకు ఒరిగిపోయింది. బుద్ధుని తపో ధ్యానాదులను కొన్నాళ్లుగా పరిశీలిస్తున్న సుజాత ఆయన దుస్థితిని చూచి సేవలు చేసింది. కృశీభూత శరీరంలో కృశీభూతమైన ఆలోచనలే వస్తాయన్న జ్ఞానం కలిగించింది. 'శరీరమాద్యం ఖలుధర్మసాధనమ్' - ధర్మసాధనకై శరీరాన్ని పుష్టిగా ఉంచవలసిన అవసరమన్నది. పుష్టి మనిషికి పురోగమనమని బుద్ధుడు గుర్తించగలిగాడు. అందుకే ఆమె ఇచ్చిన పాయసాన్ని స్వీకరించాడు. ఆమె సేవల వల్ల సేదదేరాడు. బుద్ధునికి సేవలుచేసి అమృతం వంటి పాయసాది ఆహారాలందించి అతనిని నిలపిన సుజాత ఉత్తమసేవిక.

మనం శక్తి పరులమైనప్పుడు ఒకరికి సేవ చేసే గుణం పెంచుకోవాలి. అందువల్ల దీనహీన పీడితతాడిత జనం సమాజంలోని మనుష్యులలోనే దేవుళ్లను చూస్తారు. దేవుడెక్కడో లేడు సేవచేసే వారిలోనే ఉన్నాడని చేయెత్తి దండం పెడతారు. తాము కోలుకొని మరొకరికి సేవ చేస్తారు. రోగి, కుంటి, గుడ్డి, బలహీనులు తదితరులనెందరినో ఆదుకోవాలనే సందేశమందించిన సుజాత నిజంగానే ఉత్తమ సేవిక.

## 5. వీరనారి రుద్రమదేవి

కాకతీయ సామ్రాజ్యాన్ని గణపతిదేవుని తర్వాత అధిష్ఠించిన రుద్రమదేవి వీరనారి. తనకు మగపిల్లలు లేనికారణంగా కూతురుకే అస్త్రశస్త్రాది విద్యలన్నీ నేర్పించాడు గణపతి దేవుడు. కాకతీయులు మొదట చాళుక్యుల సామంతులే. కాని వీరు తర్వాత స్వతంత్రించి సొంత రాజ్యాలను నిర్మించుకొన్నారు.

రుద్రమదేవికి చాళుక్య రాజవంశానికి చెందిన వీరభద్రునికి వివాహం జరిగింది. వారి సంతానం ముమ్మడమ్మ. ఆ ముమ్మడమ్మ కొడుకే ప్రతాపరుద్రచక్రవర్తి.

రుద్రమదేవి పరిపాలన సజావుగా సాగలేదు. దేవగిరి యాదవరాజు దండయాత్ర చేస్తే అతణ్ణి ఓడించింది. తన భర్త మొదటి భార్య సంతానం కూడా తన మీద తిరుగుబాటు చేస్తే వారికీ బుద్ధి చెప్పవలసి వచ్చింది. వీరశైవ వీరవైష్ణవాల మధ్య అంతరాలను తొలగించేప్రయత్నం చేసింది. సప్తప్రాకార పరివృతమైన ఓరుగల్లు కోటను తీర్చిదిద్దింది. కళింగరాజులు కాకతీయ భూములను ఆక్రమించడానికి చేసిన ప్రయత్నాలను వమ్ము చేసింది. త్రిపురాంతకాన్ని పరిపాలించే తన సామంతుడైన అంబదేవుడు తిరగబడి సొంతం రాజ్యం నిర్మాణం చేసుకోవాలనుకొన్న అతణ్ణి ఓడించి, బంధించి, దేశబహిష్కార శిక్ష విధించింది.

అనేక విజయపరంపరలతో రాజ్యంలో సుస్థిరత నెలకొని, ప్రశాంత వాతావరణం

ఏర్పడింది. రుద్రమదేవి విజయాలను ప్రజలు తమ విజయాలుగానే భావించారు. వారందరూ మహోత్సాహంతో వీధి వీధినా కోలాటాలాడారు. పేరిణి, కేళిక, గొండ్లి, భరతనాట్యం, తదితర నృత్యాల్లో పోటీలు ఏర్పాటు చేశారు. గుఱ్ఱప్పందాలు ఎడ్లపందాలు, కోడిపందాలు, పొటేళ్ల పందాలు, సాముగరడీలు మల్లయుద్ధ ప్రదర్శనల పోటీలు పెట్టారు. గుళ్లు గోపురాలు తీర్చిదిద్ది జాతరలనేక చోట్ల నిర్వహించారు. రుద్రమ దేవిని "జయజయ! శ్రీమన్మహావీరా! రుద్రదేవ మహారాజ!" అని కీర్తించారు.

1. రుద్రమదేవి దేశంలోని అనేక ప్రాంతాలలో గోళకి మఠాలు కట్టించింది. అందులో శైవాచార్యులను నియమించింది. వారి ద్వారా ప్రజలకు వేదవేదాంగాలు బోధించే ఏర్పాట్లు చేయించింది. మందడం గ్రామంలోని గోళకీ మఠం చేసిన సేవ చరిత్రలో ప్రసిద్ధి కెక్కింది.

2. మోటుపల్లి, మచిలీపట్టణం, శ్రీకాకుళం తదితర రేవులను తీర్చిదిద్దింది. సముద్రం మీద వ్యాపార విస్తరణకు దోహదం చేసింది. సన్ననినేత వస్త్రాలు, శ్రీగంధం, కర్పూరం, ముత్యాలు, రత్నాలు, కంబళ్లు, తివాచీలు, కత్తులు, సుగంధ ద్రవ్యాలు, మిరియాలు.... ఇంకా అనేక వస్తువులు ఎగుమతి చేయించింది. పట్టు, గాజు, పంచదార, కర్పూరం, అశ్వాలు దిగుమతి చేసుకొంది. ఇలా వ్యాపారం ద్వారా కూడా ప్రజా సంబంధాలు మెరుగయ్యేలా వ్యవహరించింది.

3. ఈ దేశం వ్యావసాయికంగా ఎదగాలి. వ్యవసాయం గ్రామాల్లో ఉంది. ఆ గ్రామాలకు సరిగా నీటి సౌకర్యం ఉండాలి అని భావించిన రుద్రమదేవి అనేక గ్రామాల సమీపంలో చెరువులు నిర్మింపజేసింది. వ్యవసాయంతో పాటు అన్ని వృత్తులు వికసించే విధంగా రుద్రమ దేవి ఎన్నో కార్యక్రమాలు చేపట్టింది.

4. సుదీర్ఘపథాలలో చలివేంద్రాలు నిర్మించి బాటసారుల విశ్రాంతి కనుకూలంగా శీతల పానీయాలు అందించే సేవకులను అక్కడ నియమించింది. సరోవరాలు త్రవ్వించింది. అనేక వృత్తుల వారికి మడిమాన్యాలేర్పాటు చేసింది. ఊరూరా అన్నదాన సత్రాలు నిర్మించింది. దేవాలయాల్లోనే విద్యాలయాలు నడిచే వ్యవస్థకు శ్రీకారం చుట్టింది. పెద్ద పెద్ద గ్రామాల్లో వైద్య సహాయం అందుబాటులో ఉండే విధంగా ధన్వంతరి నిలయాలు కట్టించింది.

తన మనుమడు ప్రతాపరుద్రుణ్ణి తన జీవితకాలంలోనే పట్టాభిషిక్తుణ్ణి చేసింది. అరవై ఎనిమిదేళ్ల వయస్సులో కూడా ఆమె ధైర్య పరాక్రమ సాహసాలు మొక్కవోని విధంగా రాజ్యమంతా పర్యటించింది. కాకతీయ రాజ్యాన్ని సుస్థిరంగా సుదృఢంగా నిర్మించి పొరుగున ఉన్న హిందూ రాజ్యాలకన్నిటికి ఆదర్శప్రాయంగా నిలిచిన పరిపాలనాదక్షురాలు వీరనారి రుద్రమదేవి.

## 6. రామాయణ రచయిత్రి మొల్ల

ఒకవైపు ఉత్తరభారతంలోని అయోధ్య రామ జన్మభూమిపై ముస్లిం మతోన్మాదుల దాడులు జరుగుతున్నాయి. గుడి మీద గుమ్మటాలు పెట్టించే విధంగా ప్రయత్నాలు ప్రారంభమైనై. ఈ ప్రజలకు రామాయణార్థం ఇంకా బోధపడలేదనుకొన్నది కుమ్మరుల వంశంలో పుట్టిన మొల్లమ్మ. రామాయణ అంతరార్థం సంగ్రహంగా తెలిపి జాతిని చైతన్యవంతం చేయాలనుకొన్నది. విజయనగర రాజులనే తన కవిత్వం చేత మెప్పించిన కవయిత్రి మొల్ల. రామాయణం అధర్మాన్ని ఎదిరించుమన్నది. అయోధ్యలో రాముని జన్మభూమిమీదనే దాడి జరుగుతున్నది. ఇక ఈ ప్రజలు రామాయణార్థాన్ని గ్రహించారనే చెప్పుకోవాలా! అందుకే సులభశైలిలో రామాయణం రచించి ప్రజల్లో అధర్మాన్ని ఎదిరించాలనే భావనను నిర్మాణం చేసింది రామయణ కవయిత్రి రసరమ్య గుణ సావిత్రి మొల్ల.

## 7. నాయకురాలు నాగమ్మ

నలగామరాజు కోడిపందేలలో నాయకురాలు నాగమ్మ సహకారంతో మలిదేవాదులను ఓడించి అడవులు పట్టించి పలనాడును పరిపాలిస్తున్నాడు. బ్రహ్మనాయని మీద కోపంతో శైవవైష్ణవ మతవైషమ్యాలను మనసులో పెట్టుకొని రాయబారి అలరాజును చంపించి, కార్యమపూడి కదనరంగంలో బ్రహ్మనాయని పక్షాన్ని తుదముట్టించాలని నిర్ణయించింది నాగమ్మ. మహాభారతం లాంటిదే పలనాటి భారతం కూడా.

ఇందులో నాగమ్మ అన్నదమ్ముల వైరాన్ని పెంచే అన్ని ప్రయత్నాలు చేసింది. తన తెలివినీ, సాహసాన్ని కుత్తుకలు ఉత్తరించుకొనే కత్తుల పంజరంలో పడవేసింది. యుద్ధంలో లెక్కలేనంత మంది మరణించారు. రక్తం వరదలై పారింది. బాలచంద్రుడు అమరుడయ్యాడు.

ఏం మిగిలింది చివరకు. బ్రహ్మనాయని సమతా సిద్ధాంతాలన్నీ వ్యర్థమైపోయాయి. వర్ణాంతర వివాహాలు, అందరికీ దేవాలయ ప్రవేశం, చాపకూడు సిద్ధాంతం మంచి ఫలితాలిస్తూ జాతిలో ఏకతా నిర్మాణం జరుగుతున్న దశలో, బ్రహ్మనాయని మీద, వైష్ణవం మీద పెంచుకొన్న ద్వేషం యుద్ధానికి దారితీసింది. జాతి ఏకతకు భంగం కలిగించింది. కులాలు, మతాలు కుమ్ముకొన్నాయి. సనాతన ధర్మఏకతా వృక్షం కొమ్మలు ఎక్కడికక్కడే విరిగిపడ్డాయి.

నాయకురాలుగా నాగమ్మ నిలబడవచ్చుగాక! కాని జాతి నిలబడిందా! తమ ఇంటిలో తామే పోరాడుకొనే విధంగా వ్యవహరించే వారి వల్ల శత్రువుకు అలుసై పోతామన్న జ్ఞానం కూడా లేకపోయింది. నాయకురాలుగా నాగమ్మ పేరు చరిత్రలో నిలువ వచ్చుగాక! కాని జాతి విచ్ఛిత్తి కారకురాలుగా కూడా ఆమె మిగిలిపోయింది. వ్యక్తిగతమైన ఆకాంక్షాపరిపూర్తికి జాతికీ - దేశానికీ ప్రమాదం తెచ్చి పెట్టరాదనేది నాయకురాలు నాగమ్మ వల్ల నేర్చుకోవలసిన నీతి.

# 8. వీరుడువెన్ను చూపరాదన్న చానమ్మ

నెల్లూరు సీమలో శౌర్యరసం ఉగ్గుపాలతో పోస్తారు. నల్లసిద్ధి (మనుమసిద్ధి) సేనాని ఖడ్గతిక్కన. పుల్లరి విషయంలో కాటమరాజు పక్షం వారితో తలపడాల్సి వచ్చింది. అటు పక్షంలో ఉన్న బ్రహ్మరుద్రయ్యతో పోరు ఘోరంగా జరుగుతున్నది. తన సైన్యం వెనుకంజ వేయడం, తానూ అలసిపోవడం కారణంగా యుద్ధభూమి నుండి వెనక్కు వచ్చాడు ఖడ్గతిక్కన.

ఈ వెనుదిరిగి రావడం తల్లికీ భార్యకూ నచ్చలేదు. విషయంలో ఉపేక్ష వహించకపోగా సూటిపోటి మాటలన్నారు. తిక్కన స్నానం చేయడానికి వచ్చాడు. అక్కడ భార్య చానమ్మ నులకమంచం అడ్డుగా పెట్టింది. పసపు ముద్దకూడా పెట్టింది. ఖడ్గతిక్కన్న విస్తుపోయి చూచాడు. స్త్రీలు స్నాన సందర్భంలో సమకూర్చుకొనే సామగ్రి తన కొరకు పెట్టడం వల్ల ఆయన ఆశ్చర్యాన్ని కనబరచాడు. అప్పుడు చానమ్మ ఇలా అంది.

"పగరకు వెన్నిచ్చినచో / నగరేనిను మగతనంపు నాయకులెల్లన్
ముగురాడవారమైతిమి/వగపేటికి జలకమాడ వచ్చినచోటన్."

– శత్రువుకు వెన్నిచ్చి వస్తే చూచిన వీరులు నవ్వరా! ఇప్పుడింటిలో ఉన్న ముగ్గురం (తిక్కన - తల్లి - భార్య) ఆడవారమైనాం. స్నానం చేయడానికిక చింతెందుకు?

మనసు విరిగేట్టుగా ఎందుకిలా అన్నది? అప్పగించిన పనిని వదలిపెడితే, అది చేయడానికి చేతగాలేదన్నట్లే కదా? అదీ ఆమె ఆవేదన. సరిగా తల్లి కూడా విరిగిన పాలు అన్నంలో పోసి 'పసువులు విరిగినవి, తిక్క పాలున్ విరిగెన్' అన్నది. భార్య తల్లి నిరసనకు గురియైన తిక్కన యుద్ధానికి వెళ్లాడు. భీకరంగా పోరాడాడు. మరణించాడు. విశ్వాసమున్న గుఱ్ఱమైనందువల్ల అతని తలను నోట కరచుకొని వచ్చింది. ఆ తలతో చానమ్మ సహగమనం చేసిందని కథనం.

ఇందులో సహగమనం ప్రధానం కాదు; సహగమనాన్ని మనం ప్రోత్సహించం. మొత్తం దేశచరిత్రలో ఓ అయిదారు సహగమన సంఘటనలు వినిపిస్తాయి. అవి ఏవీ కూడా ఆదర్శమని చెప్పకోరాదు. వియోగం తట్టుకోలేక చెడు మార్గం తొక్కడం కన్నా, తాము బ్రతికి తమ పిల్లలతో కుటుంబ సభ్యులతో కలిసి జీవించాలి. అయితే భర్తను వీరతాపథం మీద నడిపించిన వీరపత్నుల కోవలోకే చానమ్మ వస్తుందన్నది గుర్తించాలి. విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించకపోవడం కన్నా చావునైనా సరే ఆహ్వానించాలి అనే వీర త్యాగభావాన్నే వీరపత్ని చానమ్మ జీవిత సందేశంగా స్వీకరించాలి.

## 9. చివరకు చితినే వరించిన సంయుక్త

పృథ్వీరాజుకు జయచంద్రునికి మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది. వీరిరువురి మధ్య ఢిల్లీ సింహాసనానికి పోటీ ఏర్పడింది. పృథ్వీరాజు అజ్మీరుపాలకుడు; జయచంద్రుడు కన్నోజీరాజు. జయచంద్రుని కూతురు సంయుక్త. ఈమె స్వయంవరం ప్రకటించాడు జయచంద్రుడు. పృథ్వీరాజుకు ఆహ్వానం పంపకుండా అతని ప్రతిమను మాత్రం స్వయంవర మంటపం ద్వారం దగ్గర పెట్టించాడు.

సంయుక్తకీ సంగతి తెలిసింది. ఆమె రాజులందరిని చూస్తున్నట్లు నటిస్తూనే వెళ్ళి, ద్వారం దగ్గరనే ఉన్న పృథ్వీరాజు మెడలో పులమాల వేసింది. మారువేషంలో అక్కడే ఉన్న పృథ్వీరాజు ఎదురు వచ్చిన వారిని ఓడిస్తూ సంయుక్తను తీసుకొని వెళ్ళిపోయాడు.

సంయుక్త పృథ్వీరాజుల ప్రేమ ఫలించింది. కాని విదేశీయుడైన మహ్మద్ ఘోరి దండయాత్ర చేసినప్పుడు, జయచంద్రుడతనికి సహకరించి పృథ్వీరాజు ఓటమికి మరణానికి కారకుడయ్యాడు. తండ్రి చేసిన ద్రోహానికి చింతిస్తూ, అంత వరకు సాధ్యమైనంత వరకు కోట రక్షణలోనే ఉన్న సంయుక్త చివరికి చితి పేర్చుకొని చనిపోయింది.

విదేశీ సైతాన్ల చేతుల్లో పడడం కన్నా చావే మేలనుకొన్నది సంయుక్త. చితిపైకెక్కడం మధ్యయుగాల యుగధర్మంగా రసపుత్రవీరుల చరిత్రలో నిలిచిపోయింది. పృథ్వీరాజు వంటి పరాక్రమవంతుణ్ణి వరించి కూడా చివరకు చితినే వరించింది కదా సంయుక్త. జయచంద్రుని లాంటి దేశద్రోహుల వల్లనే ఈ దేశ స్త్రీల మానమర్యాదలు మంట గలిశాయి.

## 10. కృష్ణ భక్తే మీరాబాయి శక్తి

చిత్తూరును పరిపాలించిన కుంభరాణా ధర్మపత్నియే మీరాబాయి. ఆమె కవయిత్రి; భక్తిభావభరితమైన కృష్ణతత్త్వగీతాలు ఎన్నో రచించింది. కృష్ణుని ముందు ఆడింది; పాడింది కృష్ణుడే తన జీవన గమ్యంగా జీవించింది. మీరాబాయి మేవాడులో గిరిధర వేణుగోపాల మందిరాన్ని నిర్మించింది.

ఆమె మధురభక్తిని కుంభరాణా సరిగా అర్థం చేసుకోలేకపోతాడు. ఆమె కృష్ణునికి మరీ సన్నిహితమైందని అర్థం చేసుకోలేకపోతాడు. విశ్వమంతా ఆమెకు కృష్ణుడేకనిపిస్తుంటాడు. వారి వీరి చాడీల కారణంగా రాణా మీరాను అనుమానిస్తాడు. చివరకు ఆమె మీద విషప్రయోగం కూడా జరిగింది. ఆమె నవ్వుతూ నవ్వుతూ విషాన్ని స్వీకరిస్తుంది. ఆ విషం ఆమెను ఏమీ చేయదు. భర్త తన తప్పు తెలుసుకొంటాడు. ఆయన చనిపోయిన తర్వాత కూడా రాజబంధువులామెను అనేక శారీరక మానసిక హింసలకు గురి చేస్తారు. ఒక వజ్రాలహారం విషయంలో శీలాన్నే అనుమానిస్తారు. దొంగతనం మోపుతారు.

అందుకే చివరి దశలో తాను కట్టించిన ఆలయంలోని వేణుగోపాలుణ్ణే ఆశ్రయిస్తుంది. ఆమెను ఎలాగైనా చిత్తోడుకు తీసుకొని రావాలని చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. ఆమె నదిలో కలిసిపోయింది. చివరికి మీరా శవం కూడా దొరకలేదని కథనం.

సాంసారిక జీవనంలో కూడా పరాంకోటి స్థానానికి వెళ్లిన భక్తిని, ఈనాడు గౌరవిస్తున్నట్లు ఆనాడు గౌరవించకపోవడం విచిత్రం. శ్రేయోమార్గాన్ని అనుసరించిన మైత్రేయి కథను గుర్తుకు తెచ్చుకోవాల్సింది. మీరాను, మీరాభక్తిని, మీరా సాహిత్యాన్ని ప్రజలు గౌరవించినంతగా సన్నిహితులు గౌరవించకపోవడం విచిత్రం. మన గృహాలలో చిన్నతనం నుండే భక్తివైపు ఎవరు మొగ్గినా వారిని ఆ మార్గంలో వెళ్లేందుకు ప్రోత్సహించాలి. అందరికి పుట్టుకతోనే ఇంత గొప్ప సంస్కారం అలవడదు. అలాంటి సంస్కారం అలవడిన వారిని మనం అభినందించాలి. వారికి అందుబాటులో భక్తిసాహిత్యం, వేదాంత గ్రంథాలను ఉంచాలి. వారు తత్త్వపరంగా అధ్యయనం చేసే అవకాశం కల్పించడం వల్ల మానవ జాతికెంతో మేలు జరుగుతుంది. వారి వాక్శుద్ధి కారణంగా మిగతా ప్రపంచం బాగుపడుతుంది. మీరా జీవితాన్ని ఈ దృష్టితోనే అధ్యయనం చేసి, అటువంటి భాగవతులకు మనం పూర్తిగా సహకరించాలి.

## 11. విద్వేషాల మంటల్లో దుర్గావతి

దుర్గావతి తండ్రి చందేల్ భూపాలుడు. తన కూతురును కోసల రాజుకివ్వాలని మొదట అనుకొంటాడు. కోసలరాజు కూడా దుర్గావతిని తన భార్యగా చేసుకోడానికి ప్రయత్నిస్తాడు. కాని ఆమె గిరిజనుడైన గోండుభూపాలుణ్ణి ప్రేమిస్తుంది. కూతురు మనస్సు తెలుసుకొన్న చందేల్ భూపాలుడు, గోండురాజుకిచ్చి వివాహం చేయాలనుకొంటాడు. కాని కోసలరాజు కూతురునూ తండ్రిని అరణ్యంలో బంధిస్తాడు. ఆ సమయంలో గోండురాజు వచ్చి విడిపిస్తాడు. ఆ తర్వాత గోండుభూపాలునికి దుర్గావతికి వివాహం జరుగుతుంది.

పగబట్టిన కోసలరాజు విదేశీ ముస్లిం రాజుల సహకారంతో గోండు రాజ్యంపై దండయాత్ర చేస్తాడు. అయితే అప్పటికే అనారోగ్యంతో ఉన్న గోండురాజు మరణిస్తాడు. అయినా అతడు దండయాత్ర మానడు. దుర్గావతి దుఃఖంలో ఉన్నా తన కొడుకుతో పాటు రణరంగంలో దూకుతుంది. విదేశీ ముస్లింల కపట వ్యూహానికి కొడుకు బలైపోతాడు. తాను ప్రాణాలతో శత్రుమూకలకు పట్టుపడడం ఇష్టం లేక తనకు తానే కత్తితో పొడుచుకొని మరణిస్తుంది.

అర్థం కొరకు ఒకడు, రాజ్యం కొరకు ఒకడు, స్త్రీ కొరకు ఒకడు తన పక్కవాడిపై, అంటే తన జాతివాడిపై దాడి చేయడానికి విదేశీయుని సహకారం తీసుకోవడం ప్రపంచంలో ఏ దేశంలో లేని విచిత్రం. నీ దేశాన్ని నీవు పటిష్ఠ పరచుకొన్నప్పుడే నీ మనుగడ శాంతి సుఖసౌభాగ్యాలపై సాగుతుందని, భీష్ముని కాలం నుండి ఎందరు చెవినిల్లు గట్టుకొని

పోరడం లేదు! దుర్గావతి విషయమే చూడండి! ఎన్ని కష్టాలకు గురికావలసి వచ్చింది. పగబట్టిన కోసలరాజు కారణంగా ఈ దేశంలో విదేశీయులు బలపడిపోవడానికి అవకాశం కలిగింది. చరిత్రను అధ్యయనం చేసి ఇప్పటికైనా నడవడి మార్చుకోవలసిన అవసరం ఉన్నది.

## 12. యువతకు ప్రేరణ ఝాన్సీరాణి

1857 ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో వెలిగిన ఒక దివ్య తేజో రేఖ ఝాన్సీలక్ష్మీబాయి. ఆమె తల్లిదండ్రులు మోరో-పంత్ భగీరథులు. ఆమె మొదటి పేరు మనూబాయి. ఝాన్సీరాజు గంగాధరరావుతో ఆమె వివాహం జరిగింది. అప్పటి నుండి ఆమె లక్ష్మీబాయిగా పిలువబడింది. ఆమెకు ఒక కొడుకు పుట్టి మూడు నెలలలోపుననే మరణించాడు. లక్ష్మీబాయి గంగాధర రావులు ఆనందరావు అనే అబ్బాయిని, దామోదర రావని పేరు మార్చి దత్తత తీసుకొన్నారు.

లక్ష్మీబాయి 18 సం॥ల వయస్సులోనే గంగాధర రావు మరణించాడు. దత్తత చెల్లదని, రాజ్యానికి వారసులెవ్వరూ లేని కారణంగా ఝాన్సీని బ్రిటిషు రాజ్యంలో విలీనం చేస్తున్నామని, రాణి కోట వదలిపెట్టి పట్టణంలోని భవంతిలో ఉండాలని, ఆమెకు నెలకు అయిదువేల భరణం ఇస్తామని బ్రిటిషు ప్రభుత్వం ప్రకటించింది.

బ్రిటిషువారు ఈ దేశాన్ని వదలి వెళ్లాల్సిందే గాని తాను ఝాన్సీని వదిలేది లేదన్నది లక్ష్మీబాయి. అప్పటికే దేశమంతటా సిపాయిల అసంతృప్తి రాజుకొంటున్నది. నానాసాహెబ్, తాంత్యాటోపే తదితరులతో లక్ష్మీబాయి చర్చించింది. ఝాన్సీలక్ష్మీబాయి కాశీకి వెళ్లి తన వెంట్రుకలు సమర్పించి రావాలనుకొన్నది. అందుకొరకు కూడా (అక్కడ ఏ రాజకీయమైనా నడపవచ్చునని) బ్రిటిషువారు అనుమతి ఇవ్వలేదు. పిల్లవాడి ఉపనయనం ఖర్చులకు కూడా ఖజానా నుండి డబ్బు తీసుకోరాదన్నారు బ్రిటిషువారు.

1857 మే 31వ తేదీన కమలం పువ్వు విప్లవ సంకేతంగా గ్రహించి దేశమంతటా బ్రిటిషువారిపై తిరుగుబాటు చేశారు. ఇరవై నెలల పాటు ఈ పోరాటం జరుగుతూనే ఉన్నది. బ్రిటిషు సైన్యం ఝాన్సిపై యుద్ధం ప్రకటించి కోటమీద దాడి చేసింది. ఝాన్సీలక్ష్మి పురుషవేషం ధరించి అపర దుర్గాదేవిలా బ్రిటిషు సైన్యంతో పోరాటం జరిపింది. యుద్ధంలో ఫిరంగులు మ్రోగుతున్నాయి. తుపాకులు గర్జిస్తున్నాయి. కత్తులు ఆడుతున్నాయి. రాణి తన సైన్యాన్ని ఉత్సాహంతో పురికొల్పుతూ ముందుకు సాగుతున్నది. 1858 జూన్ 18వ తేదీన జరిగిన యుద్ధంలో రాణిపై చాటుగా దాడి చేశారు. భుజంలో తుపాకి గుండు దిగింది. ఝాన్సీలక్ష్మి పడిపోయింది. ఆమె శవం శత్రువుల చేతికి చిక్కకుండా రఘునాథసింహ గంగాదాస్ ఆశ్రమానికి చేర్చగలిగాడు. అక్కడే దహనక్రియలు నిర్వహించారు. కేవలం 23

సం॥ల వయస్సులో ఒక వీరనారిగా, వెలిగి బ్రిటిషు కుటిల నీతికి, బలి అయిపోయింది ఝూన్సీలక్ష్మిబాయి.

కొందరు విదేశీ చరిత్రకారులు తన రాజ్యం బ్రిటిషువాడు లాక్కొంటాడనే ఉద్దేశ్యంతోనే ఝాన్సీలక్ష్మి యుద్ధంలోకి దిగిందని వ్రాశారు. 1857 ప్రథమభారత స్వాతంత్ర్య సంగ్రామం యోజనాబద్ధంగా వీర జాతీయ ఉద్యమంగా, దేశ స్వాతంత్ర్య సంపాదనయే ధ్యేయంగా జరిగిన పోరాటంగా కనిపిస్తుందే తప్ప, ఇందులో వ్యక్తిగా ఆకాంక్షలు లేవనేది గుర్తించాలి.

## చరిత్రలో ఇంకా ఎందరో....

క్రీస్తు శకారంభం నుండి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం వరకు ఎందరో మహిళలు గృహిణులుగా, వీరవనితలుగా, పరిపాలకులుగా, విద్యావేత్తలుగా, వ్యావసాయికలుగా, వృత్తి నైపుణ్య రమణులుగా, నాట్యకత్తెలుగా, సంగీతమర్మజ్ఞులుగా, దార్శనికులుగా, యోగినులుగా, కర్మయోగినులుగా, భక్తి ప్రచారికలుగా, దేశికలుగా, ఋషికలుగా, రచయిత్రులుగా, కవయిత్రులుగా దేశంలోని భిన్న ప్రాంతాలలో వికసించారు. అయితే ఈ దేశం జాతిలో శక్తి తగ్గి, విదేశీయులను తనలో జీర్ణించుకొనే పాటవం కోల్పోయిన నాటి నుండి, స్వతంత్రాన్ని కోల్పోతూ వచ్చింది. దాని వల్ల స్వదేశీ ఆచారాలపై జీవన విధానంపై విదేశీయ అశాస్త్రీయ భావజాలం పెత్తనం చలాయిస్తూ వచ్చింది. ఆ పెత్తనం రాజసభల్లో వీథుల్లో వీరవిహారం చేసినా చాలాకాలం గృహంలోకి ప్రవేశించలేకపోయింది. అందువల్ల విశాల హిందూ ధార్మిక సాంస్కృతిక తాత్త్వికాంశాల నెన్నిటినో గృహంలో గృహిణి అందించగలిగింది. అలా ఈ జాతి జీవనాడి నిత్యచైతన్యంతో కొట్టుకున్న స్థలం గృహమే. ఈ గృహానికి గృహిణే యజమాని. ఆమె పుణ్యఫలమే జాతిలో స్వాతంత్ర్య భావబీజాలు నాటుకోవడం. అందుకే ఆధునిక మహిళకు స్ఫూర్తి ప్రదాతగా కూడా ఆమే నిలిచింది.



# ఆధునిక కాలంలో మహిళలు

ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం తర్వాత జాతి స్వాతంత్ర్యం కొరకు తపించడం ప్రారంభమయ్యింది. బ్రహ్మసమాజం, ఆర్యసమాజం, ప్రేమ సమాజం, ప్రార్థనా సమాజం, దివ్యజీవన సంఘం, రామకృష్ణ మఠం, రామకృష్ణ సేవానిలయం తదితర అనేక సంస్థల కార్యక్రమాలు పెరిగాయి. జాతీయ కాంగ్రెస్ తదితర పార్టీలు వ్యక్తుల్లో చైతన్యం నింపే ప్రయత్నం చేశాయి. పత్రికల ప్రచారం పెరిగింది.

శ్రీరామకృష్ణ పరమహంస దేవి శ్రీ శారదామాత, స్వాతంత్ర్య వీరసావర్కర్ వదిన యశోద, భార్య యమున, విదేశీ వనిత అనీబిసెంటు, సోదరినివేదిత, సరోజినీనాయుడు, కస్తూరిబా గాంధి, దుర్గాబాయి దేశ్‌ముఖ్, సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి, విజయలక్ష్మి పండిట్, డొక్కా సీతమ్మ... ఇలా ఎందరో ఉన్నారు.

పద్మజానాయుడు, యల్లాప్రగడ సీతాకుమారి, సుమిత్రాదేవి తదితరులెందరో ఉద్యమాల్లో పాల్గొన్నారు. హైదరాబాదు సంస్థానం విముక్తి నిమిత్తం. ఆర్యసమాజ్ సత్యాగ్రహంలో మహిళలు కూడా పాల్గొన్నారు. స్వదేశీ ఉద్యమ వికాసంలో తమ వంతుగా ఊరూరా తిరిగి నూలువడకడం, అమ్మడం, తద్వారా స్వదేశీ ఉత్పత్తులపై అభిమానం పెంచడం, ఇలా ప్రత్యక్షంగా పరోక్షంగా స్వాతంత్ర్యోద్యమానికి మహిళలెందరో సహకరించారు.

## సంస్కార పరిమళపునీత భారతీయ మహిళ

ఈ దేశం కొరకు ధర్మం కొరకు జాతి కొరకు నిత్యచైతన్యశీలురై శ్రమించిన మహిళలను ఎవ్వరూ మరువలేరు. ఇక కుటుంబ వికాసానికి, వ్యక్తిలో సంస్కారాలు నాటడానికి తమ బాధ్యతగా ధర్మంగా భావించినవారు కోటానుకోట్లమంది ఉన్నారు.

స్వామి శ్రద్ధానంద సరస్వతి~ఆర్యసమాజ్ ద్వారా విద్యా, వైద్య, సేవ, శుద్ధి కార్యక్రమాలు చేపట్టక పూర్వం, ఆంగ్ల నవలలను చదివి, వాటి ప్రభావంతో స్వేచ్ఛా జీవనం కొనసాగించాడు. అప్పటికే వివాహమయింది. ఒక రోజు బాగా త్రాగి మధ్యరాత్రి

ఇంటికి వచ్చి వాంతిచేసుకొన్నాడు. కంపుగొట్టే వాసన. ఆయన ధర్మపత్ని శివ. ఆమె బట్టలకూ, శరీరానికి అంటుకొన్న మురికి తుడిచింది. అంతా శుభ్రం చేసింది. తనకు ఎవరో సేవ చేస్తున్నది లీలగా తెలుస్తూనే ఉన్నా అప్పుడాయన మాట్లాడేస్థితిలో లేరు. తెల్లవారిన తర్వాత రాత్రి ఏం జరిగిందో, భార్య ఎలా సేవ చేసిందో, అంతా తెలుసుకొన్నాడు.

'నన్నాస్థితిలో చూచిన తర్వాత నీకసహ్యం వేయలేదా' అడిగ్గాడు. మున్సీరాం (పూర్వనామం).

'మురికి ఉన్న పిల్లలకు స్నానం చేయించి, శుభ్రం చేసి మంచి బట్టలు తొడుగుతాం కదా' - అన్నది శివ.

'నీవు నన్నెందుకు తరిమిగొట్టి విడిచిపెట్టడం లేదు' అడిగాడు మున్సీరాం.

'అలా చేస్తే మీరు మరీ చెడిపోతారు కదా' చాలా అమాయికంగా అన్నది ఆమె.

'నీకు అక్షరాలు కూడా రావు, ఈ సంస్కారాలు ఎక్కడ నేర్చుకొన్నావు' అడిగాడు మున్సీరాం.

'మా అమ్మను చూచి - మా అమ్మమ్మను చూచి' అన్నది మున్సీరాం ధర్మపత్ని శివ.

ఓహో భారతీయ మహిళా! అని రెండు చేతులెత్తి దండం పెట్టిన మున్సీరాం - ఈ సంఘటన తర్వాతనే పరమనిష్ఠాగరిష్ఠుడైన స్వామీజీ అయ్యాడు. అందుకే మనమూ జై భారతీయ మహిళా అందాం. చేయెత్తి దండం పెడదాం. తల్లులందరినీ భారతమాత ప్రతీకలుగానే భావిద్దాం.

భారత్‌మాతాకీ జై